
కైలాసగిరి
మానస సరోవర యాత్ర
సంకలనము :
జ్యోతిష్యరత్న, వాస్తు సామ్రాట్
శ్రీ ఘటం రామలింగ శాస్త్రి
(శ్రీ చిదానందనాథులు)

A product from the House of **CRANE**



CRANE GROUP

# DURGA
GHEE

FRESH & PURE

®






MANUFACTURED & MARKETED BY
DURGA DAIRY LTD.
NUZIVEEDU ROAD, NUNNA-521212.
VIJAYAWADA, A.P.

రుచికి, సువాసనలకు, స్వచ్ఛతకు

# దుర్గా నెయ్యి

20 సంవత్సరాలుగా నిరంతర అత్యున్నత నాణ్యత
అత్యుత్తమ ఆరోగ్యకరమైన పరిసరాలలో తయారు చేయబడినది

**దుర్గా డెయిరీ లిమిటెడ్**

నూజివీడు రోడ్, నున్న - 521212. విజయవాడ, ఎ.పి. ☎ 2853374

మా ఉత్పత్తులు : భవాని నెయ్యి, కామధేను ఆవునెయ్యి

# కైలాసగిరి

# మానస సరోవర యాత్ర



సంకలనము :

జ్యోతిష్యరత్న, వాస్తు సామ్రాట్

**శ్రీ ఘటం రామలింగ శాస్త్రి**

(శ్రీ చిదానందనాథులు)

బాసర సరస్వతీ ఆస్ట్రాలజీ సెంటర్

10-6-39, శ్రీ బాలాత్రిపురసుందరి నిలయం, నరసరావుపేట - 522 601



గ్రంథకర్త:

## ఘటం రామలింగ శాస్త్రి

జననీ జనకులు :

శ్రీమతి సూర్యకుమారి, శ్రీ రామదాసు

| | | |
|---|---|---|
| జననం | : | 11-04-1964, సంతగుడిపాడు,<br>నరసరావుపేట తాలూకా, గుంటూరు జిల్లా, |
| విద్యాభ్యాసం | : | బి.కాం., నాగార్జున యూనివర్శిటీ |
| సద్గురువు | : | బ్రహ్మశ్రీ మంధా గోపాలకృష్ణ(మద్రాసు) |
| శ్రీ విద్యా దీక్షా గురువు | : | కంఠమాల బిరుదాంకితులు,<br>బ్రహ్మశ్రీ వెలమకన్ని వెంకట సుబ్బావధానులు |
| వృత్తి | : | జాతక, వాస్తు ప్రచారకులు |
| ప్రవృత్తి | : | సంగీత సాధన, భక్తి పాటలకు సంగీత దర్శకత్వము |
| వ్యాపకం | : | భక్తి, మంత్ర శాస్త్ర సాహిత్యపఠనం, సాధన,<br>రచన, క్షేత్రాటనము. |
| బిరుదులు | : | జ్యోతిష్య రత్న, వాస్తు సామ్రాట్ |

### రచనలు :

1) అమరనాథ దర్శనం, 2) శ్రీ బాల త్రిపుర సుందరీ క్షేత్ర మహాత్మ్యము.
3) వరసిద్ధి వినాయక వ్రతము.

### ముఖ్యమైన ఆడియో క్యాసెట్స్ :

1) బాసర సరస్వతి భక్తిమాల ---- సంగీత కంపెనీ, 2) శబరి శిఖరం ---- సంగీత కంపెనీ,
3) సలాం బాబా సలాం ---- మాగ్నా సౌండ్, 4) ఈశా అమరేశా ---- మాగ్నా సౌండ్
5) వెన్నెల్లో సాయి గానం ---- అమర్, 6) శ్రీ రాఘవేంద్ర బృందావనము ---- ఆకాష్
7) శ్రీ అయ్యప్ప చరితము ---- సుప్రీమ్, 8) శబరి సుందరా ---- జూపిటర్
9) నారాయణస్వామి భక్తి మాల ---- ఎస్. ఎస్. ఎస్.






INDEX

| S. NO | NAME | SIGNS |
|---|---|---|
| 1. | ROAD | * * * * |
| 2. | FOOT TRACK | - - - - - |
| 3. | NIGHT HALTS | ◉ |
| 4. | PASSES | ⊗ |

**భువన చంద్ర**, సినీ పాటల రచయిత

11బి, గుణ స్ట్రీట్, కామకోటి నగర్,

వలసర్ వాకం, చెన్నై.



# ముందుమాట

ఓం నమఃశివాయ

పాఠకమహాశయులకు నమస్కారం. చి॥రామలింగశాస్త్రి నాకు సోదర సమానుడు. ఒక కడుపున పుట్టక పోయిన మామధ్య అన్నదమ్ముల బంధం వున్నది. మనిషిగా చి॥రామలింగశాస్త్రి ఉన్నతుడు. మానవతని నిలుపుకున్నవాడు. ఏనాడూ ఎవరినీ నొప్పించి ఎరగని - నొప్పించలేని మృదుస్వభావి. శ్రీ విద్యా ఉపాసకుడు . మంత్రతంత్రాల లోని మర్మమెరిగిన దిట్ట. వాస్తు, జ్యోతిష్యాలలో పేరెన్నికగన్నవాడు. తన పూజలు జపతపాలు తప్ప ఎవరి విషయంలోనూ జోక్యం కలిగించుకొనని వ్యక్తి. అంతటి కుర్రవాడు తన యాత్రానుభవాలను చక్కగా పొందుపరచిన పుస్తకమే ఈ **కైలాసగిరి మానస సరోవరయాత్ర**.

మా వాడి గురించి మరో విషయం చెప్పితీరాలి. చి॥శాస్త్రి, సాలూరి రాజేశ్వరరావు, సాలూరి వాసూరావు వంటి హేమా హేమీల దగ్గర తన సంగీతాన్ని పండించుకున్నవాడు. రాగాలు.. ఆ రాగ ప్రయోగ వివరాలూ క్షుణ్ణంగా తెలిసిన సంగీతజ్ఞుడు. అందువల్లనే ఆ సరస్వతీ మాత సంపూర్ణ కృపకు పాత్రుడయ్యాడు. ఎన్నో భక్తి గీతాలకు ట్యూన్స్ సమకూర్చి కేసెట్లుగా విడుదల చేసి పండిత పామర ప్రశంశల్ని పొందాడు. అతని సంగీత దర్శకత్వంలో అనేక క్లిష్టమైన రాగాలు కూడా సులభంగా ఒదిగి సంగీతానికి ఒక నవ్యతని చేకూర్చాయి.

శాస్త్రి వ్యక్తిగత జీవితం కూడా ఎంతో విశిష్టమైనదే. డిగ్రీ పూర్తయ్యేలోపునే అనేకానేక పుణ్యక్షేత్రాలు (ఇంట్లో చెప్పి కొన్ని... చెప్పకుండా బోలెడన్ని) దర్శించాడు. చిన్నతనంనించే వైరాగ్యం. అనేక మంది సాధుపుంగవులతో వేదాంతచర్చలూ మంత్రదీక్షలు... సంగీతమంటే వల్లమాలిన ప్రేమ. తిరిగి తిరిగి మద్రాసు చేరుకున్నాడు. అక్కడ **"చెట్టు కింద డాక్టర్"** అని మేం ముద్దుగా పిలుచుకునే గోపాలకృష్ణ గారి **'చెంత'** చేరాడు. అక్కడే మా పరిచయం. శ్రీ డాక్టరు గారి గురించి కొంత చెప్పాలి. డా॥ మంథా గోపాలకృష్ణగారిది విజయనగర ప్రాంతమో, వైజాగు ప్రాంతమో?! ఎన్నెన్నో ఉద్యోగాలు (ఉన్నతమైనవే) చేసి మద్రాసు వచ్చారు. డా॥ గాలి బాల సుందరరావు గారి 'ఆత్మప్రేరణతో' హోమియోపతి వైద్యాన్ని కూలంకషంగా అభ్యసించి పానగల్ పార్కు దగ్గర వున్న ఓ వేపచెట్టు కింద నాలుగు కుర్చీలు వేసి 'ప్రాక్టీస్' మొదలు పెట్టారు. ఉదయం 7 గం॥ల నించి

రాత్రి 9 గం॥ల వరకు చెట్టు కింద... ఆ తరువాత రాత్రి 12 గం॥ల వరకు 'హమీదియా' హోటల్ (పాండీబజార్) మెట్లమీద ఆయన మందులనిచ్చేవారు "మంచి రూమ్ తీసుకుని ప్రాక్టీస్ చెయ్యొచ్చుగా" అని వారి మిత్రులు అంటే - **నా వైద్యం సదా బీద ప్రజలకే. రూం అయితే 'కన్సల్టేషన్ ఫీజు' వుంటుందనుకొని పేదవాళ్ళు భావించవచ్చు, డబ్బున్నా లేకపోయినా అందరికీ వైద్యం అందుబాటులో ఉండాలనే 'ప్లాట్‌ఫాం' మీద ప్రాక్టీసు పెట్టాను.** అనేవారు. వారు ప్రాక్టీసు చేసిన 30 సం॥లలో కనీసం 25, 26 లక్షల మందికి ఉచితంగా మందులు ఇచ్చి '**వైద్య నారాయణ**' సేవ చేశారు.

శ్రీ గోపాలకృష్ణగారికి ప్రవేశం లేని ఫీల్డ్ అంటూ లేదు. సాహిత్యం - ప్రపంచ చరిత్ర - సైన్సు మొదలైనవేగాక అష్టాంగ యోగ రహస్యాలు తెలిసిన మహాయోగి. అందువల్లనే వర్షాలొచ్చినా, వరదలొచ్చినా ఎండలు మండిపోతున్నా నిర్వికారంగా తన కుర్చీ వదిలి కదిలే వారు కాదు. వారిప్పుడు భౌతికంగా లేకపోయినా వారి ప్రేమకి నోచుకున్న మాజీవితాలు నిజంగా ధన్యత పొందాయి. 'సద్గురు' అన్వేషణలో శాస్త్రి - 'సినిమా' అన్వేషణలో నేను ఆ విధంగా డాక్టరు గారి దగ్గర చేరాము.

వే వేల కుటుంబాలలో జ్యోతిని వెలిగించిన డాక్టరు గారు మమ్మల్ని ఆదరించారు. బయటికి 'డాక్టరుగా' కనిపించినా ఆ మహాయోగి తన చేతులతో, తన నిరాడంబర జీవితంతో ఎంతో మందిని సన్మార్గంలో నడిపించారు. వారు శరీరాన్ని త్యజించిన అనంతరం వాలాజాబాద్ కు చెందిన 'అగస్త్యర్ ఫౌండేషన్' వారు వారి ఆశ్రమంలో డాక్టరు గారి 'సమాధి' ని నిర్మించి అక్కడ 'ధ్యాన మందిరాన్ని' రూపొందిస్తున్నారు.

ఈ 'కైలాసగిరి - మానస సరోవరయాత్ర' పుస్తకం గురించి రాస్తూ డాక్టరు గారిని ఎందుకు స్మరించుకుంటున్నానంటే - ఆ మహానుభావుడి దివ్య ప్రేమ ఆశీస్సులు నిండుగా పొందిన వారిలో చి॥ రామలింగశాస్త్రి ఒకరు. అందువల్లనే కోటికి ఒకరికి కూడా సాధ్యపడని 'కైలాస మానస సరోవర' దర్శనాన్ని చి॥ శాస్త్రి పొందగలిగాడు.

ఇక అసలు విషయానికొస్తే "కైలాసగిరి మానస సరోవర యాత్ర" పుస్తకంగా మీ చేతుల్లోకి రాకముందే "స్క్రిప్టు" చదివే భాగ్యం కలిగింది. హిమాలయాల గురించీ హిమాలయాలలో సంచరించే సిద్ధులు - యోగులు - మొదలైన మహాపురుషుల గురించీ ఎన్నో పుస్తకాలు చదివాను. నేను Indian Air Force లో 18 సంవత్సరాలు పనిచేసియుండటంవల్ల హిమాలయాల్ని దర్శించే అదృష్టం కల్గిన ... శ్రీశ్రీశ్రీ 'పరమ హంస యోగానంద' (ఒక యోగి ఆత్మకథ), శ్రీశ్రీశ్రీ స్వామి రామ (Living with the Himalayan Masters) వ్రాసిన పుస్తకాలు చదివాక ప్రతిరోజు హిమాలయాల్ని మానసికంగా దర్శించే మహా భాగ్యం కలిగింది. శరీరం ఇంట్లో ఉన్నా మనస్సు మాత్రం ఆ మహాపర్వత సానువుల్లో విహరిస్తుంది.

అలాంటిది, ఈ "కైలాసగిరి మానస సరోవర యాత్ర" చదివాక - ఆ బృందంతోటి నేనూ ప్రయాణించిన భావం కలిగింది. మానసికంగా ప్రతి ఘట్టాన్ని మనముందు భావ చిత్రాలుగా నిలబెట్టిన ఘనత చి॥ శాస్త్రిది.

కేవలం పరిక్రమణ మాత్రమే కాకుండా ఆయా ప్రదేశాలు - అక్కడి జనాభా వివరాలు - అక్కడ వుండే దేవాలయాల పవిత్ర చరిత్రలు వారి ఆహార వ్యవహారాల్నికూడా చి॥ శాస్త్రి చక్కగా ఆవిష్కరించాడు. ఈ పుస్తకం ఏకబిగిన చదివిస్తుంది. తనతోపాటు మనల్ని పవిత్ర మానస సరోవరానికి. కైలాసగిరికి తీసుకు వెళ్ళుతుంది. వారు భౌతికమైన కన్నులతో చూస్తే మనం మానసిక నేత్రాలతో చూస్తాం. ఫలం సమానమే. అంటే ఏ మాత్రం వ్యయ ప్రయాసలు లేకుండా మనం కైలాసగిరిని చుట్టి రాగలమన్నమాట. మరోగొప్ప విషయం ఏమిటంటే ఇది కేవలం తన అనుభవాల్ని పొందుపరచిన పొత్తం కాదు. ఒక గైడ్ లాంటిది. ఆ హిమనగాన్ని చేరడానికి ఎన్నెన్ని మార్గాలున్నాయో ఏ మార్గం ఎంత దూరమో, మధ్యలో ఆగి చూడవలసిన ప్రదేశాలేమిటో అసలు ఈ యాత్ర చెయ్యడానికి భారత ప్రభుత్వంనుంచి ఎలా అనుమతి పొందాలో ఏమేమి వస్తువులు తీసుకవెళ్ళాలో మొదలగు వాటి జాబితాలే కాక చక్కని శ్లోకాలు - సందర్భాన్ని బట్టి సుభాషితాలు - భారత భాగవత భగవద్గీతా సారాంశాలు మనోశక్తిని పెంపొందించే 'మంత్రాలు' శ్రీ శంకర భగవత్పాదుల బోధలు - గురునానక్ - రామదాసు - నారద మహర్షి - గురు అర్జునదేవ్ - మీరాబాయి వంటి మహనీయుల ఆత్మానుభవాలు - 14 లోకాల విశేష విశిష్టతలు - అష్టాంగ మార్గములు - ఇవేకాక 14 రకములైన రుద్రాక్షల వివరాల్ని కూడా పొందు పరచటం జరిగింది.

'సత్సంగత్వే నిస్సంగత్వం' అన్నట్లు ఈ పుస్తకం 'సత్సంగం' లో వుండే విలువను ప్రాక్టికల్‌గా తెలియ చేస్తుంది.

ఇందులో ఏ ఒక్క మాటా కల్పితమో ఊహా భ్రమో కాదు. అక్షర సత్యం. సామాన్యంగా రచయితలు వారు వ్రాసే పుస్తకాల్లోనూ కవిత్వంలోనూ "సొంత" భావాల్ని చొప్పించి పాఠకులకి ఇబ్బంది కలిగిస్తారు. ఇందులో 'సత్యం' తప్ప "సొంతం" లేదు. అందుకు ప్రత్యేకంగా చి॥ శాస్త్రిని అభినందించి తీరాలి.

చివరగా ఒక్క మాట ---

న్యాయంగా ఈ మాట ముందుగా వ్రాయాలి. కాని చివర్న వ్రాయటమే సముచితమనిపించింది. వైకుంఠ దర్శనం - బ్రహ్మలోక(సత్య) దర్శనం శరీరాన్ని వదిలిపెడితేగాని కలుగవు. కేవలం 'కైలాసాన్ని' మాత్రమే 'బొంది' తో దర్శించుకోగలము. అలా బొందితో కైలాస దర్శనం చేయగలగటం జన్మ జన్మల పుణ్యం. కేవలం ధనం వున్నంతమాత్రానో, పలుకుబడి

వున్నంతమాత్రానో సాధ్యమయ్యే పనికాదు. భగవదనుగ్రహం నిండుగా వుండాలి.

ఆ అనుగ్రహం పొందిన చి॥ శాస్త్రిని మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తూ ఈ పుస్తకాన్ని చదివిన - చదువుతున్న మీ అందరికి కూడా ఆ మహా శివుని అనుగ్రహం ఆశీస్సులు లభించాలని హృదయపూర్వకంగా కోరుకుంటూ నా ఈ అభిప్రాయాన్ని మీకు తెలుపుకునే అవకాశాన్నిచ్చిన చిన్న తమ్ముడు శాస్త్రికి ధన్యవాదాలు తెలుపుకుంటూ శలవుతీసుకుంటున్నాను.

31. 10. 2003



# ఆశీస్సులు

**బ్రహ్మశ్రీ వెలమకన్ని వేంకట సుబ్బావధాని, శ్రీ విద్యా దీక్షాపరులు.,**
నరసరావుపేట.

శ్రీ గణేశ బాలా దక్షిణామూర్తయే నమః

సంతగుడిపాడు వాస్తవ్యులు ప్రస్తుతము నరసరావుపేట వాస్తవ్యులైన బ్రహ్మశ్రీ వేదమూర్తులైన ఘటం రామలింగ శాస్త్రిగారు వీరు బాల్యము నుండి హారణవిద్యా, సంగీత సాహిత్యములందు, హిందీ సాహిత్యరత్న, బి.కాం., మొదలగు విద్యలయందు ప్రావీణ్యులై హస్త సాముద్రిక, జ్యోతిష్యము, వాస్తు, నక్షత్రముల ననుసరించి జాతక చక్రములు ముహూర్తములు, త్రింశత్ భాగయుక్తమైన లగ్నమును స్ఫుటముచేసి గోచారరీత్యాగాని, జాతక ముహూర్తములరీత్యాగాని రానున్న మహోన్నత పదవులుగాని, నిత్య కష్టనష్టములను వివరణగా మనకు అందజేయుచూ జాతక ప్రభావరీత్యా, మంత్ర శాస్త్రరీత్యా గురువుల సన్నిధానమునందు శ్రీవిద్యా దీక్షా, మహావిద్యా పారాయణము, నక్షత్రశాంతులు, నవగ్రహ శాంతులు ఇతర గ్రహబాధలను తొలగించి ప్రజలకు మేలు చేయుట కొరకై బ్రహ్మచర్య వ్రతదీక్ష ననుసరించి "మానస సరోవరాది, కేదార, బదరి, అమరనాథ" పుణ్య క్షేత్రములను దర్శించి వాటి మహిమను యావత్తు పొంది అందరి క్షేమమును, భారత దేశ ప్రజానీక క్షేమమును కోరి లోక కళ్యాణార్థమై నిత్యమూ మహావిద్యను పారాయణచేయుచు, పరదేవత యొక్క మహాదుర్గ అనుగ్రహముచేత లోక కళ్యాణమునకై ఈ తపస్సును నిర్వహింపబడినది. అంతే గాక వ్యాస మహామునిచే ప్రతిష్ఠింపబడిన బాసర క్షేత్రమందు సరస్వతీ మాత అనుగ్రహమును పొంది అక్కడ అనేక అనుభూతులు పొంది, ఆ అనుభూతిని అనేక వేల మంది భక్తులకు అందజేసిరి. ప్రస్తుతము "మానస సరోవర యాత్ర" ను పుస్తక రూపమునకు తెచ్చుట శ్లాఘనీయము. ఇంతకుముందే 'అమరనాథ దర్శనము' చేసి స్వామి అనుగ్రహమును పొంది స్వామి అనుజ్ఞచేత అమరనాథ చరిత్రను అచ్చు వేసి ప్రజలందరికీ ఉచితముగా అందజేయుట జరిగినది. ఆ కారణమున 'కైలాస గిరి మానస సరోవర యాత్ర' మహిమను అందరికి వెల్లడి చేయసంకల్పించినందుకు మా శిష్యునకు ఇవే నా ఆశీస్సులు......

ఇట్లు

**వెలమకన్ని వేంకట సుబ్బావధాని**

# శ్రీ త్రిపురానంద నాథులు

లక్కవరం పోస్టు, పశ్చిమగోదావరి జిల్లా. ఆంధ్రప్రదేశ్.

శ్లో॥ గోపానంద హిమాచల ప్రభవ వాక్యాలంకషా జాహ్నవీ
సోపానంబుల నిర్చి నింపు ఘటమే సూక్ష్మాతి సూక్ష్మంబు చిత్
రూపానందము రామలింగమగుచున్ లోలోని కైలాస భా
వాపః ప్రౌఢిమ మానసంబగును యాత్రా దర్శ సంమర్శమై ॥

శ్లో॥ మానసమే సరోవరము మౌనమె యోగము భావ చంద్రికా
యానము సద్గతిప్రదము ధ్యాన నిమగ్న జపాది సత్క్రియల్
తానము లాడుచుండ పర తత్త్వ మహోద్రుమ పుష్పసౌరభ
స్నానము లెంతయున్ పరిత నాణ్యత కిచ్చెడి భావ్య బిందువుల్ ॥

శ్లో॥ శుభగానంద సనాథ నాథిత సరఃశోభా ప్రధానంబు వా
గిభరాడ్ వైభవ మాంధ్రవాణి కొకదా హేలా విలాసమ్ము సం
రభ మాజాతిగ వాక్య సంన్యసన సారం బీశ్వరా రూఢ మౌ
ప్రభలన్ పారక సంతతిన్ నలిపి సంబాళించు నాత్మీయతన్ ॥

శ్లో॥ నవలలు చిత్రసీమలు మనస్సున కెంతయు నిష్ఠ గూర్చునే
డెవడిది శ్రద్ధసేసెడి నవీన విహార విశుద్ధ యాత్రలన్
నవనము పోలి దిద్దుట విశాల హృదంతర భావ వేద సం
భావమని సత్య వాక్కుల సభాపతులందరి ముందు నిల్చుతన్ ॥

శ్లో॥ ఆశీర్వచన ము లియ్యవి
సౌశీల్య సమయ తపః ప్రసంగ విభూతుల్
దేశీ తీర్థ విలాసతు
లాశాంతము వెలసి దీప్తి నరయును గాతన్ ॥

——స్వామి శ్రీ త్రిపురానందనాథ

8-12-2003

**డా॥ తెలికేపల్లి లక్ష్మీనారాయణ శాస్త్రి,** M.A. Ph.d.,

రిటైర్డ్ రీడర్,

వ్యవస్థాపకుడు, అధ్యక్షుడు : శ్రీ వ్యాసపీఠం,

5-4-8, శ్రీరాఘవ సదనమ్, నరసరావుపేట - 522 601

# అక్షర నీరాజనం

ఈ 'ఘటం' సామాన్యమయినదికాదు. మూడుముళ్ళ ముచ్చట్ల వయసులో ముక్తినొసగే అందాలకు ఆనందాలకు ఆలయాలయిన హిమాలయాలలో యాత్రలు చేశారు. ఇప్పటివరకూ ఒక వీర యాత్రికునిగా కనిపించిన శ్రీ శాస్త్రిగారు ఇప్పుడు ఒక వర్తమాన రచయితగా మనకు పరిచయమవుతారు. కాలు కదల్చకుండానే, వొళ్ళు నలగకుండానే కైలాసగిరి దర్శనం చేసికొన్న దివ్యానుభూతి కలుగుతుందా ఈ గ్రంథపఠనంలో అనుక్షణం ఉత్కంఠ, అందాల దృశ్యాలను తిలకించు ఆనంద రసానుభూతితో, పరవశించిపోవటం, యాత్రా దీక్షలో పుణ్యకథా శ్రవణం పూర్వకాలంలో వుండేది. అవే కాశీమజిలీకథలు. అలాగే మనశాస్త్రిగారు భక్తినిగురించి - భక్తి విధానాలగురించి, బుద్ధునిగురించి - బౌద్ధమతంగురించి, ఆచార్య శంకరులగురించి - ఆత్మగురించి, లోకాలగురించి లోకాతీత రహస్యాల గురించి - చివరికి ముక్తి గురించి - ముక్తి సోపానాలగురించి ఎన్ని విషయాలో, ఎన్నెన్ని విషయాలో విశదం చేశారు. మానస సరోవరంలో కాంతి పుంజ కథనం మనకు కూడ మరువరాని మహిమాన్వితమయిన అద్భుతరసాను భూతి కలిగిస్తుంది. ఎంతో పుణ్యం చేసికొంటేనే కైలాసగిరి దర్శనం. ఎంతో కొంత పుణ్యం చేసికొంటేనేగాని ఈ గ్రంథ పఠన భాగ్యమూ లభించదు. ఈ గ్రంథం చదివిన తరువాత మళ్ళీమళ్ళీ చదవాలన్న దాహం ఏ జన్మకయినా కైలాసగిరి దర్శించాలన్న తపన తప్పవు. నాచేత మానసికంగానయినా మానససరోవర యాత్ర చేయించిన బ్రహ్మశ్రీ ఘటం రామలింగశాస్త్రిగారికి ధన్యవాదాలు చెప్తే చాలవు. అందుకని ఆత్మీయతతో 'అక్షర నీరాజనం'.

ఇట్లు

**తెలికేపల్లి లక్ష్మీనారాయణశాస్త్రి**

# మనవి

## ఓం శ్రీ మాత్రే నమః

శ్లో॥ తాపాపహారిణీం దేవీం భుక్తి ముక్తి ప్రదాయినీం
అనంతాం విజయాం శుద్ధాం శరణ్యాం శివదాం శివాం ॥

ఎందరో మహానుభావులు - అందరికీ వందనములు.

ఆధ్యాత్మిక మార్గములో పయనించేవారికి తీర్థయాత్రలు సాధనగా చెప్పవచ్చు. ఇష్ట దైవమును ఈ యాత్రలో స్మరించుకుంటూ అందరితో కలసి మెలిసి యాత్ర చేయుటవలన అహంకారము నశించి భక్తి భావము పెరుగును. యాత్రలో ఉండే కష్టనష్టములు వలన దైవధ్యానమును పెంపొందించును. వేదాంత దృష్టితో పోల్చిన ఈ యాత్రలు చాలా అల్పమయినవి. ఈ మానవ శరీరములోనే సృష్టి అంతాయున్నది. అంటే సప్త నదులు, పర్వతములు, దేవాలయములు, మానస సరోవర కైలాస గిరిలు, ముక్కోటి దేవతలు ఒకటేమిటి సమస్తము మన శరీరములోనే యున్నవి. కాని తెలుసుకొనుట అందరికి అంత సులభతరమైన విషయము కాదు. యోగులకు మాత్రమే అది సాధ్యమవును. సామాన్య మానవులకు సాధ్యపడుట దుర్లభమే కదా! అందుకే మనలోఉన్న ఈ క్షేత్రములను బాహ్య దృష్టితో చూసిన ఆ క్షేత్రముల పుణ్య ప్రభావమువలన పాపక్షయమగును.

గతములో కొంతమంది 'బదరీ, కేదార్ నాథ్, గంగోత్రి, యమునోత్రి, అమరనాథ్' మొదలగు యాత్రలు చేసితిరి. వారి ముఖ్య ఉద్దేశ్యము ప్రకృతి సౌందర్యమును జూసి ఆనందించవలెననెడి కోరిక మాత్రమే. భక్తి అత్యల్పము. ప్రకృతి సౌందర్యము నిజంగా గొప్పదే. గంగా జలముల గంభీరనాదం, అద్భుతమైన అన్ని కాలముల వాతావరణము అనుభూతిని మరువరానిది. అటువంటి ఈ వాతావరణములో పయనించి ఆనందించవలసినదేగాని వర్ణించలేము. ఆవిధముగా ఆనందించుదాము అనుకొని వర్ణించలేము. ఆవిధముగా ఆనందించుదాము అనుకొని పయనించిన వారు చివర్కి ఆధ్యాత్మిక మార్గము పయనము సాగించుచూ, సాధువులుగా సంచరించుచుండిరి. హిమాలయముల సౌందర్యము వెనుక అట్టి ఆధ్యాత్మిక మహత్తు గలదు.

నేను 1986 సంవత్సములో (నా వయస్సు షుమారు 22 సం॥లు) మొట్ట మొదటగా హిమాలయములను సందర్శించుట జరిగినది. ఊహకు అందని విషయం ఇది. ఏనాడు నేను హిమాలయములకు వెళ్ళే ఆలోచనే చేయలేదు. అట్టిది చేతిలో చిల్లిగవ్వ కూడా లేకుండా ఇంట్లో చెప్పకుండా హిమాలయములను దర్శించితిని. ఇది అంతయూ బాసరలోయున్న శ్రీ జ్ఞాన సరస్వతీ అమ్మవారి మహిమగా చెప్పవచ్చు. ఈ ప్రయాణములో ఎన్నో అను భూతులు, సిద్ధులను జూడటం సంభాషించడం మరియు వారి మహిమలను ప్రత్యక్షంగా జూడటం కూడా జరిగింది. కాని, నాకు అప్పుడు చిన్న వయస్సు కదా! పూర్తి స్థాయిలో వాటిగురించి అవగాహన లేక పోవటం గావచ్చు

నేమో. అద్భుతమని ఆశ్చర్యమును పొంది విభ్రాంతతకు లోనయ్యాను. (అప్పుడు అటువంటి సిద్ధులు, మునులను చూడవలెననెడి ఆకాంక్ష?) సరియైన అవగాహన ఉన్నట్లయితే తిరిగి నరసరావుపేటకు వచ్చి యుండేవాడిని కాదేమో! అంతవరకే నాకు ప్రాప్తమని భావించవచ్చు.

స్నేహితుడు విశ్వనాథ్ ప్రోద్బలముపై మద్రాసుకు రావటం. అచట శ్రీ సాలూరి రాజేశ్వరరావు మరియు వారి కుమారులందరి అభిమానము సంపాదించుటవలన సంగీతాభివృద్ధి కలిగినది. అచ్చట పానగల్ పార్కు దగ్గర యున్న 'చెట్టు కింద డాక్టరు' గారితో పరిచయము నా జీవిత గమనాన్ని మార్చివేసినది. కంచి పరమాచార్య జగద్గురు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతిగారి ఆశీస్సులే నాకు ఈ శ్రీ విద్యోపాసనకు మూలకారణము కాగా, బ్రహ్మశ్రీ కంఠమాల బిరుదాంకితులగు వెలమకన్ని వేంకట సుబ్బావధానిగారు నన్ను చేరదీసి శ్రీ విద్యా దీక్షాపరునిగాచేసి, 'చిదానందనాథునిగా' ఆశీర్వదించితిరి.

జగద్గురులు ఆశీర్వచనము నన్ను ఆశ్చర్యపరచినది.

"భారతదేశములో యున్న ఉత్కృష్టమైన పుణ్యక్షేత్రము లన్నియు దర్శించి. ప్రజలకు మేలుచేయుగలవు. నీవు నేర్చుకున్న సంగీతమునకు తగు ఫలితము కలుగును. పరదేవతయందు మనస్సు నిల్పి సదా ఆమె చరణములను ఆశ్రయించుము" అని శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామివారు ఆశీర్వదించితిరి.

పెద్దల ఆశీర్వచనము వమ్మగాదు కదా! ముమ్మారు చార్‌ధామ్ యాత్ర, నాలుగుసార్లు అమరనాథ్ యాత్ర, ఒక్కసారి కైలాసగిరి మానస సరోవరయాత్ర మరియు భారతదేశములో అనేక పుణ్యధామములను కూడా దర్శించుట జరిగినది.

నాకు ఏడవ సంవత్సరమునే మా తండ్రిగారు దివంగతులైరి. మా అమ్మగారు అపరిమిత ప్రేమానురాగాలతో పెంచి పెద్ద చేసితిరి. ఒక్కగానొక్క కొడుకునుగదా! ప్రాణములన్నియూ నామీదే పెట్టుకొని పెంచిపెద్ద చేసినది. అటువంటి 'మాతృమూర్తి' యిటువంటి కష్టతరమైన యాత్రలు చేయుటకు అనుమతించి నందులకు హృదయపూర్వక సహస్ర నమస్కారములు చేయుచున్నాను.

కైలాసగిరి - మానససరోవర యాత్రను పూర్తి చేసుకొని విజయవాడకు రైల్వే స్టేషనులో రైలు దిగాను. స్నేహితులు, శ్రేయోభిలాషుల సంతోష కరమైన నినాదములు వారి ఆనందమునకు మరియు మాతృ మూర్తి ఆనందమునకు అబ్బురపడితిని. సుబ్బయ్యచౌదరి, ఆదిశేషయ్య, శేషగిరిరావు, సాయిమోహన్, లక్ష్మీనారాయణ, డా॥ సుబ్బారావు, పాలశేంద్రం వేంకటేశ్వరరావు, జయరామరెడ్డి(సంతగుడిపాడు), రామిరెడ్డి(పాలపాడు) మొ॥గు వారందరూ విజయవాడనుండి కారులో నరసరావుపేటకు తీసుకొని వచ్చిరి. బ్రాహ్మణ సమారాధనను చేసి, పెద్దల ఆశీర్వాదమును పొందుట జరిగినది.

ఈ పుస్తక ముద్రణ సహృదయతతో ప్రోత్సహించిన వారిలో ముఖ్యులు 'తిరుమల మిల్క్ డైరీ' యాజమాన్యములోని డైరెక్టర్లు అయిన శ్రీ బ్రహ్మానాయుడు, శ్రీ వెంకట్రావు, శ్రీ బ్రహ్మానందము,

నాగేశ్వరరావుగార్లు, మిత్రులు ఆత్మీయులైన బొగ్గరం ఫణిరాజ కుమార్(ఆడిటర్), సోదర సమానుడు యాత్రాభిలాషి నాతోటి మూడుసార్లు అమరనాథ యాత్ర చేసిన బూసా సుబ్రహ్మణ్యము( క్రేన్ వక్కపొడి & దుర్గా నెయ్యి డీలర్ ) గార్లకు ఇతర మిత్రులకు హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేయుచున్నాను.

గతములో "మకర దీపం" ఆధ్యాత్మిక మాస పత్రికలో ఈ యాత్రను షుమారు రెండు సంవత్సరములు సీరియల్‌గా ప్రచురించి అభిమానించిన మిత్రులు శ్రీ కె.వి.యం. రావుగారికి మరియు వేంకట్రావు గురుస్వామివారికి కృతజ్ఞతలు తెలియజేయుచున్నాను.

ఎన్నెన్నో బాడీలకు రచనలు చేయుచూ కాలముతో పోటీ పడుతూ కాలమును సద్వినియోగముచేయుచూ ఎంతో బిజీగా ఉంటూ, నాపై ఆప్యాయతతో సోదర ప్రేమతో 'తొలిపలుకు' వ్రాసిన మా అన్నయ్య సినీరచయిత
'భువనచంద్ర' గారికి నా హృదయపూర్వక నమస్సుమాంజలులు.

ఎన్నో ఆధ్యాత్మిక కార్యక్రమములో నిరంతరము నిమగ్నమై ఉంటూ కొంత సమయం వెచ్చించి పుస్తకములోని అచ్చుతప్పులను దిద్ది మరియు వారి అమూల్యమైన అభినందనలు వ్రాసి పంపిన శ్రీ డా॥ తెలికేపల్లి లక్ష్మీనారాయణ శాస్త్రిగారికి కృతజ్ఞతలు.

పుస్తక ముద్రణలో ఇతోధికంగా ధన సహాయం చేసిన వారందరికీ, ఎంతో ఓర్పుతో నేర్పుతో సకాలంలో ముద్రణ జరిపి ఇచ్చిన 'స్మైయిల్ డిజిటల్ మైండ్స్' అధినేత శ్రీ నాగరాజుకు ఆ పరమేశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్యములనందించి సదా కాపాడాలని కోరుకుంటున్నాను. యిందలి లోపములు సహృదయులైన పాఠకులు మన్నింతురుగాక.

ఎంతో ప్రేమతో ఆశీర్వదించి పంచరత్నములిచ్చిన స్వామి శ్రీ త్రిపురానంద నాథులకు హృదయపూర్వక నమస్సుమాంజలులు.

శ్రీ శ్రీ శ్రీ జగద్గురు కంచి కామకోటి పీఠాధిపతులు కరుణాకటాక్షవీక్షణముతో శ్రీముఖము ప్రసాదించిరి. వారికి సాష్టాంగ నమస్కారములు చేయుచూ.......

ఈ పుస్తకమును

**కంచి కామకోటి పీఠమునకు అంకితమిచ్చుచున్నాను.**

ఇట్లు

స్వభాను నామ సం॥ర మార్గశిరమాసము — బుధజన విధేయుడు

11-12-2003 — ఘటం రామలింగశాస్త్రి






| S. NO | NAME | SIGNS |
|---|---|---|
| 1. | ROAD | - - - - |
| 2. | FOOT TRACK | - - - - - |
| 3. | NIGHT HALTS | ◉ |
| 4. | PASSES | ⊗ |

## Map of Kailash - Mansarovar and Gurla La



# విషయసూచిక

తిరుగు ప్రయాణము

# కైలాసగిరి
# మానస సరోవర యాత్ర

ఘటం రామలింగ శాస్త్రి

యాత్రలన్నింటిలోనూ ఉత్తర ఖండములోని యాత్రలు చాలా కష్టతరమైనవి. అచట ...కృతి ప్రతి క్షణము వివిధ రూపములుగా శోభిల్లుతూ, మనస్సును ఆహ్లాదపరచును.

ఈ ఉత్తర ఖండములోని యాత్రలలో ముఖ్యమైనవి హరిద్వార్, ఋషికేశ్, బదరీనాథ్, ...దార్‌నాథ్, గంగోత్రి, యమునోత్రి, అమరనాథ్, జమ్మూ వైష్ణవి, మణిమహేష్, నేపాల్, కైలాసగిరి ...రియు మానస సరోవరం.

పూర్వకాలంలో ఈ యాత్రలు చేయవలెనంటే జీవితకాలం సరిపోయేది. కాలం మరింది. ...లానుగుణంగా ఎన్నో మార్పులు వచ్చాయి. ఆధునిక టెక్నాలజీ, కమ్యూనికేషన్ వ్యవస్థ అభివృద్ధి ...ందింది. ప్రయాణపు వసతులు మెరుగందాయి. ఎన్ని వసతులు, ప్రయాణములలో అభివృద్ధికరమైన ...ర్పులు వచ్చినా, ఈ "మానస సరోవర కైలాసగిరి" యాత్ర చేయుట ఇప్పటికి చాలా కష్టతరమే. ...నసిక ధైర్యము, ఆత్మవిశ్వాసము, దైవ భక్తి యున్నవారికి చాలా సులభతరమే!

కొద్దిమందికి మాత్రమే ఈ "మానస సరోవర కైలాసగిరి" యాత్రను గురించి తెలియును. ...ంతమందికి ఏవిధముగా వెళ్ళాలో సరియైన మార్గదర్శకత్వము లేకనూ, కొంతమందికి ...రోగ్యలోపంవలన, కొంతమందికి ఆర్థిక స్థితివలన ఆ యాత్రను చేయలేక పోవుచుండిరి.

...త్తరమ్ యత్ సముద్రస్య, హిమాద్రేచ్చైవ దక్షిణమ్,
...ర్షం భారతం నామ భారతీ యాత్ర సంతతిః ॥"

...ముద్రానికి ఉత్తరంగా, హిమ పర్వతములకు దక్షిణంగావున్న దేశమును భారతదేశమని ...రాణములు చెప్తున్నాయి.

ఋషుల తపస్సుకు స్థానంగా హిమాలయములున్నాయి. ఈ హిమాలయములు పౌరాణిక, ...్క, సంస్కృతి ప్రాధాన్యత సంతరించుకొని యున్నాయి. మేరుపర్వతము ఈ పర్వత శిఖరాలలోనే ...న్నది.

కైలాసము పరమ శివుని ఆవాసం. ఈ పర్వతము దివ్యలోకములకు లంకెగ యున్నది. కాళిదాస మహాకవి తన కావ్యములైన కుమార సంభవము, మేఘదూతములలో ప్రముఖముగా మానస సరోవరం కైలాసగిరిల వర్ణనలు చాలా సహజంగా గోచరించుచున్నాయి.

మత్స్యపురాణం, బ్రహ్మాండ పురాణం, వాయు పురాణం, లింగ పురాణాదులలో ప్రముఖంగా వీటి వర్ణనలు, ప్రాశస్తి గలదు. అట్టి గొప్ప మహిమాన్వితమైన ఈ పుణ్యభూమిని దర్శించుట ఆ పరమేశ్వరుని కటాక్షమే అని చెప్పవచ్చు. అంతేగాక జన్మనిచ్చిన తల్లిదండ్రులు, గురువులు, పెద్దల యొక్క ఆశీర్వచనము, శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి స్వామివారు నాకు ఉపనయన సంస్కారముచేసి ఆశీర్వదించిన ఫలితంవలన ఈ యాత్రను పూరిచేసితినేమో!

పూర్వము ఈ ప్రదేశము 'టిబెట్' దేశములో నున్నది. నేపాల్, టిబెట్ దేశములు ఒకప్పటి అఖండ భారతావనిలో భాగమే. ఈ టిబెట్ దేశము దేవభూమిగా పురాణ ప్రాశస్త్యము గలిగియున్నది. 1962న జరిగిన యుద్ధములో ఈ పరమ పవిత్రమైన భూమిని చైనావారు దురాక్రమించారు. ఈ కారణం వలన 1962 నుండి 1981వ సంవత్సరము వరకు ఈ యాత్రను చేయుటకు భారతీయ యాత్రికులకు చైనా ప్రభుత్వము అనుమతి ఇవ్వలేదు. ఆ తరువాత భారతీయ గవర్నమెంటువారికి, చైనా ప్రభుత్వమునకు కుదిరిన ఒప్పందము ప్రకారం 1981 సంవత్సరంనుండి ఈ యాత్ర ప్రారంభమైనది. ఈ యాత్రను చేయవలెనంటే 'చైనా వీసా' తప్పనిసరి అయినది. ఈ యాత్రలో అధిక భాగము నడక(Treekking) ప్రాధాన్యత కలిగియున్నది.

## ఈ యాత్రకు మార్గములు

ఈ 'మానస సరోవర కైలాసగిరికి' 52 మార్గములున్నాయి. 12 మార్గములు మాత్రమే అతిముఖ్యమైనవి.

1) ఢిల్లీ నుండి దార్చులా(Darchula) వరకు బస్సులోనూ, అచటినుండి గుంజి, కాలాపాని, లిపులేక్ పాస్‌ద్వారా తక్లా కోటికి చేరుట. మొత్తం దూరం సుమారు 950 కి.మీ.

2) ఆల్మోరా(Almora), ఆస్కోట్, ధర్మాపాస్, గ్యానిమా నుండి సుమారు 20,000 అడుగుల ఎత్తైన ప్రదేశముద్వారా 375 కి.మీ. ప్రయాణం.

3) ఆల్మోరా(Almora) భాగేశ్వర్, ఉనతాదుర్‌పాస్, జయంతిపాస్ ద్వారా సుమారు 19,000 అడుగుల ఎత్తైన ప్రదేశముద్వారా 355 కి.మీ. ప్రయాణం.

4) బదరీనాథ్(Badarinath) దగ్గరవున్న జోషీమఠ్(Joshimutt) నుండి గుమ్‌లా నితిపాస్ ద్వారా నంబ్రామండి, సిచ్చిలింనుండి 18,000 అడుగుల ఎత్తైన ప్రదేశంద్వారా సుమారు 338 కి.మీ. ప్రయాణం.

5) బదరీనాథ్(Badarinath) నుండి మానాపాస్ ద్వారా గ్యానిమాద్వారా 19,000 అడుగుల

ఎత్తైన ప్రదేశముద్వారా సుమారు 389 కి.మీ. ప్రయాణం.

6) జోషీమఠ్(Joshimutt) నుండి దుంజన్ నిధిపాస్ ద్వారా 19,000 అడుగుల ఎత్తైన ప్రదేశముద్వారా 277 కి.మీ. ప్రయాణం.

7) జోషీమఠ్(Joshimutt) నుండి హోటినితిపాస్, గ్యానిమా ద్వారా 16,900 అగుగుల ఎత్తైన ప్రదేశముద్వారా 268 కి.మీ. ప్రయాణం.

8) సిమ్లానుండి రాంపూర్ తీర్థపురి ప్రదేశముద్వారా 19,200 అడుగుల ఎత్తైన ప్రదేశముద్వారా 772 కి.మీ. ప్రయాణం.

9) ఖాట్మండు నుండి టింకర్‌పాస్, ముక్తినాథ్ ద్వారా 18,600 అడుగుల ఎత్తైన ప్రదేశముద్వారా 1323 కి.మీ. ప్రయాణం.

10) శ్రీనగర్ నుండి జోజిలాపాస్, తీర్థపురిద్వారా 17,800 అడుగుల ఎత్తైన ప్రదేశముద్వారా 970 కి.మీ. ప్రయాణం.

11) గంగోత్రి(Gangothri) జీలూభాగ్ పాస్, గ్యానిమాద్వారా 18,200 అడుగుల ఎత్తైన ప్రదేశముద్వారా సుమారు 412 కి.మీ. ప్రయాణం.

12) లాసా(Laasa)ద్వారా సుమారు 1320 కి.మీ. ప్రయాణం.

ఈ 12 మార్గములలో తక్కువ ప్రమాదములుగల దారి ప్రస్తుతము భారత ప్రభుత్వము ద్వారా నడపబడుచున్నది.

అయితే ఇటీవలి కాలంలో నేపాల్ నుండి ఈ యాత్రను చేస్తున్నారు. ఖాట్మండునుండి కొటూరం మార్గములో జీపులో రఖంగమ్మా(Zhangmu), సాగా(Samgsang), ప్రయాంగ్(Prayang), దార్చేన్‌కి చేరవచ్చును. ఇచ్చట నుండి కైలాస పర్వతముచుట్టూ నడకలో పరిక్రమ ప్రారంభమగును. మూడురోజుల పరిక్రమ అనంతరం మరలా జీపు(Zeep)లో మానసరోవర తీరప్రాంతమునకు 'ఛివూ గోంపా'కి చేరుట, అక్కడ స్నానాదికార్యక్రమములు పూర్తి చేసుకొని ఖాట్మండుకు తిరుగుప్రయాణమగుట జరుగును. సుమారు 14 రోజులులో ఈ యాత్రను పూర్తిచేయవచ్చును.

ఈ మార్గములో అనేక ప్రైవేటు టూరిజం వాళ్ళుకూడా ఈ యాత్రను నిర్వహించుచున్నారు.

1) Jyothi Adhikari, Ecotreck, P.O. Box No. 6438, Thameal, Katmandu,NEPAL - Ph. : 424112, Fax : 00977 - 1- 413118.
2) Kailash Travel, Flat No. 5, 118, Haver Stock Hill, LONDON NWS. Tel : 01-586 7372
3) Mountain Travel, 6420 Fair Mount AVE, EL CERRITO, CA 95530, USA.
4) Tiger Mountain Travels INT. Ltd, PO Box 3989, Durbar Marg, KATHMANDU, NEPAL. Ph. 221379, Fax - 977 - 221379.

5) Span World Travels Pvt. Ltd., Upper G.P(Reerwing), 36 Janpath, New Delhi -1, INDIA. Ph: 011-28639166.

భారత ప్రభుత్వము మాత్రము దార్చులా(Darchala), తవ్వాఘాట్(Tawwaghat) నుండి లిపులేక్ పాస్(Lipulekpass) ద్వారా తక్లాకోట్‌కి చేరుట ఎక్కువదూరము అయినప్పటికీ ప్రయాణమునకు ఎంతో అనుకూలమైనదని శ్రీశ్రీశ్రీ ప్రణవానందస్వామివారు కూడా ఆమోదించారు.

భారత ప్రభుత్వము ఈ యాత్రను నిర్వహించక పూర్వము శ్రీ నారాయణస్వామి, శ్రీ ప్రణవానందస్వామివార్లు ఈ యాత్రలను నిర్వహించెడివారు.

## నేపాల్ దేశమున చూడ ముఖ్య యాత్రా స్థలములు

1) బుద్ధుని పట్టణము కపిలవస్తు, 2) బుద్ధుని జన్మస్థానము లుంబినీవనము, 3) ఖాట్మండులోని పశుపతినాథుడు, 4) ఇంద్రకీలాద్రిపైనవున్న భాగేశ్వరదేవి, 5) సాలగ్రామములకు జన్మస్థలమగు 108వ దివ్య తిరుపతియగు ముక్తినాథక్షేత్రము, 6) సీతారాము కల్యాణభూమియగు జనకపురి పట్టణము, 7) ఖాట్మండులోని స్వయంభూనాథ్ స్తూపం.

ఇచట 45 అడుగుల ఎత్తుగల శివలింగం గలదు. ఇచట బౌద్ధులు, హిందువులు ఒకేచోట బుద్ధ, శివపూజలు జరుగుట విశేషము. పదిహేనో శతాబ్ధమునకు చెందిన స్వయంభూ పురాణములో నేపాల్ గురించి వ్రాసియున్నది.

ఒకసారి బుద్ధుడు తన శిష్యులతో ఒక సరోవర తీరమునకు వచ్చి, ఆ తీరప్రాంతములోనే కొన్నిరోజులు ఉండెనట. ఒకరోజు ఆయన సరస్సులో స్నానమాచరించి, సరోవరమునకు మూడుసార్లు ప్రదక్షిణచేసి, ఒక తామరదుంపను మంత్రించి సరోవర జలములో వేసెనట. ఈ తామరదుంప మొలకెత్తి పూవ్వు పూయగానే, స్వయంభూదేవుడు ఈ పద్మంలో అవతరించునని చెప్పెను. పిదప బుద్ధుడు చెప్పినట్లుగానే "స్వయంభూ" పద్మంనుండి గొప్పతేజస్సుకాంతితో వెలిచింది. ఆ కాంతిపుంజమును సందర్శించిన మునులు, ఋషులు, దేవతలు ధన్యులయ్యారు. బోధిసత్వమంజుశ్రీ ఆకాంతిపుంజమును దర్శించి ఆశ్చర్యపోయెను.

సరోవరములోని నీటిని బయటకు పంపినయెడల అందరికి 'ఆస్వయంభూ' అందుబాటులో వుండునని తలచి, సరోవరము ప్రక్కన వున్న ఒక పర్వతమును ఖండించి, ఒక చిన్న దోవను ఏర్పరిచెను. ఆ సరస్సులోని నీరంతయూ బయటకు వెళ్ళి, లోయ మాత్రము మిగిలినది. కాలక్రమేణ ఆ లోయ జనావాసముగామారి ఖాట్మండుగా మారినది. ఆ తామరపువ్వే కొండగాను, కాంతిపుంజం స్వయంభూనాథగా మారినది. ఇట్టి గొప్ప మహిమాన్వితమైన క్షేత్రమును చూడవలసినదేగా!.

# పశుపతి నాథుడు

అష్టమూర్తులలో ఒకరూపం పశుపతినాథుడు 'బాగ్మతి' నదీ తీరములో ఈ ఆలయంగలదు. అర్జునుడు ఇచటనే పాశుపతాస్త్రమునకై తపమాచరించి, శివునితో పోరుసల్పి, శివానుగ్రహమువలన "పాశుపతాస్త్రము" పొందెనని, అందువలన ఇచట ఈశ్వరునకు "పశుపతి" అనే నామధేయము వచ్చెనని చెప్పుదురు.

పశుపతి మందిరమునకు కొలది దూరములో 'గుహేశ్వరీ దేవి' అమ్మవారి దేవాలయము' గలదు. శక్తి పీఠములలో ఇదియొకటి. ఇచటి దగ్గరిలోనే వున్న కాళీ దేవాలయంకూడా దర్శించవలసినదే.

# శ్రీ ప్రణవానందస్వామి

శ్రీ ప్రణవానందస్వామివారి అసలుపేరు కనకదండి వెంకట సోమయాజులు. వీరు 1896లో జన్మించారు. 1919లో లాహోరు కాలేజీలో డిగ్రీ చదివారు. కొంతకాలము రైల్వేలో ఉద్యోగము చేశారు. గాంధీగారి స్వాతంత్ర్య ఉద్యమానికి ఆకర్షితులై, ఉద్యోగమునకు రాజీనామాచేశారు. 1920-1926 వరకు తూర్పుగోదావరి జిల్లాలో ప్రముఖ కాంగ్రెస్ కార్యకర్తగా మంచి పేరు సంపాదించారు. ఆ తరువాత భక్తి, వేదాంత మార్గములలో సత్యాన్వేషణలోనికి దిగి హిమాలయములలో పర్యటించారు. శ్రీ జ్ఞానానంద మహారాజ్‌వద్ద ఉపదేశమును పొందారు.

శ్రీ జ్ఞానానంద మహారాజ్ బెర్లిన్, పెరాగులే మొదలగు విదేశీ పట్టణములలో శారీరక పరిశోధన లాబరేటర్లలో పనిచేశారు. న్యూక్లియర్ ఫిజిక్స్‌పై ఎక్కువ మక్కువ చూపారు. ఆ తరువాత ఢిల్లీలోని నేషనల్ ఫిజిక్స్ లాబరేటరీలలో పనిచేసారు. ఇట్టి ప్రసిద్ధి చరిత్రగలిగిన శ్రీ జ్ఞానానంద మహారాజ్ గారివద్ద ఉపదేశం స్వీకరించి 'ప్రణవానందస్వామి'గా పేరు మార్చుకున్నారు. శ్రీ జ్ఞానానంద మహారాజ్‌గారి వద్ద అనేక దైవిక, యోగ, భక్తి, భౌతిక శాస్త్రమునకు సంబంధించిన అనేక విషయములను తెలుసుకున్నారు.

ఆ తరువాత శ్రీ ప్రణవానందస్వామివారు 23 సం॥లు హిమాలయ ప్రాంతములలో తీవ్రమైన, కఠోరమైన సాధన చేశారు.

1923 సంవత్సరములో గంగోత్రిలో తెహ్రీ ప్రాంతములో ఒక నిర్జన ఏకాంత ప్రదేశములో నివసించారు. అక్కడున్న రోజులలో ఆయనను ఆధ్యాత్మిక పరిపూర్ణ దివ్యసిద్ధికి సంబంధించిన ఒక గృప్తాంతానుభవం ఆయనకు తటస్థపడింది. ఒక మంచు పెద్దపులి ఆయన దారిలో ఎదురైంది. అది ఆయనకు ఎటువంటి హాని తలపెట్టలేదు. ఆయన్ను చూస్తూ కాసేపు తన వెనక కాళ్ళపై కూర్చుండిపోయింది. తరువాత సమీప అరణ్యములోనికి కనుమరుగై పోయింది. ఈ 'గంగోత్రి'లో



స్వామివారు ఒక సంవత్సరము తపస్సు చేశారు. ముఖ్యముగా శీతాకాలములో ఉండుటకు ఏ ప్రాణి అక్కడ ఉండటానికి సాహసం చేయరు. ఏడడుగుల ఎత్తున ఆప్రాంతాన్నంతా హిమం పేరుకుంటుంది. ఎటువంటి ఆహారమూ అక్కడ లభ్యంగాదు. అటువంటి ప్రదేశములో స్వామివారు ఎక్కువ సమయము ధ్యానసమాధిలోకి వెళ్ళిపోయేవారు. 1928వ సంవత్సరములో కైలాస మానస సరోవరములను మొదటి సారిగా 'లేహ్' మార్గము ద్వారా సందర్శించారు. అప్పుడాయన ఆదారి దూరం ఎక్కువైనదని, ఆయన పడమటి వైపు మార్గము గుండా తన యాత్ర సాగించారు. కాశ్మీర్ నుండి బయలుదేరి గర్తక్ ద్వారా ఆ బాట సాగుతుంది. అటు తర్వాత 1935లో ఆయన దక్షిణం వైపు మార్గం గుండా యాత్రచేశారు. ఇది కైలాస మానస సరోవరం చేరటానికి అన్నింటికన్నా చాలా దగ్గరి దారి. ఈ దారి ఆల్మోరా(Almora) నుంచి మొదలవుతుంది. మరలా ఆల్మోరా నుండి యింకోక మార్గములో మూడవసారి కైలాస మానస సరోవరమునకు చేరి, ఒక యేడాదిపాటు పూర్తిగా ఉన్నారు. అత్యంత ప్రసిద్ధి గలిగిన త్రుపుక్‌లోవాలో మఠంలో గడిపారు. ఈ భిక్షారామంలో ధ్యానంలోనూ, అధ్యయనంలోనూ గడిపిరి. పశ్చిమ టిబెట్‌వారికి ఆయనంటే అపారమైన గౌరవం. 1935వ సంవత్సరములో 6 నెలలు, 1936-37 సంవత్సరములో 12 నెలలు, 1943-44 సంవత్సరములో16 నెలలు ఈ మానస సరోవరం ప్రాంతములో నివసించారు. వీరు కైలాస పర్వతమును 23 సార్లు, మానస సరోవరమును 25 సార్లు పరిక్రమించారు. అంతేగాక "రాక్షసతాళ్" చుట్టూ గూడా ఒక పరిక్రమ చేయటం విశేషం.

ఈ యాత్రకు ఎన్నిదార్లు ఉన్నాయో, అన్నింటి గుండా వీరు ప్రయాణం చేసిరి. ప్రస్తుతం ఉపయోగించుచున్న దారి చాలా ప్రమాదరహితమని గుర్తించి, భారత ప్రభుత్వమునకు తెలియజేశారు. ఈ యాత్రపై ఎన్నో రచనలు చేశారు. వీరి రచనలకు లండన్(London)లోని రాయల్ జియోగ్రాఫికల్ సొసైటీ (London Geographical Society)వారు, ఇండియన్ జియోగ్రాఫికల్ జర్నల్ (Indian Geographical Journal) పత్రికలలో వీరి వ్యాసాలకు ప్రాముఖ్యత ఇచ్చారు.

వీరి కృషికి ఫలితంగా లండన్‌లోని రాయల్ జియోగ్రాఫికల్ సొసైటీ (London Geographical Society) మరియు సర్వేఆఫ్ ఇండియా (Survey of India) పటములలో కూడా 'సర్వేయర్'గా గుర్తించారు. వీరి ఆశ్రమము ఆల్మోరాలో(Almora) వున్నది. 1989వ సం॥లో స్వర్గస్థులైరి. ప్రపంచము యావత్తు వీరిని 'హిమవన్నగ యోగి (Hermit in

(the Himalayas) అని పిలుచు చుందురు. "నా సన్యాస జీవితం, యోగ సాధనలలో నాకు తృప్తి లభించినది. ఈ భూమి మీద కైలాస మానస సరోవరాన్ని మించిన ప్రాంతమేమీ నా మనస్సు కెక్కదు. నేను పుట్టిన, పెరిగిన ప్రదేశము కన్నా కూడా కైలాసగిరియే నాకు ప్రీతిపాత్రమైనదని" చెప్పెడివారు.

"భారత దేశములోని ఎన్నెన్నో పుణ్య క్షేత్రములను దర్శించాను. అయితే ఏ దివ్య క్షేత్రములోనూ యిక్కడ గలిగిన ఆధ్యాత్మిక ప్రకంపనలు నాకు అనుభవం కాలేదు. మానస సరోవర నీల మరకత జలరాసిలో సూర్యాస్తమయ పరమ సుందర దృశ్యంకన్నా పరమోత్తేజకరమైన సన్నివేశం ఎక్కడా సంభవించదు. గొప్ప ఠీవిగా ఉత్తరాన కైలాస పర్వతం, దక్షిణాన గుర్లా మాంధాత పర్వతముల మధ్యగల ఈ సరస్సు మరకతం తాపడం చేసినట్లుగా సహజమైన అనిర్వచనీయ సౌందర్యముగల ఈ ప్రాంతమును ఆపాదిస్తుంది. ఈ ప్రాంతం నుండి వచ్చే ప్రకంపనలు అధ్యాత్మికమైనవి. మనస్సును ప్రశాంతత చేసేవి." తన అనుభూతులను అందరితోనూ పంచుకొనేవారు స్వామివారు. మానస సరోవరం నుంచి ప్రభవించే బ్రహ్మపుత్ర, సింధు, సట్లెజ్, సరయూ నదుల ఉత్పత్తి స్థానములను కనుగొన్నారు. 1989వ సంవత్సరములో శ్రీ స్వామివారు నిర్యాణం చెందారు. వారి ఆశ్రమం ఆల్మోరా (Almora)లో వున్నది.

నేను 1995వ సంవత్సరములో ఈ యాత్ర చేశాను. ఆల్మోరా(Almora) మార్గములో భారతదేశపు ప్రభుత్వము మరియు 'ది కుమాయూన్ మండల్ వికాస్ నిగమ్' వారి సమన్వయ సహకారముతో ఈ యాత్రను దిగ్విజయముగా పూర్తి చేశాను.

మరొక మార్గం - నేపాల్ దేశ రాజధాని ఖాట్మండుకు వెళ్ళి - జీపులో ప్రయాణము చేసి కైలాస మానస సరోవరమును దర్శించవచ్చును. కాని నేను ఈ మార్గమున ప్రయాణము చేయలేదు. ఈ మార్గము ద్వారా శ్రీ గణపతి సచ్చిదానందస్వామివారు, త్రిదండి చిన జియరుస్వామివారు ప్రయాణము చేసితిరి. ఈ సంవత్సరమునుండి హెలీకాప్టరు ద్వారా కూడా మానస సరోవర ప్రాంతమునకు, కైలాస పర్వత బేస్ క్యాంప్ అయిన థార్చెన్(Tarcher) వరకు వెళ్ళివచ్చు కాని, చాలా ఖర్చుతో కూడుకొన్నది.

## భారత ప్రభుత్వము అనుమతి విధానము

ఈ యాత్ర ప్రతి సంవత్సరము జూన్ నుండి సెప్టెంబరు వరకు జరుగును. సాధారణముగా ప్రతిసంవత్సరం ఫిబ్రవరి, మార్చినెలలో అన్ని ప్రముఖ పత్రికలలో ఈ యాత్రకు సంబంధించిన ప్రకటన వేస్తారు. ఈ యాత్రగురించి దూరదర్శన్‌లలో కూడా తెలియ చేస్తారు. ఈ ప్రకటలను జూడనివారు The Secretary, Ministry of External Affairs, 271-A, South Block, New Delhi - 110011. అను చిరునామాకు వ్రాసి దరఖాస్తు

ఫారమ్‌ను తెప్పించు కొనవలయును. ఈ విధంగా వచ్చిన కొన్ని వేల (అప్లి కేషన్స్) దరఖాస్తులను లాటరీ పద్ధతిలో తీసి షుమారు 500 మందిని 16 గ్రూపులుగా (Batches) విభజిస్తారు. ప్రతి Batch కి 30 నుండి 40 మంది వరకు యుంటారు.

ఎంపిక అయిన వారికి టెలిగ్రాముద్వారా వారి నెంబరు, బ్యాచ్ నెంబరు, ఏరోజు ఢిల్లీ(Delhi) లో హాజరు కావలసినది, ప్రయాణపు తేదీలను తెలియ జేస్తారు.

ఈ ప్రయాణమునకు అంగీకారమైన యెడల 1,000 రూపాయలను అడ్వాన్సుగా డి.డి. తీసి పంపవలయును. అన్ని వివరములతో (Instruction of Yatris) ఒక పుస్తకమును పోస్టులో పంపుతారు.

Haemogram, Urine, Stool, Biochemistry, Chest X-Ray, Stress ECG మొదలగు మెడికల్ పరీక్షలను గతములో ఎవరికి వారే చేయించుకొని రిపోర్టులను తీసుకెళ్ళెడివారు. ఈ సంవత్సరము నుండి ఐ.టి.బి.పి. హాస్పిటల్(ITBP Hospitel) వారే నిర్వహించుచున్నారు. షుమారు 2,500 రూపాయలు ఈ పరీక్షల నిమిత్తం చెల్లించవలయును. ఇండెమ్నిటి బాండ్‌ను(Indemnity Bond)ను తయారుచేసుకొనవలయును. అవసరమైన డబ్బును ప్రయాణపుతేదీకి సరిగ్గా వుంచుకొనవలయును. ఆరోగ్యంగా ఉన్నవారు మాత్రమే ఈ మార్గముద్వారా యాత్ర చేయుట మంచిది. అంతేకాక ముఖ్యముగా భారతీయ పౌరునికి మాత్రమే ఈ యాత్రకు అనుమతించబడును.

## ఈ యాత్రకు కావలసిన దుస్తులు, పరికరములు:

(1) Pass Port (2)Camera/Video Company No. (3) Wind Proof Jacket Parka-1 (4) Sweaters -3 (5) Monkey Cap - 2 (6) Woolen Long Jackt-2 Pairs (7) Cotton Socks - 4 Pairs (8) Pants - 4 No's (9) Shirts - 4 No's (10)T-Shirts - 4 No's (11) Wollen Socks - 4 No's (12) Sunglaces (13) Trekking Shoes - 2 Pairs (14) Peakked Cap (15) Water Bottle (16) Torch Light (17)Raom Coat (18) Belt Pouch (19) Medicenes (20) Plastic Sheet (21) Walking Stick (22) Plate, Mug, Spoon (23) Toilet Paper (24) Umberilla (25) Candles (26) Match Boxes (27) Multiple Knife (28) Rubber Slippers (29) Whisle

1995వ సంవత్సరములో నేను ఈ యాత్రను చేయవలెననెడి సంకల్పముతో అప్లికేషను పూర్తిచేసి పంపేను. ఆ పరమేశ్వరుని దయవలన 10వ బ్యాచ్‌లో సెలక్టు అయినట్లుగా టెలిగ్రాము వచ్చినది. 1000 రూపాయలను M.O. చేసి సీటు రిజర్వుచేసుకొంటిని. ఒక వారం రోజులలో వివరములతో (Instructions) కూడిన పుస్తకము వచ్చినది. షుమారు 40,000 నుండి

0,000 వరకు ఖర్చు అయ్యేవిధంగా వున్నది. అంత డబ్బు సమకూరేదెలాగా?! అన్న ఆలోచనలో పడివున్నాను. విజయవాడలో లయన్స్, రోటరీ సంస్థలు ఏమైనా సహాయము చేస్తాయేమోననే ఉద్దేశ్యముతో ప్రయత్నించాను. ఫలించలేదు సరికదా! నిద్రాహారమే సరిగాలేనందున ఆరోగ్యలోపములు కన్పించాయి. చివరికి ఆలోచించి శివపంచాక్షరీ జపించుట ఉత్కృష్టమార్గమని తలచి, జపమును ప్రారంభించితిని. భాగవతము గుర్తువచ్చినది.

శ్లో॥ చేతులారంగ శివుని పూజింపడేని, నోరు నవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబులోనుగా దలపడేని, కలుగనేటికి తల్లుల కడుపు చేటు - ॥

శ్లో॥ సారూప్యం తవ పూజనే శివ మహాదేవేతి సంకీర్తనే
సామీప్యం శివభక్తి ధుర్య జనతా సాంగత్య సంభాషణే
సాలోక్యంచ చరాచరాత్మక తనుధ్యానే భవానీ పతే
సాయుజ్యం మనసిద్ధమత్ర భవతి స్వామిన్ కృతార్థోస్మ్యహమ్ -॥

శివనామ సంకీర్తన చేయుచున్నప్పుడే సామీప్య ముక్తి భక్తి దురంధరులైన జనులతో సహవాసము మరియు సంభాషణ వలన సాలోక్య ముక్తి స్థావరం జంగమాత్మకమైన నీస్వరూపమును ధ్యానించుచున్నప్పుడు సాయుజ్య ముక్తి కల్గును గదా! మహిమాన్వితమైన 'పంచాక్షరీ' మంత్రమును జపించుచుంటిని. ఈశ్వరా! నీవే దిక్కు అని శరణాగతినైతిని. (ఆక్షణమున ప్రారంభించిన ఈ మంత్ర జపము కొన్ని కోట్లు జపము చేయుట విశేషము) ఆ పరమేశ్వరుని కృపయేమోగాని అనేక ఊళ్ళనుండి మరియు నరసరావుపేటలోని ఆత్మీయులు, శ్రేయోభిలాషులు విరాళములిచ్చిరి. అమ్మగారు తాను మందుల కోసమని దాచుకున్న ధనమునుకూడా ఈ యాత్రకు ఇచ్చినది. మొత్తము మీద ఈయాత్రకు కావలసిన ధనము చేకూరినది. Medical Reports, Indemnity Bond ను తీసుకొంటిని. ఇంతలో పరీక్షవలె జ్వరము వచ్చినది. షుమారు 101 డిగ్రీలున్నది. రాత్రికే విజయవాడకు వెళ్ళి ఢిల్లీకి వెళ్ళే రైలు GT Express లో ప్రయాణించవలసిన పరిస్థితి. మిత్రుడు డాక్టరు ఎం.వి. సుబ్బారావు (M.V. Subbarao) మరియు సమాతత్పరతగలిగిన డాక్టరు ఎం. రాధాకృష్ణమూర్తి గార్ల వైద్య సేవలవలన సాయంత్రమునకు జ్వరము తగ్గినది. ఆరాత్రికి విజయవాడకుచేరి GT Express లో ప్రయాణించి ఢిల్లీ (New Delhi) కి చేరితిని.

ఢిల్లీలో కుమామ్ మండల వికాస్ నిగమ్‌వారు యాత్రానివాస్‌లో రూమ్ అట్టిపెట్టుట వలన చేరితిని. మరలా జ్వరతీవ్రత, విరోచనములు, వాంతులతో బాధపడుచుంటిని. మందులు తీసుకుంటూ విశ్రాంతి తీసుకొనుచుంటిని. మొదటి రెండు రోజులు మమ్మల్ని అందర్నీ సమావేశపరచిరి. యాత్రగురించి వివరములు, సాధక బాధకములు, ధైర్యవచనములతో

ప్రోత్సాహకరమైన సంభాషణలు జరిగినవి. ఈవిధంగా ఈ రెండు రోజులు తే నీటి విందు ముగిసినది. 3వ రోజు ఐ.టి.బి.పి. హాస్పిటల్(ITBP Hospitel) లో వైద్య పరీక్షలు నిర్వహించిరి. 4వ రోజున వీసా తీసుకోవడం, విదేశీ మారక ద్రవ్యం కొనుగోలు పూర్తిఅయినది. కావలసిన దుస్తులు, సామాన్లు కొనుట జరిగినది.

మా బ్యాచ్ నంబరు పది. 25 మంది ఈ బ్యాచ్‌లో గలరు. వీరిలో దక్షిణ భారతీయులు ఐదుగురుకాగా మిగిలినవవారు ఉత్తర భారతీయులు. మాలో ఒకరిని (కమాండర్) నాయకునిగా నిర్ణయించారు. అతని పేరు అగరవాల్. ఢిల్లీ నివాసి, వృత్తిరీత్యా ఇంజనీరు. మేము ఇతని ఆజ్ఞలను పాటించవలసి యుండును. ప్రభుత్వమునకు సంబంధించిన అన్ని వ్యవహారములను చూసే బాధ్యత ఆతనిదే. ఆరోజు ఆగష్టు 6వ తేది. ఢిల్లీలోని ఆశోక్ యాత్రీనివాస్ నుండి ఉదయం 5 గం॥లకు బస్సు బయలుదేరింది. "జై బోలో కైలాస్‌నాథ్‌కీ జై" అను నినాదములతో ఆప్రాంతము అంతయూ మార్మోగెను. ఉదయం 7.30 ని॥లకు గాగ్రావుకా (Gagrawca) వారేలో యున్న KMVN వారి వసతి గృహములో ఉపాహారం తీసుకున్నాము. షుమారు 11.30 ని॥లకు రాంపూర్ (Rampur) చేరాము.

గత సంవత్సరము ఈ యాత్రను చేసిన రాంపూర్ నివాసి మాకు స్వాగతం పలికి అందరికి తిలకం దిద్ది, మెడలో పూలమాల వేసి, అల్పాహరములు ఏర్పాటు చేశారు.

రాంపూర్ పెద్ద పట్టణము. శాస్త్రీయ సంగీతమునకు ప్రసిద్ధిగా చెప్పబడెను. దాదాపు 4 గం॥లకు బవాలి (Bawali) చేరితిమి. అక్కడ KMVN వారి విశ్రాంతి గృహములోనే మాకు భోజన ఏర్పాట్లు జరిగాయి. ఇచటి నుండి రోడ్డు వెడల్పు చాలా తక్కువగా వుండుట వలన, అనేక వక్రమార్గములు, లోయలు వుండుట వలన పెద్ద బస్సును ఇచ్చటనే నిలిపివేశారు. మినీబస్, ఒక మారుతి వ్యాన్‌లోకి మమ్మల్ని ఎక్కించి, ప్రయాణము మరలా ప్రారంభమైనది. రాత్రి గం॥ 9-04 ని॥లకు కౌసానీ (Kavsoni)కి చేరితిమి. ఢిల్లీ నుండి ఈరోజుకు షుమారు 400 కి.మీ. ప్రయాణము చేసితిమి. కౌసానీలోని వసతి గృహమునకు చేరగానే కాళ్ళూ చేతులు శుభ్రపరచుకొంటిమి. భోజనము, చపాతీ, కాఫీ ఇచ్చట లభ్యమగును. ఎవరికి కావలసినవి వారు తినవచ్చును. రేపటి ప్రయాణము గురించి చర్చించుకొని రాత్రి 11.30 ని॥లకు నిద్రకుపక్రమించితిమి.

## ధార్చులా వైపు ప్రయాణము

ఈ రోజు ఆగష్టు 7. ఉదయం 5 గంటలకు మేల్కొని కాలకృత్యములు, పూజా కార్యక్రమములు ముగించి, ఫలహారాదులు సేవించి సరిగ్గా ఉదయం గం॥ 6-45 ని॥లకు కైలాసనాధుని నినాదములతో ప్రయాణము ప్రారంభమైనది.



సరయూనది, గోమతీ నదుల సంగమము

ఇచట సరయూనది మధ్యలో ఒక పెద్ద బండవున్నది. ఈ బండపై శ్రీ మార్కండేయ మహాముని 'దుర్గా సప్తశతి' వ్రాసెనవి, అందువలన ఈ బండకు 'మార్కండేయ శిల' అని పేరు వచ్చెను.

ఈ 'దుర్గా సప్తశతికే 'చండీపారాయణ' అని పేరుగలదు. శ్రుతి స్మృతిపురాణాదుల యందు ప్రసిద్ధములైన మంత్రముల చాలాగలవు. అన్నింటియందు చండీ, పంచాక్షరీ, అష్టాక్షరీ, నవాక్షరీ అనునవి ముఖ్యమైనవిగా పేర్కొనదమైనది. అటువంటి కోవకు చెందినదే ఈ 'చండీ పారాయణము'. దీనినే 'హోమవిధి'గా కూడా చేస్తారు. యిందు 700 మంత్రములుండును. ఈ సప్తశతిలో మూడు చరిత్రములుండును. అవి. 1) మహాకాళీ 2) మహాలక్ష్మి 3) మహాసరస్వతి.

మహాకాళీ - ప్రథమ చరిత్రము

మహాలక్ష్మి - మధ్యమ చరిత్రము

మహా సరస్వతీ - ఉత్తర చరిత్రము

అని వర్గీకరించమడినది. ఈ మూడు చరిత్రములలోనూ 'శ్రీ దేవీ మహాత్మము' గురించే వ్రాయబడినది. అట్టి మహిమాన్వితమైన ఈ పారాయణములోని కొన్ని శ్లోకములు స్మరించు కొందాము.

శ్లో॥ దుర్గే స్మృతా హరసిభీతి మశేష జన్తోః

స్వస్థైః స్మృతా మతిమతీవ శుభాం దదాసి
దారిద్ర్య దుఃఖ భయహారిణి కాత్వదన్యా
సర్వోపకార కరణాయ సదార్ద్ర చిత్తా॥

శ్లో॥ యాదేవీ సర్వభూతేషు
బుద్ధి రూపేణ ।
సంస్థితా నమస్తస్యై
నమస్తస్యై నమస్తస్యై నమో నమః ॥

శ్లో॥ సర్వభూత యదాదేవి
భుక్తి ముక్తి ప్రదాయినీ
త్వాం స్తుతా స్తుతయే కావా
భవన్తు పరమోక్తయః

శ్లో॥ సర్వమంగళ మాంగల్యే
శివే సర్వార్థ సాధికే ।
శరణ్యేత్ర్యమ్బకే దేవి
నారాయణి నమోస్తుతే ॥

శ్లో॥ జ్ఞానినా మపి చేతాంసి
దేవీ భగవతీ హిసా ।
బలదా కృష్య మోహాయ
మహా మాయా ప్రయచ్ఛతి ॥

శ్లో॥ శరణాగత దీనార్త
పరిత్రాణ పరాయణీ ।
సర్వస్యార్తి హరే దేవి
నారాయణి నమోస్తుతే ॥

శ్లో॥ రోగా నశేషా నపహంసి తుష్టా
రుష్టాతు కామన్ సకలా నభీష్టాన్ ।
త్వా మాశ్రితానాం న విపన్న రాణాం
త్వా మాశ్రితా హ్యాశ్రయతాం ప్రయాంతి॥

శ్లో॥ సృష్టి స్థితి వినాశానాం
శక్తి భూతే సనాతని ।
గుణాశ్రయే గుణమయే

నారాయణి నమోస్తుతే ॥

శ్లో॥ యా దేవీ సర్వ భూతేషు
విష్ణు మాయేతి శబ్దితా ।
నమస్తస్యై నమస్తస్యై
నమస్తస్యై నమో నమః ॥

శ్లో॥ యా దేవీ సర్వ భూతేషు
నిద్రా రూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై
నమస్తస్యై నమో నమః ॥

శ్లో॥ యా దేవీ సర్వ భూతేషు
శక్తి రూపేణ సంస్థితా
నమస్తస్యై నమస్తస్యై
నమస్తస్యై నమో నమః ॥

శ్లో॥ యా దేవీ సర్వ భూతేషు
కాంతి రూపేణ ।
నమస్తస్యై నమస్తస్యై
నమస్తస్యై నమో నమః ॥

శ్లో॥ యా దేవీ సర్వ భూతేషు
శాంతి రూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై
నమస్తస్యై నమో నమః ॥

శ్లో॥ యా దేవీ సర్వ భూతేషు
వృత్తి రూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై
నమస్తస్యై నమో నమః ॥

శ్లో॥ యా దేవీ సర్వ భూతేషు
లక్ష్మీ రూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై
నమస్తస్యై నమో నమః ॥

శ్లో॥ యా దేవీ సర్వ భూతేషు

మాతృ రూపేణ సంస్థితా ।
నమస్తస్యై నమస్తస్యై
నమస్తస్యై నమో నమః ॥

శ్లో॥ సర్వ బాధా ప్రశమనం
త్రైలోక్య స్యాఖిలేశ్వరి
ఏవ మేవ త్వయా కార్య
మస్మ ద్వైరి వినాశనమ్ ॥

ప్రతి నిత్యమూ పైనుదహరించిన శ్లోకములు పారాయణ చేయుట వలన సత్ఫలితములు కలుగును.

ప్రస్తుత కాలములో ఈ 'చండీసప్తశతి'ని బాగుగా ప్రాచుర్యము కలిగించిన వారిలో శ్రీ శృంగేరి విరూపాక్షి పీఠాధిపతులు జగద్గురు స్వామివారు కీ॥శే॥ శ్రీశ్రీశ్రీ కళ్యాణ భారతీ మరియు నూరు సంవత్సరముల వయస్సునకు దగ్గరలో వున్న మా పరమేష్ఠి గురువులు శ్రీశ్రీశ్రీ గోపానంద స్వాములు ముఖ్యులు. వీరు తిరుపతిలో వున్నారు.

ఈ భాగేశ్వర్‌లో పూజాది కార్యక్రమములు నిర్వహించుకొని కొన్ని ఫోటోలు తీసుకొని 10-30 గం॥లకు ప్రయాణమును కొనసాగించాము. మార్గ మధ్యములో చౌకడీలోని(Chowkady) వసతి గృహంలో భోజనము పూర్తిచేసుకొని బయలుదేరాము.

ఈ రోజు ప్రయాణము చాల ఆహ్లాదకరముగాను, కొన్ని చోట్ల చాలా భయంకరముగాను యున్నది. సాయంత్రం 6 గంటలకు ధార్‌చులా (Dharchula) చేరాము. ఇది పెద్ద వ్యాపార కేంద్రము. చైనా సరిహద్దు వరకు వున్న మిలటరీ క్యాంపులకు కూడా వస్తువులన్నియూ ఇక్కడ నుండియే పోవలసియుండును.

ఈ ధార్‌చులా ప్రక్కన 'కాళీగంగా' (Kali Ganga) ప్రవహించుచున్నది. నదికి అవల నేపాల్ భూభాగము. ఇటు భారత భూభాగము. ఈ రెండింటినీ కల్పుటకు పెద్ద ఇనుప వంతెన గలదు. నేపాల్‌లో టెలిఫోన్ సౌకర్యము గలదు. ఇరువైపుల చెక్‌పోస్టులు గలవు. సాయంత్రం గం॥ 7-30 ని॥లకు ఈ వంతెన తలుపులకు తాళం వేస్తారు.

మా వసతి గృహం ఈ కాళీగంగా నది ప్రక్కనే వున్నది. మేము మా సామానులను అందులోనికి చేర్చి, తలా ఒక మంచముపై విశ్రమించాము.

ఈ ధార్చులా షుమారు 8150 మీ॥ ఎత్తున గలదు. కొంతమంది నేపాల్‌కి వెళ్ళి యిండ్లకు STD/ISD ఫోన్ ద్వారా సమాచారమును తెలియజేసివచ్చిరి. ఈ రోజుకు 599 కి.మీ. బస్సు ప్రయాణము ముగిసినది. స్నానాది కార్యక్రమములు ముగించుకొంటిమి. ప్రక్కనే గల కాళీగంగా ప్రవాహపు ఝుంకారపు ధ్వనిలో మా మాటలు కలిసిపోవుచుండెను.

భోజనములు సిద్ధపరచి పిలువగా అందరమూ వెళ్ళి భోజనము చేసితిమి. కుమాన్ మండల్ వికాస్ నిగమ్ (KumaonMandal Vikas Nigam) వారి యాత్రాధికారి మమ్మల్ని పరిచయము చేసుకొని, క్షేమ సమాచారములు తెలుసుకొనెను. రేపటి నుండి నడక (Treekking) ప్రారంభమగును. నడకలో తీసుకొనవలసిన జాగ్రత్తలు తెలిపెను. ప్రతి ఒక్కరు 25 కి.గ్రా.లకు మించి లగేజీ తీసుకొని రాకూడదు. మించిన యెడల అదనంగా డబ్బు చెల్లించవలయును. గుఱ్ఱములు మరియు పర్సనల్ పోర్టర్స్ (Personal Porters) కావలసినవారు పేర్లను నమోదు చేసుకొనిరి. ఇచ్చటనే పది రూపాయలకు ఒకటి చొప్పున అందరము చేతి కఱ్ఱలు కొనుగోలు చేసితిమి.

మానస సరోవరము, కైలాసగిరి యాత్ర ముగించిన తర్వాత మాతో మా స్వస్థలములకు చేరగలవు. వీనిని భద్రముగా దాచవలయును. తనువు చాలించిన తర్వాత దహన సంస్కారమున ఉపయోగించుట శ్రేయస్కరము.

ఢిల్లీలో మందులను, ఆహార పదార్థములను కొనుగోలు చేయనివారు ఇక్కడ కొనుగోలు చేసిరి. అవి.

(1) పెట్రోలియం జెల్లీ (2) మల్టీ విటమిన్ బిళ్ళలు (3) విక్స్ ఇన్‌హీలర్ మరియు మాత్రలు (4) విటమిన్ 'సి' బిళ్ళలు (5) స్ట్రెప్సిల్స్ - హాల్స్ (6) డైజిన్ మాత్రలు (7) లాక్సేటివ్ (Laxative) మాత్రలు (8) Relaxyl మాత్రలు (9) Cotton Wool (10) Betadin Ointment (11) Crocin & Disprin మాత్రలు (12) Electrol & Glucose Powders (13) Anti-Diarrheals

<u>ఆహార పదార్థములు</u>

(1) కండెన్స్‌డ్ పాలు (2) కార్న్ ఫ్లాక్స్ (3) బోర్నవీటా (4) బిస్కట్లు (5) డ్రై ఫ్రూట్స్ (6) లెమన్ డ్రాప్స్ (7) చాక్లెట్స్ (8) తేనె (9) రస్నా (10) అటుకులు (11) పంచదార (12) నూడుల్స్ (13) బొంబాయి రవ్వ

ఈ పదార్థములన్నియూ ప్రయాణము చేయునప్పుడు మార్గమధ్యములో అవసరమగును.

రాత్రి 10 గంటల వరకు నది ఒడ్డున కాలక్షేపము చేసితిమి. ఆ తర్వాత అందరము గదులలో ఎవరి ప్రక్కపై వారు విశ్రమించితిమి.

## పంగు క్యాంప్‌కి ప్రయాణము

ఆరోజు ఆగష్టు 8వ తేది. ఉదయం గం॥ 4.30 ని॥లకే మేల్కొంటిమి. స్నాన పూజాది కార్యక్రమములు పూర్తి చేసుకొంటిమి. సామానులన్నియు చాలా జాగ్రత్తగా ప్యాక్ చేశాము

ఉ॥ 6.60 ని॥లకు ప్రయాణమునకు సిద్ధపడి, ఫలహారములు, కాఫీ సేవించితిమి.

మా లగేజీలను తూకము వేసిరి. చేతి సంచీ, కఱ్ఱ మాత్రము మాతోనే వుండును. ఈ చేతి సంచిలో రెయిన్ కోట్, గొడుగు, బిస్కట్లు, ఎలక్ట్రాల్ పౌడర్, వాటర్ బాటిల్, మందులు, డ్రై ఫ్రూట్స్ వుండును. నడుమునకు బెల్ట్ పౌచ్ ఉంచుకొంటిమి. ఈ బెల్ట్ పౌచ్‌లో కెమరా, ఫోటో రీళ్ళు, పాస్‌పోర్టు, డాలర్స్ ఉంచుకొంటిమి.

ఉదయం 7 గంటలకు ప్రక్కనేగల గుడిలోకి వెళ్ళి స్వామివారిని దర్శించితిమి. ప్రస్తుతము తక్లాఘాట్ వరకు జీపులో వెళ్ళవలయును. ఇదే చివరి వాహన ప్రయాణము. తక్లాఘాట్‌కు ఇది 19 కి.మీ. మాత్రమే. అందరము 10 నిముషములు ఆ కైలాస నాథుడైన పరమేశ్వరుని మనస్సులో ధ్యానించితిమి.

శ్లో॥ వస్త్రో ద్ధూత విదౌ సహస్ర
కరతా పుష్పార్చనే విష్ణుతా ॥
గాంధీ గంధ వహాత్మ తాన్న పచనే
బర్హి ర్ముఖాధ్యక్షతా ॥
పాత్రే కాంచన గర్భితాస్తి
మయిచేద్బాలేందు చూడామణే
శుశ్రూషాం కరవాణి తే పశుపతే
స్వామిన్ త్రిలోకీ గురు ॥

నిత్యము భగవత్పూజ చేయవలెను. శాస్త్రమును అనుసరించి చతుఃషష్టి(64) ఉపచారములు శక్తిలేనిచో షోడశ(16) ఉపచారములు, ఇంకా శక్తి చాలనిచో పంచ(5) ఉపచారములు చేయవలయును. భక్తితో భగవంతున్ని అర్చింపవలయును. తొండము నిండుగా నీళ్ళు పీల్చుకొని వచ్చి ఏనుగు నిత్యము శివుని అభిషేకించెడిదని, దారము అల్లి సాలెపురుగు శివునకు వస్త్రముగా అర్పించెడిదని, పడగవిప్పి పాము శివునకు గొడుగు పట్టెడిదని శ్రీకాళహస్తీశ్వర చరిత్రలో గలదు.

పశుపతీ! ఈశ్వరా! వస్త్రము నిచ్చుటకు నేను సూర్యనారాయణుడను, పుష్పము నర్పించుటకు విష్ణుదేవుడను, అన్నము వండుటకు దేవేంద్రుడను, పాత్రము నర్పించుటకు బ్రహ్మదేవుని కాగలిగి, నీసేవ చేయు భాగ్యము నాబోటి వానికి కలిగించు స్వామీ! పశువులు, పురుగులు సైతము నిన్ను అర్చించుచుండ, వివేకముగల నేను సదా నీ ధ్యానములోనే గడుపుతూ, నీ కైలాసగిరిని దర్శించుకొందును. ఈశ్వరా! అనుగ్రహించుము.

నీలకంఠాయ మృత్యుంజయాయ
సర్వేశ్వరాయ సదా శివవాయ
శ్రీ మన్మహదేవాయ నమః ॥

కైలాస నాథుని నినాదములతో ప్రయాణమైతిమి. 4 1/2 కి.మీ. తరువాత తపోవన్ వచ్చెను. ఒక కిలోమీటరు దాటిన తరువాత తంతానది వచ్చెను. ఈ నది షుమారు 3,000 అడుగుల ఎత్తునుండి ప్రవహించుచూ 'కాళీగంగా' నదిలో కలియును. ఈ రోడ్డు మార్గము చాలా ఇఱుకుగా వుండెను. తవ్వాఘాట్ వరకు 'కాళీగంగా' నది ఒడ్డున ప్రయాణము సాగుచుండెను.

తవ్వాఘాట్‌కి 1 1/2 కి.మీ. దూరములో పెద్ద పెద్ద కొండ చరియలు కూలి రోడ్లపై పడి యుండుట వలన ఇచ్చటనే మా జీపు ప్రయాణము ముగిసినది. ఇచ్చటి నుండి తవ్వాఘాట్‌కి గం॥ 8.45 ని॥లకు చేరితిమి. మా సామానంతయూ గుఱ్ఱములలో వెనుక వచ్చునని తెలిపారు.

ఇచటి 'ధౌళిగంగా' దాదాపు 100 కి.మీ. దూరములోని 'ధర్మాపాస్' నుండి 'కాళీ గంగా' కాలాపానిలో ఉద్భవించినది. ఈ రెండు నదుల సంగమము చాలా వేగముతో, హోరుతో ధ్వనులతో ఆ ప్రాంతము నిండియున్నది.

తవ్వాఘాట్ చిన్న గ్రామము. దాదాపు 1800 జనాభా కలిగి కొన్ని దుకాణములు, టీ కొట్టు కలిగియున్నవి. ఎడమవైపున చాలా ఎత్తులో మిలటరీ క్యాంపులున్నవి. ఇచట కాళికాదేవి ఆలయమున్నది.

ఇచ్చటి నుండియే గుఱ్ఱములు, పర్సనల్ పోర్టర్స్ మనతో వస్తారు. KMVN వారే వీరిని ఏర్పాటు చేశారు. నేను ఒక గుఱ్ఱమును మాత్రమే చాలని నిర్ణయమునకు వచ్చాను. గుఱ్ఱము యజమానిపేరు శంకర్‌సింగ్.

దాదాపు అరగంటలో మేము నడక ప్రారంభించాము. ధౌలీ గంగాపై గల 40 మీ॥ల వెడల్పుగల యినుప వంతెనను దాటి ఎడమవైపు తిరిగి పర్వతారోహణమును ఆరంభించితిమి.

మా వెంట యిర్వురు ఉత్తరప్రదేశ్ స్పెషల్ పోలీసువారు, కుమాయూన్ మండల్ వికాస్ నిగం వారి డాక్టరు, గైడును, తుపాకులతో, వాకీ టాకీలతో (వైర్‌లెస్ సెట్) యిచట నుండి ఏర్పాటు చేసిరి. అందరికంటే ముందు ఒక పోలీస్ జవాన్, డాక్టరు, గైడు, చివరలో ఒక పోలీసు జవాన్ మావెంట వుంటూ మాకు బాగా సహకరించిరి.

ఇచ్చటి నుండి దారి నిటారుగానూ, కొన్నిచోట్ల మెట్ల వలెయున్నది. దారి 2 లేక 3 అడుగుల వెడల్పు మాత్రమే యున్నది. ఒకప్రక్క పర్వతము, మరోప్రక్క నది యున్నది. ఏమాత్రము అజాగ్రత్తగా నడిచినా నదిలో పడవలసినదే.

షుమారు 1 1/2 కి.మీ.లు పైకి ఎక్కే సరికే అరికాళ్ళు మంటలు, ఒళ్ళు నొప్పులు మొదలయ్యెను. ఇంతలో వర్షపు జల్లులు మొదలిడెను. వెంటనే అందరమూ రెయిన్‌కోటులను ధరించి ప్రయాణము కొనసాగించితిమి. 30 నిముషములు ప్రయాణము చేసిన తర్వాత వర్షపు జల్లులు తగ్గాయి. సూర్యని కిరణములు చాలా దూరంగా కన్పిస్తున్నాయి. మరలా రెయిన్ కోటును ట్రెకింగ్ బ్యాగ్‌లో ఉంచి ప్రయాణము కొనసాగించితిమి. 'జడ్' (Z) ఆకారములో గల మెట్లను

ఒక్కొక్క మెట్టును చాలా నెమ్మదిగా ఎక్క సాగితిమి. సుమారు 2 కి.మీ.లు ఎక్కేసరికి ఒళ్ళంతా చెమటపోసి, ఉచ్ఛ్వాస అధికమాయెను. వెంటనున్న ట్రెక్కింగ్‌బ్యాగ్‌లోని బిస్కట్లు తీసుకొని, నీళ్ళు త్రాగి కొంత సమయం విశ్రమించి, మరలా యాత్రను కొనసాగించితిమి. కొంతమంది గుఱ్ఱములపై ప్రయాణములను కొనసాగిస్తున్నారు.

ఈ విధంగా ప్రయాణము చేయుచూ సుమారు 1 గంటకు 'పంగు క్యాంపు' (Pangu Camp) కు చేరితిమి. నేటితో 10 కి.మీ. నడక ప్రయాణము ముగిసినది. ఈ యాత్రలో మొదటిరోజు పర్వతారోహణ చాలా కష్టమైనది. కొంతమంది ఈ ప్రయాణము చేయలేక వెనుతిరిగిపోవుదురని ఏడ్చువాళ్ళు కూడా వుందురని పోలీసువారు చెప్పారు.

నా అభిప్రాయము కూడా ఈ మొదటి రోజు పర్వతారోహణ చాలా కష్టముగా వున్నది. అలవాటులేని నడక 'జడ్' ఆకారములో నిట్ట నిలువుగా కొండలెక్కుట చాలా కష్టము. మాలో ముగ్గురు జారి పడినట్లు తెలిపారు.

కాని వచ్చే సంవత్సరమునుండి ఈ పంగ్ క్యాంప్ వరకు రోడ్డు పూర్తియై, జీపులు లేదా టాక్సీలు నడువగలవని KMVNవారు, యు.పి. టూరిజం వారు చెపుతున్నారు.

ఈ పంగు క్యాంపులో 5 గదులున్నాయి. వెనుకగా వంటశాల, మధ్యలో బాత్ రూములు వున్నాయి. కొళాయిలో 24 గంటలు నీరు సమృద్ధిగా వచ్చును. చాలా ఎత్తైన ప్రదేశమున ఈ క్యాంప్ ఏర్పాటు చేసిరి.

సముద్రము మట్టము నుండి 7,260 అడుగుల ఎత్తున ఈ గ్రామము యున్నది. ఒక స్కూలు, ఆటస్థలము వున్నవి. టి.బి. వున్న వారికి ఈ ప్రదేశములో తర్వగా ఆరోగ్యము చేకూరునని ఆరోగ్య నిపుణుల అభిప్రాయము. స్వామి ప్రణవానంద తన పుస్తకములో ఇలా వ్రాశారు. "This is a Good health-resort, Many T.B. Patients are recovered here"

సాయంత్రం 4-30 గంటలకు మాసామానులన్నియు గుఱ్ఱములపై వచ్చెను. సామానులన్నింటినీ ఒకమారు సరిచూసు కొని మరలా Re-packing చేశాము. ప్రతి వస్తువును కూడా పాలిథిన్ బ్యాగ్‌లో వేసి మరలా Water proof bag లో నుంచవలెను.

6-30 గంటలకు టమోటాసూప్ సేవించితిమి. 7-00 గంటల ప్రాంతములో నిగమ్ వ్యక్తి మరియు గైడు మమ్మల్ని సమావేశ పరచి రాబోయే ప్రయాణముల కష్ట సుఖములు, తీసుకోవలసిన జాగ్రత్తలు గురించి ఈ విధంగా తెలిపిరి.

1. నడుచునప్పుడు కొండ ప్రక్కగా నడవాలి. గుఱ్ఱములు, గాడిదలు ఎదురు వచ్చిన యెడివైపే వాటికి దారి యివ్వాలి.

2. రైన్‌కోట్, మందులు, తినుబండారములు, అత్యవసర వస్తువులు, నీళ్ళ బాటిలు, ఎల్లవేళలా భుజపు బ్యాగు (Treckking Bag) లోనే ఉంచుకోవాలి.

3. ఖాళీ కడుపుతో కొండలెక్కరాదు.

4. పర్వతారోహణ సమయములో అలసట, ఆయాసము యుండును. 10,000 అడుగు పైబడిన ప్రాంతములను Higher Attitude అంటారు. ఎత్తు ప్రదేశములో ప్రాణవాయు (Oxygen) లోపము యుండుట వలన కండ్లు తిరుగుట, నీరసము కలుగును. ఈ ప్రాంతముల నడిచే టప్పుడు మామూలుగా నడవాలి. వేగంగా పరిగెత్తి నడచిన నిసత్వ ఆయాసం వ ప్రాణాపాయమునకు కూడా దారితీయ వచ్చు. మనోనిబ్బరము అవసరము. అప్పుడప్పుడు చాక్లె చప్పరిస్తున్న యెడల కొంత ప్రశాంతత కలుగును.

5. ఒంటిరిగా ఎవరికి వారు వెళ్ళకూడదు. జట్లుగా నడవాలి. భక్తి భావనతో నడవా

6. ఆల్కహాల్, సిగరెట్లు వంటి మత్తు పదార్థములు నిషిద్ధము.

7. బాగా ప్రాణవాయువు లోపము కన్పించి నప్పుడు పర్వతములపైభాగం వైపు కాళ్ళుచా క్రింద భాగంపైపు తలను యుంచి కాసేపు విశ్రమించాలి.

8. ముఖ్యంగా 'కైలాస మానస సరోవర' పరిక్రమంలో అందరూ సహకరిం కొనుచుండవలయును. కలసి వంటలు చేసుకొనవలయును.

9. తిరిగి వచ్చేటప్పుడు పోలీసు, మిలటరీ, డాక్టర్స్ మానస సరోవర రాళ్ళు, జలము అడుగుతారు. వారికోసమై కొంత అధికంగా తీసుకొనివచ్చుట మంచిది.

10. కొండలపై నుండి ప్రవహించు సెలయేటి జలములో Water purity tablets కలుపు త్రాగాలి.

11. జలపాతముల ప్రాంతములను త్వరగా దాటిలి. ఎందుకంటే ఒక్కోసారి ఆ ప్రాంతము కొండల నుండి రాళ్ళు క్రిందకు పడుతుంటాయి.

12. మనో బలం ఉండాలి. పరిసరాలను చూసి భయపడక దైవ ధ్యానముతో మనస్సు ని ఉండాలి.

13. ఆహార విషయములలో ఏది దొరికితే అదే మహా ప్రసాదమని భావించాలి.

14. 20 రోజుల నడక వుండును. కనుక 2 జతల బూట్లు ఉండవలయును. వాటర్ ప్ర బూట్లు అయితే మరీ మంచిది. నడిచే ప్రాంతములలో నీరు 2 నుండి 3 సెంటీ గ్రేడ్‌లు ఉండ అందువలన బూట్ల విషయంలో మంచివాటినే సెలక్టు చేయవలయును.

ఇట్లే మరికొన్ని విషయములను వివరించి 8-30 ప్రాంతములో భోజనాలు పూర్తిచేసు కొంతసేపు భజనలు చేసి గాఢ నిద్రలో మునిగిపోయితిమి.

# సిరఖా వైపు

పంగ్ క్యాంప్‌లో ఆగష్టు 9 వ తేదీన ఉదయమే మేల్కొని కాలకృత్యములు తీర్చుకొని
-40 గంటలకు అల్పాహారము, బోర్న్‌వీటా సేవించాము. 6 గంటలకు ప్రయాణమును
ాగించితిమి.

ఒక కిలోమీటరు నడిచిన తరువాత రెండు దార్లు కనిపించాయి. ఒకటి సిరఖా
Sirakka) వైపు, మరొకటి నారాయణాశ్రమము వైపుకు వెళ్ళేది. నేటి క్యాంప్ 'సిరఖా' అయినప్పటికీ,
ారిత్రాత్మక ప్రసిద్ధిగాంచిన శ్రీ నారాయణాశ్రమమును సందర్శించిన తర్వాతనే ప్రయాణమును
ొనసాగించుట జరుగుతుంది. అందువలన క్యాంప్ దూరము 6 కి.మీ. పెరుగుతుంది. నేరుగా
ెళ్లితే 10 కి.మీ. ఉండును.

యింకా 3 కి.మీ. ప్రయాణము కొనసాగించగా సోనా (Sona) గ్రామము వచ్చెను.
నాభా దాదాపు 2,200 మంది ఉండును. ఇక్కడి ఇండ్లు చాలా చిన్నవి. ఈ ఇండ్ల ముందే
ట్లలు కట్టి మడులు చేసి వ్యవసాయము చేయుదురు. వరి, గోధుమ, బార్లీ, వీరి ముఖ్య
ంటలు. అక్టోబరు తరువాత ఈ ప్రాంతము పూర్తిగా మంచుతో నిండియుండును. అందువలన
క్టోబరు దాటిన తరువాత క్రింద ప్రాంతములకు వెళ్ళి కూలిపనులు చేస్తారు.

ఈ గ్రామములో టీ సేవించి ప్రయాణమును కొనసాగించాము. దారి కొంత దూరము
మతలంగానూ, మరికొంత దూరము ఎత్తుగానూ యున్నది. సుమారు 9-00 గంటలకు
**శ్రీ నారాయణాశ్రమమును** చేరితిమి



నారాయణాశ్రమము 1923వ
సంవత్సరములో ఈ ఆశ్రమ నిర్మాణము
జరిగెను. బెంగుళూరు నివాసి అయిన
శ్రీ నారాయణ స్వామి గారు కైలాస మానస
యాత్ర ముగించి తిరిగి వచ్చి యిచట
స్థిరనివాస మేర్పరచుకొనెను. భారత
ప్రభుత్వము ఈ యాత్రను నిర్వహించక
ముందు ఈ ఆశ్రమము క్యాంప్‌గా
ఉపయోగపడేది.

ఈ ప్రదేశములో చాలా చాలా పెద్ద ఫలవృక్షములూ పూలతోటలూ ఉన్నవి. ఎదురుగా
నేపాల్ మంచు పర్వతములు, దాని క్రిందుగా 'కాళీ గంగా' (Kali Ganga) నది ప్రవహించుచున్నది.

ఈ ఆశ్రమములో సకల ధర్మముల పుస్తకములతో గ్రంథాలయము కలదు. యివది రెండతస్థుల భవనము పైభాగమున ఒక విష్ణు మందిరము, భజనలు చేయుటకు హాలు ఉన్నది. దానికి ఎదురుగా నారాయణ స్వామి వారి సమాధియున్నది. శ్రీ ప్రణవానందస్వామి వారు తమ పుస్తకములో ఈ ఆశ్రమము వారు చేయు సేవలను చాలా గొప్పగా వ్రాశారు.

ప్రస్తుతము ఈ ఆశ్రమము "గంగోత్రిభాయి" అనబడే వృద్ధ స్త్రీ 1974వ సంవత్సరము నుండి నడుపుచున్నది. మేమందరమూ ఈ ఆశ్రమములో సంకీర్తనలు చేసి హల్వా తిని, టీలు సేవించితిమి. అందరికి ఈ ఆశ్రమ వాతావరణము ఎంతో ప్రశాంతత కల్గించినది. జనవాసములకు ఎంతో దూరములో ఇలాంటి ఆశ్రమములు భారతదేశములో ఎన్నెన్నోకలవు. ఋషీకేశ్, బదరీనాథ్, కేదార్‌నాథ్‌లలో ఇలాంటి ఆశ్రమములు కనిపిస్తాయి. ఈ ఆశ్రమ జీవనము వలన ఎలాంటి లాభము కలుగుతుంది? ముక్తి కలుగుతుందా లేక జ్ఞానము పెంపొందుతుందా? జ్ఞానమును పెంపొందించడానికి ఆశ్రమవాసము కావాలా? ఇలాంటి సంశయములు ఎందరికో కలవు.

కృత, త్రేతా, ద్వాపర యుగములలో హఠయోగాదుల వలన, దైవ సాన్నిధ్యము లభించెడిది, కాని కలియుగములో భక్తితో నామస్మరణ చేసిన చాలును.

శ్లో॥ అన్య విద్యా పరిజ్ఞాన మవశ్యం నశ్వరం భవేత్।
బ్రహ్మ విద్యా పరిజ్ఞానం బ్రహ్మ ప్రాప్తికరమ్ స్థిరమ్॥

ఇతర విద్యలు ఎంత తెలిసి కొన్నా నశిస్తాయిగాని బ్రహ్మవిద్య అట్లు నశింపక పరబ్రహ్మ జ్ఞానమును కలిగించి, పరబ్రహ్మతోడ ఐక్యము అగునట్లు చేయును. అట్టి ఈ బ్రహ్మవిద్య గురువు యొక్క అనుగ్రహం, శుశ్రూష చేసినగాని లభించదు. అట్టి గురువులు ఎనిమిది విధములుగా నుందురు.

1. బోధక గురువు : వేదాంత శాస్త్రమందలి శబ్దార్థములను మాత్రమే చక్కగా బోధించు గురువు.

2. వేదక గురువు : వేదాంత శాస్త్రములయందలి శబ్దార్థములను. బోధించి తత్వమును దర్శింప చేయువారు.

3. నిషిద్ధ గురువు : వశ్యము, ఆకర్షణము మొదలగు మంత్రములచేత యిహలోక మందును, పరలోకమందును సుఖ దుఃఖముల నిచ్చువారు.

4. కామ్యక గురువు : పుణ్యకర్మములు జేయుమని చెప్పి పుణ్యకర్మలు చేయించి తద్వారా యిహలోక పరలోకముల సుఖముల నిచ్చువారు.

5. సూచక గురువు : వేదాంత శాస్త్రముల యొక్క అంతరార్థమును తెలుపుచూ జ్ఞానమును కలుగజేసి తద్వారా శమ, దమ, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము అనుసద్గుణములను కలుగజేసి ఆత్మావ లోకనము చేయువారు.

6. వాచక గురువు : శ్రోత, త్వక్, చక్షు, జిహ్వా ఘ్రాణము లనెడి జ్ఞానేంద్రియముల యొక్కయు వాక్పాణి పాద పాయూపస్థలనెడి కర్మేంద్రియముల యొక్కయు, మనోబుద్ధి చిత్త అహంకారంబులనెడి అంతరేంద్రియముల విషయములగు శబ్ద స్పర్శరూప రస గంధములు వచన దాన గమనాగమన విసర్గ ఆనందములు, సంకల్ప వికల్ప నిశ్చయ చంచల కర్తృత్వములు, వీటియందు వైరాగ్యమును కలిగించి శిష్యుని అంతఃకరణ నిర్విషయముగునట్లు చేయు మహానుభావుడు 'వాచక గురువు' అట్టి బోధయందే మనస్సు ఊర్ధ్వముఖ వ్యాప్తియై నిర్విషయమయి ఉండును.

7. కారణ గురువు : 'అహం బ్రహ్మాస్మి' యను మొదలుగాగల మహా వాక్యములను బోధించి జీవేశ్వరైక్యమును తేటతెల్లముగా తెలిపి జీవన్ముక్తి మనుభావమును కలుగ జేసిన పరమపురుషుడు 'కారణ గురువు'.

8. విహిత గురువు : శిష్యునికి గల సకల సంశయములను నివర్తింపజేసి ఆ సచ్ఛిష్యుని యేమాత్రము సందేహములేని వానినిగా చేసి తద్వారా విదేహ ముక్తి కైవల్యము నిచ్చునట్టి వాడు 'విహిత గురువు' వానినే సాక్షాత్ పరమ శివునిగా చెప్పవచ్చును. అట్టి వానిని వర్ణించుటకు ఆదిశేషునికైనా వలనుగాదు.

శ్లో॥ కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠంతి తస్కరాః ।
జ్ఞాన రత్నాపహారాయ తస్మా జ్జాగ్రత జాగ్రతః ॥

శ్లో॥ యస్సర్వత్రానభి స్నేహః తత్తత ప్రాప్య శుభాశుభమ్ ।
నాభావన్దతి తద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితాః ॥

కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనెడి అరిషడ్వర్గమును దగ్గరకు జేరనీయక, ప్రతిఫలము నపేక్షింపక, దేహప్రాణాదులగు సర్వ విషయములలో దేనియందు నభిమానముంచక, తనకు కలిగిన శుభమును గూర్చి, అశుభమును గూర్చి సంతోషముగాని విచారముగాని పొందకుండ యుండునో వాని యొక్క బుద్ధియే భక్తి, జ్ఞాన భావనలకు దగ్గర చేర్చును. అట్టి జ్ఞాన మనెడు రత్నమును దొంగిలించు అంతః శత్రువులు గూర్చి జాగ్రత్త సుమా! అని బోధించి, సరియైన మార్గములో పయనింపజేసి నిర్గుణ సాక్షాత్కార పరబ్రహ్మ స్వరూపమునందు మనస్సును లగ్నము చేయించి, ముక్తిని కలుగచేయు పాఠశాలలే ఈ ఆశ్రమములు.

ఇటువంటి మహోత్తరమైన గుణములు కల్గిన ఈ నారాయణాశ్రమములను దర్శించుట ఎంతో విశేషమనే చెప్పవచ్చును.

సిరళా వైపు : 10-40 గంటలకు మరలా ప్రయాణమైతిమి. ఈ ఆశ్రమమును దాటిన 10 నిముషములకు దాదాపు వంకరటింకరలతో దారి ప్రక్కన 'కాళీగంగా' నది మరలా ప్రత్యక్షమయ్యెను. వాతావరణము చాలా ఆహ్లాదకరముగా వుండెను. ఈ దట్టమైన అరణ్యములో

కొంత దూరము నడువగా 'సిర్థాంగ్' అనే గ్రామము వచ్చెను. ఇంకా 1 1/2 కి.మీ. నడిచి పిదప సిరఖా గ్రామములో మా క్యాంప్‌కు చేరితిమి.

16 కి.మీ.ల ప్రయాణము ఈ రోజు పూర్తి అయినది. చేరిన వెంటనే K.M.V.N. వారు రస్నా ఇచ్చిరి. తర్వాత విశ్రమించాను. సుమారు రెండున్నర గంటలకు భోజన కార్యక్రమములు ముగించుకొని, అందరం గాఢ నిద్రలో మునిగిపోయాము.

విశ్రాంతి అనంతరము ప్రకృతి దృశ్యములను చూచుచూ కొన్ని ఫోటోలను తీసికొంటిమి.

ఈ సిరఖా సముద్ర మట్టము నుండి 8,450 అడుగుల ఎత్తులో వున్నది. సాయంత్రం 5 గంటలకు విపరీతమైన భారీ వర్షము ప్రారంభమయ్యెను.

ఈ క్యాంప్‌లో 4 గదులు, బాత్‌రూములు ఏర్పాట్లు చేసిరి. సాయంకాలం పూజాది భజనలు పూర్తి చేసుకొని 8-30 గంటలకు భోజనాలు పూర్తి చేసుకొని విశ్రమించితిమి.

## గాలా (Gala) వైపు

ఈ రోజు ఆగస్టు 10. ఎప్పటివలనే ఉదయమే అన్ని కార్యక్రమములు పూర్తి చేసుకొని 'టీ' సేవించితిమి. ఈరోజు ప్రయాణము చాలా కష్టమైనదని, దూరం కూడా ఎక్కువని అధికారులు చెప్పి, మమ్మల్ని మానసికంగా సిద్ధం చేశారు.

టిఫిన్ ప్యాకెట్స్ ఇచ్చారు. ఉదయం 5 గంటలకు ప్రయాణము ప్రారంభమైనదినడక. చాలా ఆహ్లాదకరముగా సాగినది. చుట్టూ పచ్చని చెట్లు, పిల్ల కాలువలు, విచిత్రమైన పక్షుల సముదాయములు, దూరాన మంచు పర్వతములు చూడవలసినదేగాని చెప్పనలవిగాదు. ఇక్కడ నుండి దారి చాలా కష్టముగా వుండెను. చాలా తక్కువ వెడల్పులో పైకి ఎక్కవలయును. ఈ విధముగా సుమారు ఇంకో గంటసేపు ప్రయాణము చేసి బాగా అలసిపోయితిమి. సమారి (Samari) అను గ్రామము దాటిన తదుపరి ITBP వారి Camp కి చేరాము. అక్కడకు దగ్గర్లో చిన్న టీ దుకాణమున్నది. అక్కడ అందరము కార్యక్రమములు ముగించుకొని మరలా ప్రయాణమును కొనసాగించితిమి.

సమయము సుమారు 7-30 గం॥ అయినప్పటికీ శ్రీ సూర్యనారాయణుని దర్శన భాగ్యము కలుగలేదు. సింఖోలా (Simkola) చెట్లు చాలా వున్నాయి. ఈ చెట్లు చాలా ఎత్తుగా వుండుట వలన మరియు దూరాన వున్న పర్వతముల వలన సూర్యకిరణ ప్రసారము ఈ ప్రదేశములో అతి తక్కువగా వుండును. అందువలన చాలా చలిగా వున్నది.

సుమారు 9 గంటలకు 'రుంగ్‌లింగ్ టాప్' (Rungling Top)కి చేరాము. ఈ ప్రదేశము సుమారు 10,000 అడుగుల ఎత్తులో వున్నది. ఇచ్చట సూర్యకిరణముల తీవ్రత

చాలా హెచ్చుగా యున్నది. కాని చలి ప్రదేశము నుండి వచ్చుట వలన ఈ ఎండలో కాసేపు విశ్రాంతి తీసుకొని ముందుకు సాగితిమి. ఇచ్చటి నుండి సూర్య కిరణముల ప్రభావము ఎక్కువగా యున్నది. మార్గము దిగువునకు యున్నది. ఈ పర్వతప్రదేశములలో పైకెక్కుట చాలా కష్టతరము. క్రిందకు దిగుట కొంత సుఖము. జాగ్రత్త అవసరము. ఏమరుపాటుగా యున్నచో జారిపడుట జరుగును.



రుంగ్‌లింగ్ టాప్

నాకు ఈ రోజు చాలా నీరసముగాయున్నది. విరోచనములు ఎక్కువగా అగుట ఒక కారణముకాగా, సరైన ఆహారము లేకపోవుట కూడా ఇంకొక కారణము.

ఈ సమయములలో తిరిగివచ్చు బృందము వారు కన్పించి మాతో మాట్లాడిరి. వాతావరణము చాలా బాగున్నదని అభినందించుచూ, ధైర్యము చెప్పుచూ కొండను ఎక్కసాగిరి. సుమారు 2 కి.మీ. దిగిన తర్వాత పూర్తిగా అడవి మధ్యలో యున్నట్లుండెను. చాలా దూరము నుండి నేపాల్‌లోని 'అన్నపూర్ణ' పర్వతము చాలా చాలా అందముగా కనిపించినది. ఈ ప్రాంతములో కొన్ని ఫోటోలను తీసుకొని ప్రయాణమును సాగించితిమి.

ఇంకా 3 కి.మీ. దిగిన తర్వాత నదీ ప్రాంతమునకు చేరితిమి. ఇక్కడితో దట్టమైన అరణ్యములో ప్రయాణము ముగిసెను. నది దాటుటకు చెక్క వంతెన గలదు. ఈ నదిపేరు 'సింఖోలా'. ఇచ్చట నీటి ప్రవాహము చాలా హెచ్చుగా యున్నది. పది నిమిషాల్లో ఈ వంతెనని

దాటితిమి. ఇచ్చట నుండి దారి చాలా కష్టముగా వున్నది. రెండు నుండి మూడు అడుగు వెడల్పు రోడ్డు గలదు. ఇచ్చట నుండి కొంత ఏటవాలుగా, కొంత సమతలంగా ప్రయాణమ సాగినది. ఈ రోజు నేను బాగా అలసియుండుట వలన ఇచ్చటి నుండి క్యాంపు వరకు గుఱ్ఱముపై ప్రయాణము చేసితిని. నాతోపాటు 18 మంది కూడా ఇచ్చట నుండి గుఱ్ఱముపై ప్రయాణమ చేసిరి. మధ్యాహ్నం 1-30 గం॥లకు గాలా (Gala) క్యాంపునకు చేరితిమి. సముద్ర మట్టమ నుండి ఈ ప్రదేశము 8050 అడుగుల ఎత్తులో వున్నది. ఈ రెస్టుహౌస్‌లో 4 గదులు, బాత్ రూములు, వంటశాలలు, చెక్క మంచములు గలవు. అందరికంటే ముందుగా 'అగర్వాల్ చేరినందున ప్రయాణీకులందరూ కూడా మానసికంగా చాలా బాధపడ్డారు. ఎందువలనంటే బాధ్యత వహించవలసిన తను అందరికంటే ముందుగా చేరటమేకారణము.

సుమారు 2-30 గంటలకు భోజనాది కార్యక్రమములు ముగిసినవి. సాయంత్రం 4 గంటల నుండి 7 గంటల వరకు కుంభవృష్టిగా వర్షము పడెను. ఈ సమయములో KMVN వారి సేవలు మరచిపోరానివి. సూప్, టీలను రెండుసార్లు సప్లయిచేశారు. త్రాగుటకు వేడినీరు కూడా సప్లయి చేయుట గొప్ప విశేషము. మా బ్యాచ్‌లోని బీహార్ నివాసికి ఆరోగ్యము కొంచెం నలతగా యుండుట వలన డాక్టరుగారు యింజెక్షన్లు, బిళ్ళలు ఇచ్చారు. మమ్మల్ని అందర్నీ కూడా కుశల ప్రశ్నలు వేసి, వివరములు తెలిసికొని వెళ్ళారు.

ఉజ్జయినీ నివాసి అయిన 'లంగర్' గారు నా వివరములు తెలసికొని, అందరికీ వెల్లడిచేశారు. మా బ్యాచ్‌లోనివారందరూ కూడా నాబెడ్ చుట్టూ చేరి వారివారి జాతక విశేషములు తెలుసుకొన్నారు. మా బ్యాచ్‌లోని కుట్టిగారు హిందీ, ఇంగ్లీషు, తెలుగు, తమిళము, మలయాళము, కన్నడ భాషలు అనర్గళంగా మాట్లాడగలరు. వీరిది కేరళ రాష్ట్రము. నేను చెప్పే మాటలకు సరియైన పద్ధతిలో వారి వారి భాషలలోకి అనువదించి చెప్పుటటవలన అందరూ చాలా సంతోషించారు. మన దేశములో చాలా మందికి జ్యోతిష్య శాస్త్రముపై నమ్మకము యున్నది. కొద్ది మందికి మాత్రమే నమ్మకంలేకుండా వున్నది. షుమారు 1984వ సంవత్సరంలో ఈ శాస్త్రముపై సర్వే చేశారు. 50 శాతము నమ్మకం కలిగియున్నవారు.,30 శాతం నమ్మకము లేనివారుగానూ.,15 శాతం ఎటూ చెప్పలేని స్థితిగా, 5, శాతం ఏ భావములేని వారుగా సర్వేలో పై విషయములు తెలిసినవి. ఈ జ్యోతీష్య శాస్త్రములకు ఖగోళ సూత్రములే ఆధారము.

పరాశరుడు, జైమినీ, బృహస్పతి, మయబ్రహ్మ, వరాహమిహిరుడు వ్రాసిన ఖగోళ సూత్రములే ఈ శాస్త్రమునకు ఆధారములు. పురుష సూక్తము, వేద మంత్రాలలో ఈ జ్యోతిష్య శాస్త్రమును గూర్చి వివరములు గలవు.

పూర్వకాలములో వరాహ మిహిరుడు పరాశర, కళ్యాణవర్మ మొదలగు వారుకాగా, పాశ్చాత్యమున షీరో, ఏలెన్‌లియో, సెఫెరియల్, హిందేల్, సారికిన్ వంటివారు ఈ జ్యోతిష్య

శాస్త్రమునకు ఎనలేని సేవచేసి, అనేక గ్రంథములు రచించారు.

నక్షత్ర, తిథి, మాసముల వలన సంవత్సర గణితం ఏర్పడుతుంది. నక్షత్రముల ద్వారా రాశులు ఏర్పడతాయి. సూర్యచంద్రుల గమనము వలన అమావాస్య, పూర్ణమలు ఏర్పడతాయి. మనము నిత్యము చూసే 'పంచాంగము'లో నక్షత్ర, తిథి, మాసం, యోగం, కరణం, వర్జ్యములు ముఖ్యమైనవి. ఇదే విధంగా హస్త సాముద్రికము, శకునశాస్త్రము, లకోటా ప్రశ్నలు, వాస్తు శాస్త్రము, సంఖ్యా శాస్త్రము, గ్రాఫాలజీ, ఫేస్ రీడింగ్, అరికాలు చూచి చెప్పే శాస్త్రము, బొటన వ్రేలుతో చూసే నాడు శాస్త్రములు, నీడను చూసి చెప్పే నాడీ శాస్త్రము మొదలగునవి ఎన్నోకలవు. ప్రస్తుత కాలములో భారత దేశంలో బి.వి.రామన్(బెంగుళూరు), కె.పి. ఆస్ట్రాలజీ(మద్రాసు), కలకత్తాలోని హరి ఆస్ట్రాలజీ సెంటర్, కున్‌దల్‌గుడి పబ్లికేషన్స్(మద్రసు), ఆంధ్రప్రదేశ్‌లో వేదవ్యాస్, మధురా కృష్ణమూర్తి మొదలగువారు ఈ శాస్త్రమునకు ఎనలేని సేవ చేయుచూ అందరి మన్ననలను పొందుట గర్వకారణము.

రాత్రి 7-30 గంటల వరకూ భజనాది కార్యక్రమములు పూర్తిచేసుకొని 8 గంటలకు రాత్రి భోజనమును పూర్తిచేసితిమి.

శ్లో॥ కరస్థే హేమాద్రౌ గిరీశ నికటస్థే ధనపతౌ
గృహస్థే స్వర్భూజామర సురభి చింతామణి గణే
శిరస్థే శీతాంశౌ చరణ యుగళస్థే ఖిలశుభే
కమర్థం దాస్యేహం భవతు భవదర్థం మనుమ్యః

రాత్రి 8-30 గంటలకు దైవ ప్రార్థన చేసికొని నిద్రలోకి జారితిమి.

"మా అబ్బాయి సత్యనారాయణ వ్రతము చేసుకొనెను. మాకు బట్టలు పెట్టారు" అని తల్లిదండ్రులు ఏవిధంగా సంతోషపడ్డారో అదేవిధంగా భగవంతునికి మనము ఏదైనా సమర్పించినా ఆయన అట్లే సంతోషపడగలడు. తల్లిదండ్రులు చిన్ని పిల్లచేతిలో వున్న పదార్థములను అడిగి పుట్టించుకొని ఎట్లు సంతోషపడుదురో అదే విధంగా భగవంతునికి భక్తితో మనము నేమి సమర్పించిన మనకు ముక్తినిచ్చును. అందువలననే శ్రీ ఆదిశంకరాచార్యులు ఈ విధంగా అనుచున్నారు.

"ఓ పరమేశా! ఈశా! నీవు సదా సంపన్నుడవు నీకు నేను ఏమివ్వగలను? నా మనస్సును తీసుకొనుము. మనసారా మన ప్రేమను భగవదర్పితము చేయుటచే శరణాగతి.

## మాల్పా వైపునకు

ఈ రోజు ఆగష్టు 11. ఉదయం 5-30 గంటలకు ఫలహార టీ కార్యక్రమములు పూర్తిచేసుకొని బయలుదేరితిమి.

నేటి ప్రయాణము మాల్పా వరకు గలదు. మాల్పాకు 11 కి.మీ. దూర్గముండును. ఈ రోజు దారి చాలా కష్టముగా వున్నది. ఈ దారిలో సుమారు 4,444 మెట్లు యున్నవి. మెట్లు ఎక్కుట దిగుట వలన ఆయాసము కలుగుచున్నది. గుఱ్ఱములపై ప్రయాణములు అనుకూలముగాదని చెప్పుటవలన అందరూ నడక ద్వారానే ప్రయాణమును సాగించుచుండిరి.

ఈ దారిగుండా నెమ్మదిగా 'కాళీగంగా'కు దగ్గరలో కొంత ముందుకుపోగా చిన్న హోటలు వున్నది. అచట బిస్కట్లు, టీ తీసుకుని మరల ప్రయాణమైతిమి. 6 కి.మీ. దూరము వరకు ప్రయాణము పూర్తి అయినది. అందరూ ఇచ్చట అరగంటసేపు విశ్రాంతి తీసుకొనిరి.

ఇక్కడ నుండి జలపాతములు గలవు. కాళీగంగానది, జలపాతముల మ్రోతలు పర్వతములలో ప్రతిధ్వనించచూ మారుమ్రోగుచుండెను. కాళీగంగా నది వేగము ఇక్కడ చాలా ఎక్కువగా యున్నది. ఎంతో భయమును గొలుపుతున్నది. పైనుండి జలపాతములు, ప్రక్కన కాళీగంగానది మరియు దారి 2 1/2 అడుగులు మాత్రమే యుండుట వలన ఈ మార్గములో ప్రయాణముచేయుట గొప్ప అనుభూతి కలుగుచున్నది.

రెయిన్‌కోట్, గొడుగులను ధరించి ప్రాణములను అరచేత పెట్టుకొని సాగుచుంటిమి. రెండు కొండలనడుమ వెడల్పు తక్కువగావుండుటవలన కాళీగంగానది తీవ్రత, వేగము ఎక్కువగా వున్నది. 10 విమానములను ఒక్కసారిగా స్టార్ట్‌చేస్తే ఎంత శబ్దము వస్తుందో, ఆ విధమైన శబ్దతీవ్రత వలన ప్రతి యాత్రికుడు కూడా భయాందోళనకు లోను కావలసిందే. మా గుంపులో ఆరుగురు ఈ నదిలో పడిపోయే పరిస్థితి ఏర్పడిందికాని, దైవానుగ్రహము వలన చివరి నిముషములో తప్పించుకోవడం జరిగింది. బయటపడిన ఆరుగురు ప్రయాణీకులలో నేనుకూడా యున్నాను. చుట్టూ ప్రకృతి చాలా అందముగా వున్నది. పైన జలపాతములు, క్రింద కాళీగంగానది. నీటి మధ్యన ప్రయాణము. జీవితములో ఎవరైనా ఇలాంటి సుందర దృశ్యముల నడుమ ప్రయాణించియుండరు. ఈ సందర దృశ్యములను నా కెమారాలోనికి బంధించదలచాను. 4, 5 ఫోటోలు తీసిన తరువాత చూతునుకదా! నా రెండుకాళ్ళు కూడా నదివైపునకున్నవి. ఏ మాత్రము బ్యాలెన్స్ కోల్పోయినా నదిలో పడవలసినదే. అట్టి భయానక స్థితిలో బ్యాలెన్స్ తప్పుట జరిగినది. ఈ క్షణములో ఆ పరమేశ్వరుని కృపవలన నా కఱ్ఱ కొండ చివరన యున్న కన్నములోనికి దూరటము, నేను ఆ కఱ్ఱను పట్టుకుని వ్రేలాడుట, ఆదే క్షణములో గుఱ్ఱమువాలా శంకర్‌సింగ్ నన్ను కాపాడుట జరిగినది. ఈ సంఘటనంతా ఒక్క క్షణములో జరిగినది. కొంతమందికి పై నుంచి క్రిందికి రాళ్ళుపడుట జరిగినది. వాళ్ళకు కూడా తృటిలో ఆపద తప్పిపోయినది. పైనుండి రాయి వచ్చి తగిలినా నదిలో కలసిపోవలసిందే. ఎలాగైతేనేమి కష్టమైన రెండు కిలోమీటర్ల దారిని దాటితిమి. అందరూ కాసేపు విశ్రాంతి తీసికొని, మరలా ప్రయాణమును సాగించితిమి. ఒక కిలోమీటరు దాటిన తర్వాత ప్రశాంతమైన వాతావరణము కనిపించసాగెను. మా దారి కుడివైపునకు

గెను. నది వెంబడే దారి. ఇరువైపులా ఎత్తైన పర్వతములు - మధ్యలో నది.

మధ్య మధ్య ఆగుచూ సుందర దృశ్యములను ఫోటోలు తీయుచూ పర్వతాగ్రము చేరాము. దారిలో మరికొన్ని సుందర జలపాతములను చూచుచూ, ఈ మెట్ల దారి గుండా ఎక్కుచూ, దిగుచూ మాల్పాకు సుమారు 12 గంటలకు చేరితిమి.

## మాల్పాగ్రామముపై శివతాండవము

ఎవ్వరూ ఊహించని విధంగా మాల్పా గ్రామము తుడిచిపెట్టుకొనిపోయింది. ఆగష్టు 18, 1998 అర్ధరాత్రి 12 1/2 గంటల సమయంలో హిమాలయములలో ఉన్న మానససరోవర యాత్ర క్యాంప్‌లలో ఒక్కటైన మాల్పా క్యాంప్ 90 సెకన్ల కాలములో అంతా నేలమట్టయినది.

1966 సంవత్సరములో పూర్వము ఇచట భయంకరమైన భూస్థలనము జరిగి కొండ చరియలు విరిగి ఎనలేని పశుసంపదతోపాటు 150 మంది మరణించారు. ఈ భూస్థలనము 'లోకర్‌కూ', 'లోకర్‌టాప్' ప్రదేశములలో జరిగెను. ఇక్కడ నుండి మాల్పా గ్రామము రెండు కిలోమీటర్ల దూరములో నిర్మించారు. చుట్టూ జలపాతముల స్రోతతో, భయంకరమైన ఈ ప్రదేశము పరమ శివుని శివతాండవమును గుర్తు చేస్తుంది.

జీవసమాధి అయినవారిలో 60 మంది ఈ మానస సరోవర యాత్రికులు. వారితోపాటు 100 మంది సహాయకులు కూడా వున్నారు. వీరందరి గురించి ఒక్కనిముషమైనా ఆ పరమశివుని ధ్యానించండి. అదే నిజమైన సంతాపము.

ఈ మాల్పా క్యాంప్ సముద్ర మట్టమునకు 6,765 అడుగుల ఎత్తునవున్నది. కాళీగంగానది ఒడ్డున ఈ క్యాంప్ వుండుట విశేషము. చుట్టూ ఎత్తైన కొండలు, నడుమ మా క్యాంప్, ప్రక్కన కాళీ గంగానది యున్నది. యిలాంటి సుందరమైన ప్రదేశమును వర్ణించతరమా!

మేమందరము భోజనము చేసి వెంటనే నిద్రపోతిమి. సాయంత్రము 6 గంటలకు లేచి టీ త్రాగి దైవప్రార్థనలు చేసితిమి.

మాతో వచ్చిన కె.ఎం.వి.ఎన్. వారి డాక్టరు మా అందరికీ మిషన్ ద్వారా బి.పి. పరిశీలించారు. ప్రతి ఒక్కరికీ బి.పి. ఎక్కువగా వుండెను. నాకు 110 నుండి 150 బి.పి. పెరిగినది. అందరికీ నిద్ర మాత్రలు యిచ్చి వెళ్లారు. ప్రతి బ్యాచ్‌లోనూ అందరికీ బి.పి. తీవ్రత పెరుగుతుందని అందువలన కాంపోస్(?) లాంటి నిద్ర బిళ్ళలు యిక్కడ వాడవలసినదని గైడ్ చెప్పాడు. అలా నిద్ర మాత్రలు వేసుకొననియెడల కొందరికి నిద్రపట్టక ఉదయాన బి.పి. (రక్తపోటు) పెరుగుట జరుగుచున్నదని, అలా అత్యధికంగా బి.పి. పెరిగిన వాళ్ళు యాత్రను ఇంతటితో నిలిపివేయవలసిన పరిస్థితి కలుగును. అందువలన అందరూ ప్రశాంతంగా నిద్ర పోవలసినదిగా సలహా ఇచ్చిరి.

అందరికి ఈ రోజు ప్రయాణము వింత అనుభూతి కలిగించినది. గుంపుగా ప్రయాణం

చేస్తేనే, ఇంత భయానకంగా వున్నది కదా! ఒక్కరే ఈ మార్గాన ప్రయాణము చేయుట జరిగితే, సామాన్య మానవుని పరిస్థితి ఏమిటి? గుండె ధైర్యం లేకపోతే ఈ దృశ్యములకు, భయంకర శబ్దముకు గుండె ఆగిపోవలసిందే కదా!

సన్యాసులు ఈ హిమాలయాలను ఒంటరిగా సంచరించుచుందురు. వారి పరిస్థితి ఏమిటి?

మా గురుదేవులు శ్రీ కంఠమాల సుబ్బావధాని గారు చెప్పిన శ్లోకము అసంకల్పితముగా నానోటినుండి వచ్చినది.

శ్లో॥ సతార్థసేవా మనసః ప్రసాదినీ
దేశస్య వీక్షా మనసః కుతూహలమ్ ।
క్షిణోత్యనర్థాన్ సుజనేన సంగమ
స్తన్మాన్న కస్మై భ్రమణం విరోచతే ॥

పుణ్య తీర్థముల సేవ మనస్సును నిర్మలము గావించును. దేశ సందర్శనం మనస్సునకు కుతూహలముగా వుండును. సుజనులతోటి చెలిమి అనర్థములను దుఃఖములను అంతము నొందించును. అందువలన దేశ సంచారము విశేషించి ఎవరికీ రుచింపదు కదా! దేశ సంచారములు, యాత్రలు చేయుట చాలా కష్టతరమైనది. అందువలన ఎక్కువ మంది యాత్రలకు దూరముగా వుంటారు.

ముఖ్యముగా సన్యాసము రెండు విధములు. విద్వత్సంన్యాసము, వివిదిషా సన్యాసము. మొదటిది జీవనముక్తి, సుఖ సిద్ధికై వీక్షేప విసృత్తి తత్త్వము నెఱిగినవాడు ఆచరించునది. వీరు ఎల్లప్పుడు యాత్రలు చేయుచుందురు. రెండవది తత్త్వార్థమును లక్ష్యముగా చేసికొని ఆచరించునది. వీరికి గురు సన్నిధియే క్షేత్రనివాసము.

ఆది శంకరాచార్యులు యాత్ర గురించి యిలా చెప్పారు.

శ్లో॥ సంభావ్యతే క్వచ జలం క్వచ నాస్తి పాథః
శయ్యా స్థలం క్వచిదిహాస్తి నచ క్వచాస్తి ।
శయ్యా స్థలీ జల నిరీక్షణ సక్త చేతాః
పాంథోన శర్మ లభతే కలుషే కృతాత్మా ॥

యాత్ర చేయు మార్గమున కొన్నిచోట్ల జలము లభించును. కొన్నిచోట్ల లభించదు. పరుండటకు తగిన స్థలముండదు. ఒకా నోకచోట యుండును. శయన స్థలము, జలము, ఆహారమునకై నిరీక్షించుట యందు చిక్కుపడిన చిత్తము గల యాత్రికుడు హాయిని పొందలేడు.

అందువలన జ్ఞానము కలిగిన తర్వాత యాత్రలు చేయువలెను. దైవము అనుకూలించినపుడు అరణ్యమునకు బోయినను అన్నము లభించును. అట్లే దైవము ప్రతికూలించినపుడు ఎదుట ఉన్నది కూడా నశించిపోవును. దైవము వలననే సమస్తముకలుగును.

ప్రయాణములో సజ్జనసాంగత్యముండవలయును. వెళ్ళదలచిన ప్రదేశమునకు చేరి అందు మకాము చేయవలెను. అట్లుగాక, మార్గమధ్యమున మకాము చేసిన యెడల విఘాతము కలుగును. ఆకాశమున మేఘములు, ఉరుములు, మెరుపులతో ఎంత భయానకంగా వున్ననూ ప్రయాణమును వాయిదా వెయ్యరాదు. సమయము వచ్చినప్పుడు ఎక్కడ వున్ననూ కాలుడు విడువడు. ఫలానా వ్యక్తి ఆ దేశమునకు వెళ్ళుట చేత చచ్చెను. లేదా ఫలానా యాత్ర చేయుట వలన చచ్చెను అనియు, దానిని పాప, పుణ్యములుగా విభజించుచూ ఎవరి మనస్సునకు తోచిన విధంగా వారు మాట్లాడుదురు. కాని అది సరిగాదు. ముఖ్యంగా పూర్వజన్మ ప్రారబ్ధకర్మ ననుసరించియే జరుగును. యిల్లు విడిచి విదేశమునకేగి తీర్థములను దర్శించి సుఖముగా వచ్చుటయూ, ఇంటియందున్నవారు చచ్చుటలేదా ! యిది అంతయు ప్రారబ్ధమే కదా! అందువలన తీర్థములను దర్శించవలెనని అభిలాష యున్నవారి మనస్సు సంపూర్తిగా దైవముతో నిండియుండవలయును.

తీర్థయాత్రలు చేయునప్పుడు ముఖ్యంగా పరధన వస్తువులను స్వీకరించరాదు. అట్లు స్వీకరించుట వలన పుణ్యక్షయముగును. తమ ధనము మిగులవలెననే ఆలోచనేగాని, అమితమైన పుణ్యము పోవుననే విషయము యాత్రచేయువారుతలంపరు.

మార్గమధ్యమమున వేషభాషలచే మంచివారివలె కనబడుచూ నానావిధములైన గుణములతో తమ స్వభావములను కప్పిపుచ్చి తిరుగుచుందురు. వీరు దేవతా విగ్రహములు, వస్త్రములు, పుస్తకములు, ధనమును అపహరింపజూతురు. అందు వలన అపరిచితులను నమ్మరాదు.

మార్గమున గాని, మార్గమున ఆమడ దూరములోగాని పూజ్యులగు, భిక్షువులు, సన్యాసులు వున్నయెడల వారి సన్నిధికేగి పూజింపవలయును. వారి అనుమతిగైకొని ప్రయాణమును సాగించవలయును. వారి అనుమతి లేనిచో ఆరోజు ప్రయాణము ఆపవలయును.

పైన ఉదహరించిన తీర్థయాత్రలుచేయు విధానములు, తీసుకొనవలసిన జాగ్రత్తలు పూర్చి శ్రీ ఆది శంకరాచార్యులు పద్మపాదునితో తెలిపెను.

రాత్రి 9 గంటలకు అల్పాహారములను తీసుకొని, పానీయములు త్రాగి, నిద్రలోకి జారితిమి.

## బుద్ధి (Buddi) వైపునకు

ఈ రోజు ఆగష్టు 12వ తేదీ. ఉదయం 6 గంటలకు మా ప్రయాణము ఆరంభమైనది. నేటి ప్రయాణము బుద్ధి వరకు నిర్ణయించబడినది. ఈ క్యాంప్ దూరము 10 కి.మీ. యుండును.

'శంకర్' నినాదములతో ఈ రోజు ప్రయాణము ప్రారంభించబడినది. అందరికీ బి.పి. చూశారు. అందరికి నార్మల్‌గా వుండుట విశేషము. సుమారు 5 కి.మీ. ప్రయాణము కొండ

ఎక్కడము అయితే విటారుగా లేకపోవుట వలన కష్టము కొంత తగ్గినది. కొంత దూరము నడచిన కాళీగంగా ప్రత్యక్షమయినది. ఇంకొంత దూరము వెళ్లిన తర్వాత సుమారు 500 మీటర్ల ఎత్తునుండి జలపాతము కాళీగంగా నదిలో పడుచుండెను. ఈ జలపాత ధారలు మాపై పడుచూ చాలా అహ్లాదకరముగా వుండెను. ఇచ్చటనే అందరూ 10 నిమిషాలు ప్రకృతి సౌందర్యమునకు ఆశ్చర్యపడుచూ, విశ్రాంతి తీసుకొని మరలా ప్రయాణమును కొనసాగించితిమి.

ఈ ప్రదేశములో నిలబడవద్దని మాగైడు మరియు పోలీసులు చేసిన సూచన వృథా అయినది. చివరికి వారు కూడా మాతో ఈ జలపాతముల దృశ్యమును చాల సంతోషముగా వీక్షించుట బహు విశేషము. క్రిందటి దినము ఈ ప్రదేశములలో ఇద్దరు ప్రయాణీకులపై రాళ్ళుపడి చాలా పెద్ద గాయము, దెబ్బలు తగిలాయని, అదృష్టం వలన బ్రతికారని మా గుఱ్ఱపురౌతు శంకర్ సింగ్ చెప్పారు. మేము చూసిన ఈ జలపాతము పేరు 'బహెలిథా' (Bahelitha) జలపాతము తర్వాత లామారి (Lamari) అనే ఒక చిన్న గ్రామమును చేరాము.

ఇచ్చట కొంతసేపు విశ్రమించితిమి. ఇచ్చట టీ దుకాణములు కలవు. బిస్కట్లు మరియు టీ సేవించి ముందుకు సాగితిమి. సుమారు 1/2 కి.మీ. నడిచిన తర్వాత 'ధకీధా' అనే మరో జలపాతమును దాటాము. ఈ జలపాతము 65 మీటర్ల ఎత్తునుండి చాలా వేగముతో వుండెను. సుమారు 11 గంటలకు ఖోస్లా(Khoshla) అనే పర్వతము యొక్క శిఖరాగ్రమునకుచేరాము. వేడి నీటి కుంటలు(Hot Water Grounds) ఈ ప్రాతంములో చాలా యున్నాయి. ఈ మంచు ప్రదేశములో వేడినీటి కుంటలు మమ్మల్ని ఆశ్చర్య ఆనందములతో వింత అనుభూతిని కల్గించాయి. 1/2 కి.మీ. ప్రయాణము సాగగా, కాళీగంగానది కుడివైపునకు తిరిగినది. వాతావరణము చాలా ఆహ్లాదకరముగా వుండెను.

ఇచ్చట నుండి బుద్ధి(Buddi) కాంప్ కన్పించుచుండెను. అందరి మనస్సుకు హుషారు కలిగెను. చిన్న నదిని దాటితిమి. రెండు పర్వతముల మధ్యవున్న లోయను దాటి, కొయ్య చెక్కల వంతెనపై ప్రయాణము చేసి పాలాగడ్(Palagad) అనే చిన్న గ్రామమును దాటితిమి. ఇచ్చట నుండి బుద్ధి క్యాంప్ చేరాము. ఈ క్యాంప్ 10,625 అడుగుల ఎత్తున గలదు.

ఇచ్చట రస్నా సేవించి కొంతసేపు విశ్రాంతి తీసుకొంటిమి. మరలా అందరమూ, స్నానాది కార్యక్రమములుపూర్తి చేసికొని భోజనము చేసి విశ్రాంతి తీసికొంటిమి. సుమారు 3 గంటల ప్రాంతములలో అందరికీ టీ సప్లయి చేశారు. ఇచ్చట టీ చాలా బాగా చేశారు.

ఈ క్యాంప్ ఎంతో అందముగా వున్నది. ఇప్పటి వరకూ చూసిన క్యాంప్‌లలో ఇదే అందమైనదని చెప్పవచ్చును. చుట్టూ పర్వత/ పంక్తులు, మంచు శిఖరములతో రమణీయముగా ఆహ్లాదముగా కనిపించు చుండెను. ఈ క్యాంప్‌లో వున్న పూలచెట్లు విశేషము అని చెప్పవచ్చును. ఈ తోటలో కూర్చుని అన్నివైపులా పూర్తి దృశ్యములు చూచుచున్న ఎంత సమయము గడిపినసూ

నివి తీరదు. ఈ క్యాంప్‌లో 6 గదులు, బాత్ రూములు, కిచెన్ గలవు. డాక్టరునకు ప్రత్యేక గది మరియు అన్ని రకముల మందులు స్టాకు వుండుట ఈ క్యాంప్ ప్రత్యేకత.

ఈ క్యాంప్‌నకు ఒక కిలోమీటరు దూరము బుద్దిగడ్(Buddighad) గ్రామము యున్నది. 1970 సంవత్సరమునకు ఈ క్యాంప్‌కు దగ్గరలోనే గ్రామముండెడిది. సుమారు 19-70 సంవత్సరముల మధ్య ఈ గ్రామము భూస్థలనము జరిగి కొండ చరియలు విరిగిపడుట వలన విశేష జననాశనము గుఱ్ఱములు, పశువులను నష్టపోవుట జరిగినది. అందువలన ఈ గ్రామమును 1 కి.మీ. దూరములో నిర్మించుట జరిగినది.

లంగర్ దంపతులు శ్రీ మహా విష్ణువుని కూడా ధ్యానించు చుండిరి. శివకేశవులకు భేదము లేదు కదా! మాలోవున్న తోటి ప్రయాణీకుడు మనమందరము శ్రీకైలాసనాథుని దర్శనమునకు వెళ్తున్నాము అందువలన ఆ ఈశ్వర ప్రీతికై భజనలు, పూజాది కార్యక్రమములు సల్పవలెనుగాని, ఇతర దేవతలను విశేషించి ధ్యానించుట శ్రేష్ఠము గాదని వక్కాణించెను. చివరికి నేను, కుట్టిగారు కలుగజేసుకుని, శివకేశవులను బేధములేదుగాన దోషము లేదని సమాధాన పరచితిమి. ఇచ్చట భాగవతములోని ఒక పద్యము స్మరించుకుందాము.

శ్లో॥ కుంజాక్షనకు గాని కాయంబ
కాయమేపవన కుంభిత చర్మ భస్త్రికాక,
వైకుంఠు బొగడని వక్త్రంబు
వక్త్ర మేఢమఢమధ్వనితోడి ఢక్కగాక,
హరిపూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మిత దర్విగాక,
కమలేశు జూడని కన్నులు కన్నులే
తనుకుడ్య జాల రంధ్రములు గాక,
చక్రి చింతలేని జన్మంబు జన్మమే
తరళసలిలబుద్బుదంబు గాక
విష్ణు భక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగముతొడి పశువుగాక ॥

విష్ణువును సేవింపని దేహముగాలి పూరించిన తోలుతిత్తియన వలయునేగాని దేహమని పేర్కొనుట దగినదిగాదు. పరమేశ్వరుని స్తోత్రముచేయని నోటి నుండి వచ్చు శబ్దములు భేరీ మ్రోతలు వలన పుట్టు శబ్దముల వంటివి అగునేగాని యర్థవంతములగు పదములన దగవు.

భగవంతుని బూజింపని చేయి చెట్టు కొమ్మనతికి చేసిన తెడ్డు అగునేగాని సార్థకము చేయికాజాలదు. నారాయణుని దర్శనము కాని కన్నులు దేహమనే గోడకు బొడిచిన కిటికీలుగాని

నిజమగు కన్నులు కాజాలవు. వాసుదేవిని ధ్యానింపని పుట్టుక కొంత కాలము ఆడియాడి మాయమగు నీటి బుగ్గవలెనే నిరర్ధకమగును. పరతత్వము నందు అసక్తిలేని పండితుడునూ రెండు కాళ్ళ పశువే అగునుగాని నిశ్చయమైన పండితుడు అని చెప్పరాదు. రాత్రి భజన పూజాది కార్యక్రమములు పూర్తిచేసుకొని, సుమారు 8-30 ప్రాంతములో భోజనాది కార్యక్రమములు పూర్తిచేసుకొని 9-30 ప్రాంతములలో నిద్రలోకి జారితిమి.

## గుంజి వైపునకు

ఈ రోజు ఆగష్టు 13వ తేది. అన్ని కార్యక్రమములను యధావిధిగా పూర్తి చేసుకొని ఉదయం 5 గంటలకే ప్రయాణమైతిమి. రాత్రి వర్షము బాగా కురవటము వలన చలి అధికముగావుండెను.

ఒక కిలోమీటరు దూరములోవున్న 'బుద్దిగడ్' గ్రామమును దాటితిమి. దారి ఏ మాత్రము బాగుగాలేదు. ఈరోజు టిఫిన్(అల్పాహారము) తినుటకు సమయము లేనందున రెండు చపాతీలు, శనగగుళ్ళు, ఆలూకూర ప్యాకెట్‌చేసి యిచ్చారు. బోర్నవీటా మాత్రమే సేవించి బయలుదేరాము.

దారి అంతా తడితడిగాను, చలిగానుండెను. అప్పుడప్పుడు వర్షపుజల్లులు పడుతుండెను. కిత్రంరోజు వరకు వర్షపుబాధలేదు. ప్రతిసారి క్యాంపుకు చేరాక వర్షము వచ్చెడిది. ఈ రోజు అందుకు భిన్నముగా వున్నది. మెల్లమెల్లగా ఎక్కుచూ దిగుచూ ప్రయాణమును సాగించుచుంటిమి.

ఇప్పటివరకు ప్రయాణించిన 3 కి.మీ. ప్రయాణము చాలా కష్టతరముగావుండెను. మా బ్యాచ్‌లోనివారందరూ గుఱ్ఱముల ప్రయాణము చేయలేదు. ఈ 3 కి.మీ. ఎక్కుట, దిగుటలు చాలా వున్నందున గుఱ్ఱములపై ప్రయాణము శ్రేష్ఠముగాదు. మా బ్యాచ్‌లో యున్న ముసలివాళ్ళు చాలా కష్టపడవలసి వచ్చినది. ఇక్కడి నుండి 1కి.మీ. అందరమూ గుఱ్ఱములపై ప్రయాణము చేసితిమి. ఇచ్చట ప్రయాణమును కొంతసేపు ఆపి, అక్కడయున్న చిన్న టీ కొట్లో తేనీరు సేవించితిమి. ఈ ప్రదేశము పేరు "భయానకలేక్ టాప్" (Bhayanaka Lake Top). ఇచ్చట శ్రీ వ్యాసమహాముని దేవాలయమును దర్శించితిమి. ఈ దేవాలయము రహదారికి చాలా దూరములో వున్నందున దర్శనం చేయుటకు అందరూ సుముఖముగా లేరు. కాని వడివేలు దంపతులు మాత్రము నాకు తోడుగా వచ్చుట విశేషము.

ఇచ్చట నుండి రోడ్డు చాలా విశాలంగా వున్నది. రెండు ఫర్లాంగుల దూరము నడచిన తరువాత ఎడమ ప్రక్క విశాలమైన మిలటరీ క్యాంప్‌యున్నది. ఎటుచూసిన చిన్నచిన్న పొదలు, రంగురంగుల పూలు, దూరాన పెద్ద వృక్షములు, నదివెనుక కొండలు ప్రకృతి ఎంతో రమణీయముగా వున్నది. కాని వాతావరణమంతయూ మంచుతో యుండుటవలన ఫోటోలు తీయలేదు.

దారి చాలా బాగాయున్నది. 2 కి.మీ.లు నడిచినవెంటనే దారి జారుడుగాయున్నది.

ఈ రోజు ప్రయాణము చేసినది, సుమారు 20 కి.మీ. యుండును. గం॥ 12-15 ని॥లకు ప్రప్రథమముగా నలుగురు చేరారని, చివరన ఇద్దరు యాత్రికులు రెండు గంటలకు చేరారని పోలీసులు చెప్పారు. నేను మాత్రము మధ్యాహ్నము ఒంటిగంటకు గుంజి(Gunji) క్యాంపునకు చేరితిని. కాళ్ళు చేతులు శుభ్రము చేసుకొని, దుస్తులు మార్చుకొని 2 1/2 గంటలకు భోజనాది కార్యక్రమములు చేసి విశ్రమించాము.

సాయంత్రము 3 1/2 గంటలకు ఇండోటిబెటన్ బోర్డర్ పోలీస్(ITBP) డాక్టరు మమ్మల్ని పరీక్షలు చేసి మెడికల్ రిపోర్టులను పరిశీలించారు.

మా బ్యాచ్‌లోని వారందరూ ప్రయాణము చేయుటకు అంగీకారము తెల్పెను. చాలా సంతోషించాల్సిన విషయమేగదా!

ఉత్తర ప్రదేశ్ స్పెషల్ పోలీసులు, ఉమాయున్ మండల్ వికాస్ డాక్టరు కూడా ఈ 'గుంజి'లోనే క్షేమ తిరిగి వచ్చేంత వరకు యుంటారు. మన దేశములో చివరి గ్రామము ఇదే. అందువలన అందరూ వారి ఊర్లకు ఉత్తరములు వ్రాసిరి.

నాకు, లంగర్ మహాశయులకు (ఉజ్జయినీ నివాసి) దత్త పీఠముల గురించి,అవధూతల గురించి చర్చించుకొనుట జరిగినది.

శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ

అవధూతలు ఎప్పుడూ డాంబికమును ప్రదర్శించరు. నిరాడంబరమైన పద్ధతే వారి జీవనసరళి. శ్రీ అక్కల్‌కోట స్వామి వారిని దర్శించడానికి పండితుడు వేదాంతి అయిన శ్రీ విష్ణుబువా బ్రహ్మచారి వచ్చెను. శ్రీ స్వామి వారిని "బ్రహ్మతదాకారవృత్తి" అంటే ఏమిటీ? అని ప్రశ్నించెను. స్వామి వారు సమాధానమివ్వలేదు. అతను చాలా సమయం గడిపినప్పటికీ సమాధానము రాకుండుట వలన స్వామివారికి ఏమి తెలియదనే భావనకు వచ్చెను.

స్వామివారిని అందరిముందు హేళనగా మాట్లాడసాగెను. ఒకరోజు రాత్రి ఆ పండితునికి కలలో తేళ్ళు మీదకు వస్తున్నట్లుగా కనిపించాయి. అందులో వాటిని తప్పించుకొనే ప్రయత్నంలో ఒకతేలు కుట్టనే కుట్టింది. వెంటనే ఆ పండితుడు పెట్టిన కేకలు ఆ ప్రాంతమంతా మారుమ్రోగినది. కలలోని దృశ్యాన్ని మరువలేక వణికిపోతూ అందరికీ వివరించి చెప్పెను.

కొన్ని రోజుల తర్వాత శ్రీ అక్కల్‌కోట స్వామివారిని దర్శించుకొనుట జరిగినది. మరల తన పాండిత్యమును ప్రదర్శించదలచి "బ్రహ్మతదాకార వృత్తి" అంటే ఏమిటి మహాత్మా? అని ప్రశ్నించెను.

స్వామి కోపముతో బుద్ధిహీనుడా! తేళ్ళు కలలో కనిపించినంత మాత్రాన వణికిపోయి అందర్నీ హడలుగొట్టిన నీవా నన్ను ప్రశ్నించునది. గొంతెత్తి పాండిత్యమును ప్రదర్శించడం అనుకున్నవా "బ్రహ్మతదాకార వృత్తి" సులభమైన విద్యగాదు. పొమ్మని కేకలు వేసెను.

కొన్ని సంవత్సరములకు ఆ పండితునిలో అహంకారముతొలగి ఆత్మపరిశీలన
లిగినది. మరలా స్వామివారిని కలిసి పాదాభివందనము చేసెను. స్వామివారు "నిరాకార
రబ్రహ్మమయిన ఈ విశ్వంలో జరిగే ప్రతి పరిణామానికి స్పందించక, ఒకవిధమైన నిర్లిప్తతో
క బొమ్మగా లేదా సాక్షీభూతుడుగా యుండుటయే "బ్రహ్మతదాకార వృత్తి" అని సెలవిచ్చెను.
పండితునిలో అహంకార భయాలు పోగొట్టి, అతను అడుగకపోయినా అతని ప్రశ్నకు సరియైన
మయములో సందేహ నివృత్తి చేయుట ఈ "అవధూత స్వామి సమర్థ" యొక్క విచిత్ర
క్షణము. 1) వరసవాడీలో వున్న నరసింహ సరస్వతీ 2) అక్కల్ కోటలో వున్న స్వామి సమర్థ
) హుమ్నాబాద్‌లో వున్న మాణిక్య ప్రభు 4) షేగావ్‌లో వున్న గజానన మహరాజ్ 5) ఖాండ్వాలో
న్న ధునివాలా మహారాజ్ 6) నాగాపూర్‌లో వున్న తాజుద్దీన్ బాబా 7) గొలగమూడిలో వున్న
ంకయ్యస్వామి 8) షిర్డీలో వున్న సాయినాథ్ మొదలగు అవధూత పీఠములు ఎన్నెన్నో పవిత్రమైన
భారతదేశములో గలవు. వీరిని దర్శించకపోయినా, ఆ మహనీయులు నివసించిన పవిత్రమైన
లములను సందర్శించుట చాలా ఉత్తమము.

సాయంత్రము 7 గంటలకు పూజ, భజనాది కార్యక్రమములు జరిపితిమి. తదుపరి
ాత్రి భోజనములు చేసి కొంతసేపు రేపటి యాత్ర గురించి ముచ్చటించుకొని విశ్రమించితిమి.

## కాలాపానీ (Kalapani) వైపు

నేడు ఆగస్టు 14వ తేది. ఈ రోజు చలి అధికముగా వుండెను. రాత్రి వర్షము బాగుగా
డుట ఒక కారణము కాగా, చుట్టూ పర్వతములు, మధ్య విశాల మైదానము, ఈ మైదానముపై
ూక్యాంప్.

ఈ గుంజి సుమారు 10,625 అడుగులు ఎత్తునవున్నది. అల్పాహారము బోర్నవీటాను
ేవించి ప్రయాణమునకు 6 గంటలకే సిద్ధముగా వున్నాము. కాని, మిలటరీ వాళ్ళు అనుమతి
ువ్వనిదే అంగుళ మాత్రం కూడా కదలరాదు. ఈ మిలటరీ క్యాంప్‌లో వున్న మందిరమునకు
ెళ్ళి నమస్కారము చేసికొని అందరము గ్రూప్ ఫోటో తీసుకున్నాము.

ఉదయం గం॥ 7-30 ని॥లకు మిలటరీ సైనికులు వెంట బయలుదేరితిమి. ఇచ్చట
ుండి కాలాపానికి సుమారు 9కి.మీ. దూరము. 1 కి.మీ. ప్రయాణము చేయగా, అక్కడి నుండి
ొంత దూరములో వ్యాసమందిరము మరియు కాళీ మందిరములు గలవు. కాళీగంగా నది
ొడ్డునే ఈ రోజు ప్రయాణము పర్వత శ్రేణులపై పెద్ద పెద్ద వృక్షములు మార్గములో
ునోరంజకముగా వున్నాయి. నేటి ప్రయాణము కష్టముగా లేదు. కాని, ప్రతి 2 కి.మీ.లకు
ిలటరీ వాళ్ళు మజిలీలు చేయుచుండిరి. 25 మంది ప్రయాణీకులను పరిశీలించుకొనడము
ారి ఆరోగ్య విషయములు చెక్ చేసుకోవడము తర్వాత ప్రయాణమను సాగించుచుండిరి. 10,000

అడుగుల ఎత్తైన ప్రదేశమునుండి ఆక్సీజన్ లోపము ప్రారంభమగును. అందువలన మజిలీలుగ విశ్రాంతినిచ్చుట జరుగుచున్నదని మిలటరీ డాక్టరుగారు చెప్పారు. గుఱ్ఱములను బాడుగకు తీసుకున్నవాళ్ళు. గుఱ్ఱములపైనే రావలయునని సలహాలు ఇచ్చుచుండిరి. కాని పాటించే వాళ్ళు తక్కువ. ఈ రోజు మంచు పడనందువలన వాతావరణము ఆహ్లాదకరముగా వున్నదని మిలటరీ వాళ్ళు చెప్పుచుండిరి.

ఎత్తైన పర్వతములపై వెండి పూతవలె వుండే మంచు శిఖరములు, వృక్షములు, ప్రవాహ శబ్దములు, పక్షుల కిలకిలారావములతో ప్రకృతి ఎంతో ఆహ్లాదకరముగావున్నది. వీటి నడుమ మా ప్రయాణము సాగుచున్నది. అందరకూ ఈ ప్రాంతముల నుండి కదలలేని స్థితి కల్గుచున్నది. ఇంత మందికి ఉల్లాసము కల్గించిన ఈ ప్రాంతములో అందరమూ ఫోటోలు తీసుకున్నాము.

8 కి.మీలు ప్రయాణము చేసిన తర్వాత చిన్న చిన్న చెక్క వంతెనలు దాటితిమి. 1/2 కి.మీ దూరము వెళ్ళిన తర్వాత వేడినీటి ప్రవాహములు కన్పించాయి. నేడు 9 కి.మీ. ప్రయాణము చేసిననూ దారి బాగావున్నందున అలసటగాలేదు. ఉదయము 10-15 ని॥లకు క్యాంప్‌కుచేరాము. ఈ కాలాపానీ 11,880 అడుగులు ఎత్తులో ఉన్నది.

ఈ క్యాంప్ ముందువైపున, కాళీమాత దేవాలయమున్నది. ఈ ఆలయము వెనుకవైపు ఎత్తైయిన పర్వతము గలదు. ఆలయము ముందు భాగమున వెడల్పయిన కొలనువున్నది. వెనుక కొండలోనుండి ఆలయము క్రిందుగా, ఈ కొలనులోనికి నీరు ప్రవహించి, ప్రక్కనగల నదిలో కలియును. కాళీమాత ఆలయము నుండి వచ్చుటచే "కాళీగంగా" నది అని పిలుస్తారు. వ్యాసమందిరము మరియు కాళీ మందిరములు గలవు.

ఈ కాలాపానీ సముద్రమట్టానికి 3,570 మీటర్ల ఎత్తున ఉంది. ఇచ్చట 'కాళీమాత' ఆలయ ప్రాంతమే కాళీనది జన్మస్థానం. స్కంద పురాణములోని మానస ఖండములో ఈ కాళీగంగా నది పుట్టుక వ్రాసియున్నది. మహాకాలుడి ఆగ్రహంవల్ల నది నీరు కాస్త నల్లగా మారిపోవుటవలన ఆప్రాంతానికి కాలాపానీ అనే పేరు వచ్చినది.

దీని ప్రక్కనే ITBP వాళ్ళ క్యాంప్. దీనిని అనుకోని మాయాత్ర క్యాంప్ వుండెను. మధ్యాహ్నము భోజనాది కార్యక్రమములు తర్వాత విశ్రమించితిమి. సాయంత్రము 4 గం॥లకు తేనీరు, బిస్కట్లు సేవించితిమి. మా పాస్‌పోర్ట్సు(Pass Ports) అన్నియూ మా లీడర్ తీసుకొని, ఇమ్మిగ్రేషన్(Immigration) కస్టమ్స్ చెకప్‌లను(Custumes Checkeup) పూర్తి చేసుకున్నాము.

ఇచ్చట కాళికాదేవి ఎదురుగావున్న వంతెనవద్ద నారాయణశాస్త్రి సమాధి యున్నదని తెలిపారు. నేను, విజయేందర్, నారాయణకుట్టి, పదివేలు మేము నల్గురము వెళ్ళి దర్శనము చేసికొని, ఫోటోలను తీసుకున్నాము. 'నారాయణశాస్త్రి' బెంగుళూరు నివాసి. వీరు 7సార్లు మానస

ోవరము, కైలాసగిరి యాత్ర చేసారు. చివరిసారి ఆ యాత్రలోనే, మానససరోవరములో ర్గస్థులైరి. భారత ప్రభుత్వము చొరవతో వారి మృతదేహమును ఈ కాలాపానీ(Kalapani) ద్ద సమాధిచేసారు.

ఈరోజు రాత్రి 7 గం॥లకు కాళీమాత గుడిలో భజనలు ఏర్పాటు చేశారు. నాకు ర్మోనియం(Harmonium) అప్పచెప్పారు. రాత్రి 10 గంటల వరకు నామ సంకీర్తనలు జనలు జరిగాయి.

మిలటరీ సోదరులు, కుమామ్‌వారి ఉద్యోగులు, గుఱ్ఱముల వాళ్ళు ఎంతో చక్కగాపాడారు. గవంతుడు కేవలము భక్తిద్వారానే వెల్లడి అవుతాడు. భగవద్గీత, భాగవతము, పురాణాలు, రదభక్తి సూత్రములు, శాండిల్య సూత్రములు మొదలైన వాటిలో భక్తి యొక్క విశిష్ఠత కలదు. క్తిలేని పూజ, జపతపాలు అన్నీ చిలుకపలుకులే. భక్తిని గూర్చి మహనీయులు ఈ విధంగా లిపారు.

"భక్తిభావమే భగవంతుడు" - గురునానక్

"హరిభక్తి అంటేనే భగవంతుని ప్రేమ" - రామదాసు

"ఈశ్వరుని మీద కలిగే అమిత ప్రేమ" - నారదమహర్షి

"భక్తి ఆత్మను అవినాస్యము నుండి అవధులు లేని అనంతంలో కలిపేసాధన" - గురు ర్జునదేవ్

"ప్రాపంచిక ధ్యానాన్ని, ప్రాపంచిక ప్రేమను వదలి ఆత్మానుభవాన్ని పొంది భగవంతునిలో నమవడమే" - శాండిల్యుడు

"మోక్షానికి ఉపకరించే సాధనలన్నింటిలోకి భక్తి విశేషించి గొప్పది. తన స్వరూపాన్ని ను వెదుక్కోవడమే భక్తి" - శంకరాచార్యులు

"ప్రపంచమంతా మద్యపానం చేసి వళ్ళు తెలియకుండా తన్మయత్వంలో తూగుతూ ంటే, నేను భక్తి అనే మద్యాన్నిసేవించి రాత్రి పగలు అనే బేధం తెలియకుండా ఆ మత్తులో నందంలో ఉంటాను. - రాబాయి

"యోగులందరిలోనూ ఎవరున్నను తన హృదయములో భక్తి పూర్వకముగా నిలుపుకొని, ద్ధతో స్మరిస్తారో వారికేనేను ప్రథమ స్థానమిస్తాను, ఉత్తముడిగా భావిస్తాను."

- శ్రీ కృష్ణపరమాత్మ

క్తి భావము మనిషిలోనూ, జీవరాసుల్లో కూడా యుంటాయి. అసలు భక్తి భావములేని వాళ్ళను క్కడా చూడము. భక్తులు 5 రకములు. 1. ఒకర్ని చూసి నేర్చుకునే భక్తి : అందరూ వెల్తున్నారని ందరు మహానుభావుల సాంగత్యములోనికి పోవుట. వీరిలో భక్తి భావము కొంత సమయము

పడుతుంది. 2. ఆర్తులు : ప్రాపంచిక దుఃఖమువల్ల ఈశ్వరుని వేడుకొనుట. ఈ భక్తి స్థాయి మొదట కొంత తక్కువ స్థాయి. 3. జిజ్ఞాసువులు : యదార్థతత్వాన్ని తెలుసుకొనవలెననేది జిజ్ఞాసతో వుంటారు. 4. అర్థార్థీ : కోరికలు తీరినందువలన కృతజ్ఞత కలిగి భక్తిని, ప్రేమని శాశ్వతం చేసుకుంటారు. 5. జ్ఞానులు : వీరు పైన చెప్పిన ఏ వర్గానికి చెందరు. వీరు కర్మ, ధర్మ, జ్ఞానాలను క్షుణ్ణంగా తెలుసుకొని, శ్రద్ధతో ఆచరిస్తూ ప్రేమ పూర్వకంగా భక్తులవుతారు. భక్తితో అందరం అమ్మవారికి పూజలు చేసి, రాత్రి భోజనాది కార్యక్రమములు పూర్తి చేసికొని రాత్రి 11-00 గంటలకు నిద్రకుపక్రమించితిమి.

<u>నవిడాంగ్ వైపు :</u> ఈ రోజు ఆగస్టు 15వ తేది. మన దేశమునకు స్వాతంత్ర్యము వచ్చినరోజు. మేమందరమూ అన్ని కార్యక్రమములను పూర్తి చేసుకొని 6 గంటలకు ప్రయాణమునకు సిద్ధముగా వున్నాము. ఈ రోజు స్వాతంత్ర్య దినోత్సవము గనుక, జండా వందనము మరియు దేశభక్తి గీతములు బ్యాండులో పలికించుట విశేషము. మహాత్మాగాంధి, నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్‌లను మిలటరీ సోదరులు తలచుకొని, జేజేలు పల్కిరి. అందిరికీ స్వీట్లు పంచిపెట్టిరి. 8 1/2 గంటల సమయమునకు ఈ కార్యక్రమము ముగిసినది.

ఉదయము 9 గంటలకు మా ప్రయాణము ప్రారంభమైనది. ఉదయము 6గంటలకు సూర్యుని కిరణములు కొండ శిఖరములపై పడగా, ఒకవైపు చంద్రుడు అస్తమించుచున్న మనోహర దృశ్యాన్ని చాలా కష్టపడి కెమెరాలో బంధించాను.

రాత్రి భజనలో నా హార్మోనియమ్ వాద్య కౌశల్యమునకు మిలటరీ సోదరులు ఆనందించారు. ఉదయము నాతో రెండు గ్రూపులుగా, గ్రూప్ ఫోటోలు తీసుకున్నారు.

"భారత్‌మాతాకీ జై, శంకర్ భగవాన్‌కీ జై" అను నినాదములతో ప్రయాణము ప్రారంభమయ్యెను. విపరీతమైన చలియున్నది. చేతులు, కాళ్ళు వణుకుతున్నాయి.

నా పరిస్థితి చాలా బాధాకరముగా వున్నది. స్వెట్టర్లు మొ॥గు దుస్తులు లేకుండా ప్రయాణము సాగించుచున్నాను. నా ధైర్యమునకు మిలటరీ వాళ్ళు, తోటి ప్రయాణీకులు ఆశ్చర్యపోవుట వారి వంతైనది. ఇప్పటివరకు నేను ప్రశాంతముగానే యున్నాను. కాని, ఈ రోజు ప్రయాణములో మాత్రము చలికి కొంత భయపడటము జరిగినది. ఇక్కడే యిలా ఉంటే మానస, కైలాస ప్రాంతములలో నా పరిస్థితి ఏమిటి? "ఆ శంకరుడే నన్ను కాపాడాలి" అని సమాధాన పరచుకున్నాను.

ఒక కి.మీ. ముందుకు పోగా చెక్కవంతెన దాటితిమి. ఇక్కడ కొంచెము సూర్యకిరణముల ప్రభావము వలన అందరం 15 ని॥లు విశ్రమించితిమి. ఈ ప్రదేశములలో 'మంచు వర్షము'లు కురియును. నేడు వాతావరణము ప్రశాంతముగా యుండుట మా అదృష్టమనే చెప్పాలి.

అప్పుడప్పుడు గాలిహోరు, మరలా ప్రశాంతత నిర్మానుష్య ప్రదేశములు, ఎత్తైన

ఖరములుగల కొండలు, లోయలతో కొంత భయానకముగా యున్నప్పటికి దారి మాత్రము
లా విశాలముగా యుండుట విశేషము.

ఇంత వెడల్పాటి దారి చూసి అందరము ఆశ్చర్యపోయితిమి. 4 కి.మీ. (సుమారు) యాణము చేయగా, మమ్మల్ని అందర్ని సమావేశపరచి, అందరి క్షేమ సమాచారములు లుసుకొని, అందరికీ బిస్కట్లు, టీలను సరఫరా చేయుట జరిగినది. మిలటరీ సోదరులు చేసే హాయము మరువరానిది. మా లీడర్ ఈ దారి గురించి మిలటరీ వాళ్ళను విచారించారు. ఈ వమైన రోడ్డు 'నవిడాంగ్' (Navidang) క్యాంప్ వరకు వుండునని చెప్పారు. దీనిని 1958లో న రక్షణశాఖకు తెలియకుండా మిలటరీ ఆఫీసర్ రోడ్డు వేయించెనని, తర్వాత ప్రభుత్వము షయము తెలుసుకొని ఆఫీసరును జైలుకు పంపి రోడ్డు నిర్మాణమును ఆపు చేయించినట్లు లిపిరి.



15 నిమిషములు విశ్రాంతి నంతరము మరలా ప్రయాణము నసాగుచుండెను. దూరముగా పర్వతము లా అందముగా కన్పించుచుండెను. 11 1/ గం॥లకు 'నవిడాంగ్' క్యాంపునకు చెరితిమి. లాపానీ' నుండి 'నవి డాంగ్' వరకు 9 లోమీటర్లు దూరమున్నది. ఈ ప్రదేశము 3,800 అడుగుల ఎత్తున వున్నది. నవిడాంగ్‌కి ర్పు దిక్కున హిమశిఖరంపై "ఒం" అనే హ్నం చెక్కినట్లుగా కనబడుట విశేషము. ఈ విడాంగ్‌కి కుడివైపున ఉన్నలోయ ఈ విడాంగ్' ప్రదేశము భయంకరమైన లోయ. లటరీ వాళ్ళ క్యాంప్‌లు మాత్రమే యున్నవి. క్క చిన్న పురుగు కూడా ఇచ్చట కన్పించదు. పు చూసినా మంచుతో కప్పబడిన శిఖరములే. పి మాత్రము చాలా విపరీతముగా వున్నది. ఈ ప్రదేశముపై శత్రుసైన్యములు దాడి చేయుట లా కష్టతరమని సైనికులు చెప్పియున్నారు.

వీరిలో ఇద్దరు సైనికులు తెలుగువాళ్ళుండటము విశేషమనే చెప్పవలయును. వాళ్ళతో ట్లాడుట చాలా ఆనందమును కల్గించినది. అందరూ స్వెట్టర్లు ధరించి వణుకుతుంటే, నేను త్రము మామూలు బట్టలతో తిరుగుట చూసి సైనికులు మరియు డాక్టరు నాపై ఆగ్రహించారు.

ఇంతలో ఈ తెలుగు సైనికులు వారితో మాట్లాడి సర్దిచెప్పుట జరిగినది. సాయంత్రము 3 గం॥ల సమయంలో నా బ్యాగ్‌ను తీసుకొని ఏమేమి బట్టలున్నాయో పరిశీలించిరి. మామూలు బట్టలు, విండ్‌ప్రూఫ్ బట్టలు, గ్లౌజులు, కళ్ళజోళ్ళు, రెయిన్‌కోట్లు మాత్రమేయున్నవి. ఒక్క స్వెట్టరు కూడా లేదాయే. మిలటరీ డాక్టరైతే చాలా కోపముతో వుండెను. ఇచ్చట క్లాతింగ్ చాలా అవసరము. ఇచ్చట వచ్చే మంచువంటి చల్లనిగాలి శరీరములో ప్రవేశించుట వలన అనారోగ్యము కల్గునవి వారి భయము. నేను బదరీ, కేదార్, గంగోత్రి, యమునోత్రి, అమర్‌నాథ్, వైష్ణవీదేవి మొదలగు దేవాలయములను మామూలు బట్టలతోనే దర్శించాను. ఎలాంటి స్వెట్టర్లు వాడలేదు. ఆ ధైర్యముతో వాటిని ఖరీదు చేసియుండలేదు. కాని, ఈ రోజు వాతావరణము కొంత తేడా యున్నది. సైనికులు, గుల్మము వాళ్ళు కలిసి 2 స్వెట్టర్లు యిచ్చారు. కాని నేను వాటిని తిరస్కరించాను. చివరికి బ్రతిమలాడారు. బెదిరించారు. ఎవరెన్ని చెప్పినా నేను మాత్రము నా పట్టుదల వీడలేదు. చివరికి 'టిబెట్టులో' స్వెట్టర్లు ఖరీదుచేసి ధరించవలెననెడి వారి అభ్యర్థనను అంగీకరించక తప్పలేదు.

టీమ్‌లో వాళ్ళకి, మిలటరీ వాళ్ళకి చేయి చూసి జాతకము చెప్పుట. కాళీమాత గుడిలో హార్మోనియము వాయించడము వలన లభించిన గౌరముచేత ఎవరూ పరుషపదములు వాడలేదు.

మన దేశపు భద్రతకు ముప్పుకల్గుననే ఉద్దేశ్యముతో మేము తీసిన ఫోటో రీళ్ళను తీసుకొంటిరి. తిరిగి వచ్చేటప్పుడు ఎవరి రీళ్ళను వార్కి యిచ్చి వేయుదురు.

సాయంత్రం 6 గంటలకు భజన కార్యక్రమములు జరిగినవి. గం॥ 7-30 ని॥లకు భోజనాది కార్యక్రమములు పూర్తి చేసుకొంటిమి. శరీరమునకు ఆవాల నూనెను మరియు 'వాజ్‌లేను'ను పట్టించితిమి.

మన దేశములో ఇదే చివరి మజిలీ కావటము మరియు రేపటి తెల్లవారుఝామున 1 1/2 గంటలకు ప్రయాణము చేయవలసి యుండుటవలన అందరికీ నిద్ర కరువయ్యెను.

**ముక్తి :** ఈ రోజులో అందరూ 'ముక్తి' గురించి మాట్లాడుట అలవాటు అయినది. 'ముక్తి' అంటే ఏమిటి? ఈ ప్రశ్నకి జవాబు చాలామందికి తెలియదు. ముక్తియనగా 'విడుపు' అని అర్థము. బంధములనుండి విడుపునకే 'ముక్తి' అనిపేరు. ఈ "ముక్తి" రెండు విధములు : 1. జీవన్ముక్తి - స్వరూపలయము. 2. విదేహముక్తి - అరూపలయము

**జీవన్ముక్తి :** సుఖమునకు సంతోషింపడు. దుఃఖమునకు వ్యసనపడడు. మంచి సువాసనలను గ్రహించలేడు. రాగద్వేషాదులు, అహంకారములు లేనివాడును, ప్రత్యుపకారము గోరక పరులకు ఉపకారము చేయువాడును, ఇతరులను జూసి భయపడనివాడు, ఏకాగ్ర చిత్తముకలవాడును, నిత్య తృప్తి గలవాడును, మృదుమధుర సంభాషణలు గలవాడును, మనో సంకల్పము లేనివాడును,

న్య స్త్రీల యందు కోరిక లేనివాడును, శత్రువు మిత్రుడు సమానముగా కలవాడును, డుచుచున్నప్పుడు, కూర్చున్నప్పుడు, జాగృతావస్థ యందు, సుషుప్తియందు, స్వప్నమునందు, రుండునప్పుడు, నిద్రించునప్పుడు ఎవని చిత్తము విచారించకయుండునో అలాంటివానిని జీవన్ముక్తుడు" అని చెప్పవచ్చును.

దేహముక్తి : జనన మరణములు, శరీర ధర్మము పొందనివాడు, ఆది మధ్యాంతరహితమై నస్సును దేహము పొందనివాడును, స్థూల సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరంబులు లేనివాడును, న్నమయ, ప్రాణమయ, మనోమయ, పృధివ్యాపస్తేజోవాయురాకాశంబులనుడు పంచభూతములు నివాడును, అచంచల పరిపూర్ణుడు, సమస్తమందు అంతరమందు, బాహ్య మందు, నిబిడీకృతమై యుందు వాడును నిర్గుణ సాక్షత్కార పరబ్రహ్మ స్వరూపమే స్వరూపముగా కలవానిని "విదేహ ముక్తుడు" అని చెప్పవచ్చును.

పైన సూచించిన స్థాయికి చేరవలెనన్న ఏమిటి దారి?

జప హోమ, తపస్సులు మొదలగు వానివలన ముక్తి గలుగదు. వాయుభక్షణ చేసిన మాత్రాన ముక్తి గలిగిన ఎడల సర్పములకు ముక్తిగలుగవలెను కదా!

నీరు త్రాగి జీవించుట వలన ముక్తి గల్గిన యెడల గబ్బిలములకు ముక్తి గలుగవలెను దా!

ధ్యానము, మౌనము కలిగిన మాత్రమున ముక్తి గల్గిన యెడల చేపల కొఱకు కదలక లేక నిష్టగా ఏకాగ్ర చిత్తముతో కదలక యుండు కొంగకూ ముక్తి కలుగవలెనుకదా!

శాస్త్రములు చదువుట వలన ముక్తి గల్గిన యెడల చిలుకకూ ముక్తి కలుగవలెనుకదా! యు భక్షణము, పర్ణ భక్షణములు, జలాహారులకు మొ॥గు వారికి ముక్తిలేదు.

పరబ్రహ్మయందు లీనమైతేనేగాని ముక్తి లభించదు. అన్నము వలన ప్రాణులకు బముకల్గును. బలముచేత తపస్సు కల్గును. తపస్సు చేత ఆస్తిక్యబుద్ధి కల్గును. ఆస్తిక్యబుద్ధి లన వేదాంతశ్రవణము కల్గును. వేదాంత శ్రవణము వలన మననము కల్గును, మననము ద్వారా ధ్యాసకల్గును. ఈ ధ్యాస వలన భగవంతునియందు జ్ఞప్తి కల్గును. ఈ భగవంతుని యందు ప్తి వలన ఆత్మజ్ఞానము కల్గును. ఈ ఆత్మజ్ఞానము వలన ముక్తి కల్గును.

పైన సూచించిన మార్గముల ద్వారా ముక్తి కలుగవలెనన్న త్రికరణశుద్ధిగా గురుసేవ , గురవు యొక్క అనుగ్రహమును పొందుట తప్పనిసరి.

## లిపులేక్ పాస్ వైపునకు

ఈ రోజు ఆగస్టు 16వ తేది ఉదయము 2-30 గంటలకు మేలుకొంటిమి. ముఖ

ప్రక్షాళన కాలకృత్యములు పూర్తి చేసుకొంటిమి. ప్రత్యేక దుస్తులు ధరించితిమి. 3-30 గంటలకు టీ సేవించితిమి. 3 చపాతీలు అలుగడ్డ కూర, శనగ గుగ్గిళ్ళను ప్యాకెట్ చేసి ఇచ్చారు.

తెల్లవారుఝామున గం॥ 3-45 ని॥లకు మా ప్రయాణము మొదలయినది. చలి తీవ్రత చాలా అధికముగా వున్నది. అయితే ఈ రోజు ఈ ప్రాంతములో 'మంచు వర్షము' లేకపోవుట మా అదృష్టమనే చెప్పాలి.

దారి చాలా కష్టముగా వున్నది. దారిలో అక్కడక్కడ మంచు దిబ్బలున్నవి. అందువలన అందరమూ గుఱ్ఱములను ఆశ్రయించితిమి. గుఱ్ఱములపై ప్రయాణమువలన చలి యింకా అధికమయ్యెను. మిలటరీ అధికారులు చాలా జాగ్రత్తగా మమ్మల్ని కనిపెట్టుచూ ప్రయాణమునకు సహాయపడినారు.

మిలటరీ డాక్టరు అందిరికంటే ముందుగాను, ముందు నలుగురు, మధ్యలో నల్గురు, చివర నలుగురు మిలటరీ జవానులు, వాకీటాకీల ద్వారా ప్రయాణం సాగుచున్నది.

ఈ ప్రదేశములో చిన్న పొదకూడా కనిపించలేదు. అక్సిజన్ లోపం బాగా అనుభవమగుచున్నది. గాలి హోరుగా యున్నది. కొంతమంది చలికి తాళలేక బాధపడుచూ, శరీరం ఏమవుతుందో, ఏదైనా శరీరమునకు యిబ్బంది కలిగినయెడల ప్రయాణం ఆగిపోవుననే భయంతో ఏడ్చుట కూడా జరిగినది.

ఉదయము 7 గంటల 20 నిముషములకు లిపులేఖ్‌పాస్ చేరాము. ఈ రోజు ప్రయాణములో గాలిహోరు ఎక్కువ లేకపోవుట అదృష్టమనే చెప్పాలి. ఈ దారిలో గాలి హోరువలన మనుష్యులు ఎక్కడికో ఎగిరి పడిపోవుదురని, అంతేగాక దారి తప్పినయెడల మంచులో కూరుకొని పోవల్సిందేనని, అందువలన చాలా జాగ్రత్తగా ప్రయాణము జరిగినది. 7-30 నుండి 8-00 గంటలలోగా లిపులేఖ్ చేరాలి. యిది యిరు దేశముల ఒప్పందము.

ఈ 'లిపులేఖ్‌పాస్' 5 మీ. వెడల్పుగలిగిన 16,730 అడుగుల ఎత్తైన ప్రదేశము.

ఎనిమిదవ బ్యాచ్ వాళ్ళు పూర్తి చేసికొని వచ్చుట, పదియవ బ్యాచ్ వాళ్ళు(మేము) యాత్రకు వెళ్ళు దృశ్యం అద్భుతమైనది. నా మిత్రుదు రామాంజనేయులును కలుసుకోవడము ఒక మంచి అనుభూతి.

మమ్మల్ని మా సామాను అంతయు చైనా వాళ్ళకు అప్పచెప్పారు. ఒక మీటరు క్రిందకు దిగిన కొంత విశాలమైన ప్రదేశము కలదు. మన జవాన్లు, పోర్టర్లు ఎవ్వరు కూడా ఒక్క అంగుళమైనా క్రిందకు దిగలేదు. అది చైనీయుల భూభాగము. ఇది మన దేశ సరిహద్దు.

ఇచ్చట నుండి సుమారు 8 కి.మీ. గుఱ్ఱములపై ప్రయాణము చేయవలెను. మన దేశములోవలె ప్రతి గుఱ్ఱమునకు పోర్టర్లు లేరు. 5 లేక 6 గుఱ్ఱములకు కలిపి ఒక పోర్టరు యుండెను. పొరపాటున ఎవ్వరైనా గుఱ్ఱముపై నుండి పడినయెడల ఎగతాళి చేయుదురు. తర్వాత

హాయము చేసి గుఱ్ఱముపై ఎక్కించుదురు.

8 కి.మీ.లు గుఱ్ఱములపై ప్రయాణముచేసిన తర్వాత, 9 గంటలకు బస్సు దగ్గరకు చేరాము. మేము సరిగ్గా 10-30 గంటలకు తక్లా కోట్‌కు చేరాము. ఈ తక్లా కోట్ ప్రదేశము సముద్రపు మట్టమునకు 14,000 అడుగుల ఎత్తునయున్నది.

తక్లా కోట్ : 'గార్‌చూ' నదిపైన యున్న వంతెన దాటి 'తక్లా కోట్' ఊరిలోనికి ప్రవేశించితిమి. నది వెడల్పు ఎక్కువలేదుగాని లోతు మరియు ప్రవాహ వేగము అధికముగానుండెను. నదిని దాటిన తర్వాత పర్లాంగ్ దూరములో యున్న గెస్ట్‌హౌస్‌కు చేరితిమి.

ఇచ్చట జనాభా సుమారు 15,000 యుండును. యిందులో 6,000 మంది టిబెటీయులు, 5,000 మంది నేపాలీలు, 4,000 మంది చైనీయులు యున్నారు. దుకాణములు ఎక్కువ భాగము చైనావారి ఆధినములో వున్నవి. ఈ తక్లా కోట్ పరిసర ప్రాంతములలో గోధుమలు బార్లీ పండుతాయి.

మేము 10-30కి చేరాము కదా! వెంటనే పాస్‌పోర్టు. వీసాలు తీసుకున్నారు. మంచి కాఫీ ఇచ్చారు. లగేజి చెకింగ్ మొదలగు ఫార్మాలటీస్ అన్నియూ పూర్తి అయ్యేసరికి మధ్యాహ్నం 12-30 గంటలకు అయినది. 1 గంటకు రూం యిచ్చారు. ప్రతి రూములో 5గురు యాత్రికులకు వసతి యుండును. మంచాలు చాలా బాగావున్నాయి. రూము కూడా చాలా అందముగా ప్రశాంతముగా యున్నది. రెండు పెద్ద, పెద్ద ప్లాస్కుల నిండా వేడి నీరు వుంచారు.

స్నానాదులు ముగించి లంచ్ చేశాము. ఈ లంచ్‌లో స్వీట్లు, వేరుశనగకాయలు నిమ్మరేగుపండ్లు, కమలాలు, నారింజపండ్లు, ముల్లంగి మొదలగునవి యిచ్చారు. బటర్, జామ్ ప్రత్యేకంగా వున్నవి.

ఒక ఆకుతో తయారుచేసిన సూప్ చాలా ప్రత్యేకముగా వున్నది. అన్నం కావల్సిన వారికి తక్కువ మోతాదులో లభించును. ఇదీ ఇక్కడి శాఖాహారపు భోజనము. ఇక్కడి టైమ్ భారతదేశపు కాలమానమునకు వ్యత్యాసము 2 1/2 గంటల తేడా వున్నది. అందువల్ల గడియారములు సరిదిద్దుకున్నాము. ఈ గెస్ట్‌హౌస్ పేరు పురంగ్ గెస్టెహౌస్. ఈ భవనమునకు స్వంత జనరేటర్ ద్వారా రాత్రి 12 గంటలవరకు కరెంట్ ఏర్పాట్లు చేయబడి యుండెను. ఇచ్చట అన్నివసతులు బాగుగాయున్నవి. కాని ఒక్క విషయములో మాత్రము చాలా యిబ్బంది పడ్డాము. అదేమిటంటే, 'కామన్ లావట్రీస్'. రాత్రి మరలా డిన్నర్ పూర్తిచేసికొని విశ్రమించితిమి. ఈ విధంగా ఈ యాత్రలో 11 రోజులు పూర్తి అయినది.

ఈ భూలోకములో ఇంతటి మహిమాన్వితమైన ప్రదేశము మరెచ్చటాలేదు.

మానస సరోవరం కైలాసగిరి ప్రాంతము ఎంతో ప్రాముఖ్యము. విశేషతయూ కల సృష్టిలో 8 లోకములు ముఖ్యమైనవి.

1. **పాతాళలోకము (అధోలోకము)** : అధోభాగమున ప్రథమమైనది. బ్రహ్మాండమునకు క్రింద చివరి భాగము ఆదిశేషుని యేలుబడియై యుండును. ఇది ఆది విష్ణుఅవతారము. ఈ పాతాళమున బలీంద్ర, ముచికుంద పట్టణములు గలవు. ఇచట ప్రజలు ఆదినాగుని పూజాభ్యాస ఆరాధనలతో కడతేరి జన్మచాలించి పాతాళమునకుపైన గల రసాతలమున జన్మించెదరు.

2. **రసాతలము** : ఈ రసాతలము, పాతాళలోకమునకు లక్ష యోజనములపైన వున్నది. ఈ రసాతలమున భూమి పాషాణమయంగా నుండును. కాలనేయాదులు మొదలగు రాక్షసులుందురు. శతసిర, వాసుకి పట్టణములు ముఖ్యమైనవి. ఇచ్చటి వారందరూ ఈశ్వర భక్తులు. హిరణ్యాక్షుడు ఇచ్చటనే యుండును. ఈ లోకమున జన్మ చాలించిన పుణ్యప్రభావము వలన మహా తలమున జన్మింతురు.

3. **మహా తలము** : ఇచ్చట ఇసుక భూమి యుండును. మహా సర్పములుండును. తక్షక, కాళీయులు యిచ్చటివారే. ఇచ్చటి వారందరూ పరమేశ్వరుని భక్తులే. ఇచ్చట భక్తులు జన్మ చాలించి తలాతలమున జన్మింతురు.

4. **తలాతలము** : ఇచ్చట పసుపు రంగుగల భూమి యుండును. గజకర్ణ, కాలనేమి మందిరములు ఇచ్చట గలవు. వృకాసుర, తార్క్ష్యుని పట్టణములు గలవు. అందరూ విష్ణువుని ఆరాధించెదరు. ఇచ్చటి పుణ్యాత్ములు జన్మ చాలించిన పిమ్మట 'సుతలము'న జన్మింతురు.

5. **సుతలము** : ఇచ్చట భూమి నల్లగా వుండును. బలి చక్రవర్తి, ప్రహ్లాదుడు ఇచ్చట నివాసముగా వుందురు. బలి చక్రవర్తి రాబోవు మన్వంతరమున ఇంద్రుడగును. ఇచ్చట విష్ణువు ద్వారపాలకుడు. ఇచ్చటి వారందరూ విష్ణుభక్తులు. యిచటి పుణ్యాత్ములు తిరిగి 'వితలము'న జన్మింతురు.

6. **వితలము** : ఇచ్చట భూమి పాండు వర్ణముగా వుండును. బంగారము విరివిగా దొరకును. నలుగు, భంజనుడు, వికుంభుడు, మొదలగువారు యిచటనే నివసించెదరు. కంబళ, అశ్వతర పట్టణములు గలవు. ఇచటివారందరూ ఈశ్వరుని ధ్యానించెదరు. ఇచ్చటి పుణ్యాత్ములు తిరి 'అతలము'న జన్మింతురు.

7. **అతలము** : ఇచ్చట భూమి నల్లగా వుండును. ఇచ్చట బలాసురుడు (యముని కుమారుడు) షణ్మవతి అను భార్యతో కలిసి 96 విధాలుగా వినోద మార్గముగా క్రీడించి ఆనందించుట విశేషము. ఈతని యావలింతచేత అనేక స్త్రీలు జన్మించి, వీరు పాతాళమునయున్న పురుషులను సేవించి, 84 బంధనములతో రతి క్రీడలచేత ఆనందము పొందుదురు.

నాగరాజగు ధనంజయుని పట్టణము గలదు. ఇచటివారు ఈశ్వరుని ఆరాధించి, పుణ్యవశంబున కొద్దిమంది భూలోకమున జన్మింతురు.

8. **భూలోకము** : ఈ లోకమునకు జంబూ ద్వీపమని పేరు గలదు. యిందు భరతఖండం, ఇంద్ర ఖండం, చరు ఖండం, నాగ ఖండం, తామ్ర ఖండం, గబస్తి ఖండం, సౌమ్యఖండం,

గంధర్వ ఖండం, వారుణీ ఖండమని నవఖండములు గలవు. నీలాద్రి, కౌమాద్రి, శ్వేతాద్రి, మాల్యవంత, గంధమాధనము, వింధ్య పర్వతము, మేరు పర్వతములు గలవు. వీటియందు సురలు, కిన్నెరలు, యక్షులు, కింపురుషులు నివసించెదరు.

కనుక యిన్ని లోకములలో జన్మించి పుణ్యవశమున భూలోకమున జన్మించుట జరిగినది. ఈ భూలోకములో అత్యంత పుణ్య ప్రదేశమున అడుగిడుట సదా ఈశ్వరానుగ్రహమే కదా!

ఈ రోజు అగస్టు 17వ తేది ఉదయము 6 గంటలకు నిద్రలేచి కాలకృత్యములు తీర్చుకొంటిమి. ఇక్కడి టాయిలెట్స్(Toilets) మనవలె సెప్టిక్ టాయిలెట్స్(Septic Toilets) కాదు. ఓపెన్ పద్ధతి. అందువలన మొదటి రోజు అందరికి వాంతులు వచ్చే పరిస్థితి. కొంతమందికి తలనొప్పులు కూడా వచ్చాయి. 7-30 గంటలకు బ్రేక్‌ఫాస్ట్ (Break Fast) చేసాము.

కుమామ్ మండల్ వికాస్ నిగమ్ వారు ఇక్కడ ఇద్దరు మనుష్యులను నియమించారు. వారు ఈ 14 బ్యాచ్‌లు యాత్ర పూర్తి అయ్యేవరకు ఇక్కడే యుండి 14వ బ్యాచ్ వాళ్ళతో కలిసి భారత దేశమునకు తిరిగి వస్తారు. వీరిలో ఒకతని పేరు పాండే.

పాండేతో కలిసి షాపింగ్ కాంప్లెక్స్‌లు ఎక్కడ ఉన్నవో తెలుసుకొని ట్రెక్కింక్ సూట్సు(Tracking Suit) స్వెట్టర్లు, కొబ్బరికాయలు, టోపి, మానససరోవరపు నీళ్ళ కోసం ప్లాస్టిక్ డబ్బాలు, ఫోటోరీల్సు కొన్నాము. మా నాయకుడు అయిన అగర్వాల్ బ్యాంక్‌కి వెళ్ళి డాలర్స్ నుండి చైనీస్ కరెన్సీలోనికి మార్చి మాకందర్కి పంచెను.

1 యువాన్ దాదాపుగా 4 రూపాయిలకు సమానము. 500 డాలర్లు చైనా గవర్నమెంట్‌కి చెల్లించాము. 150 డాలర్లు చైనీస్ కరెన్సీ అయిన 'యువాన్' లోకి మార్చాము. భోజనాది కార్యక్రమములు పూర్తి చేసికొని కొంతసమయం విశ్రమించాము. కొందరు బాతాఖానీ వేయుచుండిరి. మరి కొంతమంది బట్టలుతికి ఆరవేయుచుండిరి.

సాయంకాలము 4 గంటల ప్రాంతములో గెస్ట్‌హౌస్‌లో వున్న కాన్ఫరెన్స్‌హాలుకు(Conferance) చేరాము. ఈ సమావేశములో యాత్రలో కలుగు కష్టనష్టముల గూర్చి, ఈ దేశములో వుండవలసిన జాగ్రత్తలు గూర్చి మాట్లాడుకొనుట జరిగినది.

మా బ్యాచ్‌లో యున్నది 25 మంది. వీరిని 2 బ్యాచ్‌లుగా విభజనచేస్తారు. 'గ్రూప్ - ఎ'(Group - A) వారు కైలాస పరిక్రమను 3 రోజుల్లో పూర్తి చేస్తారు. ఆ తర్వాత రోజున గ్రూప్‌లను ఎక్స్ఛేంజ్ చేస్తారు.

ఈ కైలాస, మానససరోవర పరిక్రమలో రూములు చాలా తక్కువగా యుంటాయి. అందువలన 2 గ్రూపులుగా విభజించారు.

**Group - A :** 1) అశోక్ వర్మ(Raenchi) 2) భావన్‌భాయి(Anand) 3) లక్ష్మీ దేవిసాబూ(Bombay) 4) బాబుబాయి(Anand) 5) ఎ.డి. కుమార్(Anand) 6) నందకుమార్ వామన్ 7,8) రేవతి నందకుమార్ దంపతులు(Bombay) 9) సతీష్ అప్తే 10,11) అంజలీ సతీష్ దంపతులు(Pune) 12) వైరల్ మజుందార్(Bombay) 13) సైగల్ విజయశ్రీ(Baroda) 14) అజిల్ బంజుకర్ 15,16) అఖిల దంపతులు(Nashik) 17) ఉదయ్ ప్రభాకర్ ఫాంశ్లే(Sangli)

**Group - B :** 1) అగర్వాల్(New Delhi) 2) నారాయణకుట్టి(Kerala) 3) విజయేందర్(Karnataka) 4,5) వడివేలు దంపతులు(Tamilnadu) 6) కోమిలాథాఫే(Alhabad) 7) సుధీర్ శర్మ(Punjab) 8) లలిత్‌కుమార్(Faridabad) 9,10) లంగర్ దంపతులు(Ujjaini) 11) రామలింగశాస్త్రి(Andhra Pradesh).

నేను Group - B లో చేరాను. అందువలన మొదట మానససరోవర పరిక్రమ చేయాలి.



ఈ గెస్ట్‌హౌస్‌లో వున్న షాపు(Shop)లో ఈ యాత్రలకు సంబంధిచిన వివరములు, చరిత్రలో వుండిన పుస్తకములను కొన్నాము.

ఈ రోజు రాత్రి అందరము శివుని పూజించి, భజనలు చేశాము. కుమామ్ నిగమ్ వ్యక్తులు మాకందర్కి Indian వంటకములు చాలా అద్భుతంగా చేశారు.

మానస, కైలాస గిరిప్రాంతములో గాలి ఉధృతం, మంచు పడుట కొన్ని మయములలో ఉండునని వాటి గూర్చి తీసుకొనవలసిన జాగ్రత్తలు మా గైడ్స్(Guides) వరించి చెప్పారు. మాగ్రూప్ గైడుపేరు టెంపా(Tempa).

ఇచ్చట సూర్యోదయము ఉదయం 5 గంటలకు, అస్తమయము 7-30 (రాత్రి) ంటలకు అవును. ఇక్కడ వాతావరణమును చూసిన నాకు ఆయనములు జ్ఞప్తికల్గుచున్నవి.

ఆయనములు రెండు. అవి 1. ఉత్తరాయణనము 2. దక్షిణాయనము.

త్తరాయణము : పుష్యమాసము మొదలు జ్యేష్ఠము వరకు ఆరుమాసములు, ఇది దేవతలకు గటి కాటము అందువలన స్వర్గద్వారములు తెరచి యుండును.

క్షిణాయనము : మిగిలిన ఆరుమాసములు ఇది దేవతలకు రాత్రికాలము స్వర్గద్వారము యూసియుండును.

ఉత్తరాయణము నందు మృతి చెందినవారు స్వర్గస్థులనియు, ఉక్షిణాయనమందు మృతి ెందినవారు స్వర్గస్థులు కాలేరని చెప్పుదురు. భూలోకము నాభిస్థానము, పైన భువర్లోక, సుర్లోక, ుహర్లోక జనలోక, తపోలోక సత్యలోకములుండును. దీనికే ఉత్తరాయణమని పేరు.

ఇక అధోలోకములలో అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళ ోకములుండును. అధోలోకములో పాతాళము చివరయుండుటవలన దక్షిణాయనమని పేరు చ్చెను. ఎవ్వని మనస్సు ఊర్ధ్వముఖాసనై కల్గియుందురో అట్టివానికి నిరంతర సుఖము కల్గును దియే స్వర్గస్థులగుట. ఎవ్వని మనస్సు అథోముఖమగునో, అట్టివానికి నిరంతర కష్టములు ల్గును అదియే యమలోకము.

సత్యలోకము, తపోలోకము, జనర్లోకము, మహర్లోకము, సువర్లోకము, భువర్లోకము, ామి, అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళలోకము మనుష ప్రమాణము జానల పొడవు, ముప్పది మూడు కోట్ల రోమంబులు, సమాన వ్యానదాన ప్రాణాపానంబులను ంచప్రాణంబులు.

అన్నమయ ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ, పంచకోశంబులు, ోత్ర త్వక్ చక్షుర్జిహ్వ ఘ్రాణములనెడి - 7 జ్ఞానేంద్రియములు. వాక్పాణి పాదపాయూపస్థలనెడి ర్మేంద్రియములు దశవాయువులు. 72,000 నాడులు, 10 రంధ్రములు, సప్త ధాతువులు, రిషడ్వర్గములు, నవద్వారములు గల్గిన ఈ మాయాస్వరూపమే మనుష్యజన్మ.

ఈ రోజు ఆగస్టు 18వ తేది. ఉదయం 3 గంటలకు లేచాము. 4 గంటలకు అందరమూ ల్పాహారం తీసుకున్నాము. సామానులన్నియూ లారీలో వేశారు. మేమందరమూ బస్సులో ఎక్కి ూర్చున్నాము. 5-30 గంటలకు బస్సు "జైజై కైలాష్‌నాథ్" అనే నినాదములతో బస్సు బయలు ేను. ఈ రోజు చలి తీవ్రత ఎక్కువగా వున్నది.

బస్సు కిటికీలు మూసి వేసినప్పటకీ చలి అధికంగా వున్నది. ఎటు చూసినా పర్వతములే. కొన్ని పర్వత శిఖరములపై మంచు యున్నది.

ప్రత్యేకముగా రోడ్డులేదు. అంతా తెల్లని రాళ్ళ ప్రదేశము. నదీ ప్రవాహము మధ్యలో నుండి కూడా బస్సు పోవుచున్నది. ఎక్కడా వంతెనలు లేవు. అత్యంత వేగముతో బస్సు ప్రయాణించుట వలన వెనుక కూర్చున్న వారి శరీరమునకు ఎలా దెబ్బలు తగులుతాయో, గాయములగునో తెలియకున్నది.

## రాక్షసతాల్



గం॥ 9-15 ని॥లకు రాక్షసతాల్‌కు చేరాము. ఈ సరోవరం సముద్రపు మట్టానికి 14,900 అడుగుల ఎత్తున గలదు. దీని చుట్టుకొలత షుమారు 79 మైళ్ళు. మనన సరోవరము విస్తీర్ణము 200 చదరపు మైళ్ళుకాగా రాక్షసతాళ్ విస్తీర్ణము 140 చదరపు మైళ్ళు ఈ సరస్సులో రెండు ద్వీపాలు ఉండుట విశేషము. అవి 1) లాఛాటో 2) తోప్సెర్మా. ఈ సరోవరాన్ని టిబెటన్లు 'లాజ్గాక్‌త్సో' అని అంటారు. మానస సరోవరమునకు పడమర రెండు నుండి ఆరు మైళ్ళ దూరంలో ఈ సరస్సు కలదు. దీనికే 'రావణ సరోవరం' లేదా 'రాక్షస సరోవరం' అని పేరు. రావణాసురుడు ఈ సరోవరంలోనే తపస్సు చేసి శివానుగ్రహమును పొంది ఆత్మలింగమును పొందెనని అందు వలన ఈ సరోవరమునకు 'రాక్షసతాళ్' అని పెరువచ్చినదని పురాణములు చెప్పుచున్నవి. ఈ సరోవరములోని నీటిని త్రాగిన అనేక రకములైన వ్యాధులు, విష జ్వరములు వచ్చి చనిపోవుట జరిగేడిది. కొన్ని సంవత్సరముల తరువాత మానస సరోవరము నుండి ఒక పాయ రాక్షసతాళ్ లోకి ప్రవహించుట జరిగినది. ఆ పాయ పేరు 'గంగాఛూ'. కైలాసగిరి నుండి ప్రవహించుచున్న నీరు, మానస సరోవరము నుండి ప్రవహించుచున్న నీరు ఈ 'గంగాఛూ' ద్వారా రాక్షసతాళ్‌లో ప్రవహించుట విశేషము. ఈ గంగాఛూలో వేడినీటి పాయలు కూడా కలవు. ఈ విధంగా ఈ సరోవరము లోనికి ప్రవహించుట వలన నీటికి పవిత్రత కలిగెను. మానస సరోవరపు జలాలు లేత నీలపు రంగులో వుండగా, రాక్షసతాళ్‌లో నీరు ముదురు నీలం రంగులో వుండును. స్వామి ప్రణవానంద ఈ రాక్షసతాళ్ చుట్టూ 1942వ సంవత్సరములో పరిక్రమణ చేశారు.

ఈ పరిక్రమ మానస సరోవరము పరిక్రమ కంటే చాలా కష్టదాయకమని తన పుస్తకములో వ్రాసెను. అంతేగాక మంచు కాలములో స్వామి ప్రణవానంద ఈ సరోవరము మధ్యగుండా ప్రయాణించి(మంచు కాలములో ఈ సరోవరము గడ్డకట్టును) రెండు ద్వీపములైన 'లాఛాటో', 'సెర్మా' లను దర్శించిన ఏకైక వ్యక్తిగా చెప్పుచుందురు. ఐదు పర్వతములు ఈ సరస్సులో మునిగివున్నవని చెప్పుచుందురు.

ఈ రాక్షసతాల్ వెనుక 'కైలాసగిరి' స్పష్టంగా కన్పించాయి. అందరికీ ఆ పరమేశ్వరుని వెండి కొండను చూసేసరికి చెప్పలేనంత ఆనందము కలిగినది. ఆ ప్రదేశము అంతా జయజయ నినాదములతో మార్మోగెను. సమీపములో యున్న మాంధాత హిమశిఖరము చూశాము. అందరము ఫోటోలు తీసుకుని బస్సు చెంతకు వచ్చాము.

మరలా రోడ్డులేని బస్సు ప్రయాణము కొనసాగినది. 10-55 గంటలకు జైదికి చేరాము. అచట క్యాంప్‌లో 9వ బ్యాచ్ వాళ్ళు కైలాస మానససరోవర పరిక్రమాలు ముగించుకొని తిరుగు ప్రయాణము కొరకు వేచియున్నారు. శ్రీరాజగోపాల్(కమీషనర్ ఆఫ్ పోలీస్, మద్రాసు) గారు ఈ గ్రూపునకు నాయకత్వం వహిస్తున్నారు. అతని ద్వారా కొన్ని వివరములు తెలుసుకున్నాము. సమీపములలోనున్న 'మానస సరోవర చెంతకు' వెళ్ళి స్వచ్ఛమైన నీటిని త్రాగి శిరస్సున జల్లుకుంటిమి. ఈ సరోవరము చిత్రవిచిత్రముగా వుండెను. ఇంతలో మరలా మా బస్సు ప్రయాణమునకు సిద్ధమగుటవలన, వెళ్ళక తప్పలేదు. ఈ మానస సరోవరపు ఒడ్డున కొంచెం దూరములో మా ప్రయాణము సాగినది.

ఈరోజు క్యాంప్ హోరేకు సుమారు 12 గంటలకు చేరాము.

హోరే క్యాంపు : మా గ్రూప్ (గ్రూప్-బి) 11 మందిని మరియు గైడును హోరేలోని క్యాంప్‌లోనికి వదలుట, గ్రూప్-ఎ లోని 14 మంది మరియు గైడ్‌ను తార్చేన్‌లో వదలివేస్తారు. అందువలన మమ్మల్ని ఇక్కడ నుంచి బస్సు వెళ్ళిపోయినది. అందరము రూమ్‌లో చేరాము. చుట్టూ కొండల నడుమ ఈ క్యాంప్ యున్నది. 2 లేదా 3 కి.మీ. దూరములో మానస సరోవరం కన్పిస్తున్నది. గాలి బాగా యున్నది. ఎండ తీవ్రత కూడా బాగా ఎక్కువగా యున్నది.

మధ్యాన్నం గం॥ 1-15 ని॥లకు లంచ్ పూర్తి చేశాము. కిరోసిన్ స్టవ్, ప్రెషర్ కుక్కర్, గిన్నెలను చైనా వాళ్ళు సరఫరా చేశారు. మేము ఆహార పదార్థములను ఢిల్లీలో కొనుగోలు చేశాము. అందువలన 'ఉప్మా'ను శ్రీ నారాయణ కుట్టిగారు చాలా బాగా తయారు చేయటవలన ఈరోజు లంచ్ ముగిసినది. ఈ బస్సు ప్రయాణము వలన చాలా మందికి దెబ్బలు తగిలాయి. అందరము మందులు వేసుకొని ఆయింట్ మెంట్‌లు వ్రాసుకొని విశ్రమించాము. బయట అప్పుడప్పుడు తీవ్రమైన గాలి, మ్రోతలు వినబడుతున్నాయి.

ప్రస్తుతము టిబెట్ చరిత్రను గూర్చి తెలుసు కుందాము. పూర్వము లలితాదిత్య అనురాజు

టిబెట్‌లను జయించి, బౌద్ధ మతమును స్థాపించెను. కాశ్మీరు దేశము నుండి పండితులు, చరిత్రకారులను పంపి బౌద్ధ మత వ్యాప్తికి ఎనలేని కృషి చేసెను. ఆ తర్వాత టిబెట్ చక్రవర్తి నేపాలును జయించి, బాంధవ్యమును పెంచుకొనెను.

టిబెట్ పండితులు నేపాలునకు వెళ్ళి బౌద్ధమత వ్యాప్తికి కృషి చేసిరి. టిబెట్‌లో బౌద్ధమతస్థులను "లామా" లందురు. ఈ బౌద్ధమతములలో రెండు విధములుగలవు.

1) 'షామాన్' నెలకొల్పిన 'బొంపా బౌద్ధమతము'

2) 'మిలరిపుదు' నెలకొల్పిన 'దుగ్పా బౌద్ధమతము'

**బొంపా బౌద్ధమతము :** వీరు ఎఱ్ఱని టోపీలు ధరిస్తారు. భూత, పిశాచ మాంత్రిక శక్తులను సంపాదించుటకు అనాగరిక క్రూర ఆచారములు కొన సాగిస్తారు. వీరు దీర్ఘ వ్యాధుల నివారణకు ఈ తంత్రశక్తి అనుసరించి ఉపాయములు చెప్పగలరు.

**దుగ్పా బౌద్ధమతము :** వీరికి అహింస ముఖ్యోద్దేశ్యము. ఈ లామాలు 'పసుపుపచ్చ' టోపీలు ధరిస్తారు. ఈ ఎఱ్ఱటోపీ బౌద్ధులకు, పసుపు పచ్చటోపీ బౌద్ధులకు ఎన్నో యుద్ధములు జరిగినని చరిత్ర చెబుతున్నది.

ఈ రెండింటి బేధములు తొలగించి ఏకాత్రాటిపై నడిపిన వ్యక్తి 'ఆచార్య అసితుడు'. నేటికిని ఈ అసితుడు సాక్షాత్ బుద్ధునిగా తలంచి పూజలు చేస్తారు. వీరు మానస సరోవర ప్రాంతమున తనువు చాలించిరి. అసితుని ప్రథమ శిష్యుడగు 'బోంటాన్‌వీ' ప్రథమ దలైలామా. మొదట దలైలామా 14వ శతాబ్ద కాలములో అవతరించెను. అప్పటి నుండి యిప్పటి వరకు 'దలైలామా' పీఠము కొనసాగుచున్నది. 'దలైలామా' అనగా యింద్రుడు అనే అర్థము కూడా కలదు.

14వ దలైలామా క్రీ.శ. 1935లో జన్మించి 1940 ఫిబ్రవరిలో 'లాసా' పట్టణములో రాజ్యాభిషిక్తుడయ్యెను. క్రీ.శ. 1962లో చైనీయుల దురాక్రమణ వలన ఈ 14వ దలైలామా టిబెట్ నుండి పారిపోయి మన భారతదేశములో ఆశ్రయం పొందియున్నారు. ఈ విధంగా టిబెట్ చైనా ఆధీనములో యున్నది.

బౌద్ధ మతములను "గోంపా" అని అంటారు. ఈ 'గోంపా'లలోనే దేవాలయములుంటాయి. లామాలు నిరంతరము బౌద్ధ మంత్రములను జపిస్తారు.

అవి : ఓం వజ్రపాణీ హుం
ఓం అహం
ఓం మణిపద్మే హుం
ఓం సర్వసిద్ధి ఫలహం శాక్యముని అవాహా
ఓం వప్రజ సత్యహుం హులు హులు రులు రులు హుంఫట్.

ుష్ట గ్రహ బాధలు తొలగుటకు పులి, డేగ, సింహము, సర్పముల చిత్రములను ఉంచెదరు.

చైనావారి దాడి యనంతరము ఈ మఠములు చలావరకు ధ్వంసము చేయబడినవి. ప్రస్తుతము కొన్ని నామ మాత్రముగా యున్నవి.

**ఇంకొక కథ :** క్రీ.శ. 1841వ సంవత్సరములో కాశ్మీర దేశ ప్రధాన సైనికాధికారి జనరల్ జరావల్ సింగ్ 'లడక్' ప్రాంతమును స్వాధీనమును చేసుకొనెను. టిబెట్ లామాలచేత ఆహ్వానము ందుకొని కైలాస ప్రాంతమునకు చేరెను. ఆరోజుల్లో కూడా కొంత భూభాగము చైనీయులచే ఆక్రమించబడి యుండెను.

కైలాస ప్రాంతములలో ఆక్రమిత ప్రాంతముపై జరావల్‌సింగ్ దండయాత్ర చేసెను. గ్రామములు, కోటలు, మఠములు, చిన్నా భిన్నము చేసి చీనా(చైనా) సైన్యమును మట్టు బెట్టెను. అదే విధముగా టిబెట్టు సైన్యమును కూడా మట్టుబెట్టి తక్లా కోట్‌కి చేరి లామాల చేత ప్రశంశలను పొందెను. ఆతారువాత తన భార్యను గ్రామములో వదలి కొద్ది సైన్యముతో తిరిగి వచ్చుచుండగా చీనీయులు అదనుజూసి దాడిచేసి చంపిరి. ఈతని ధైర్యసాహసములకు మెచ్చిన టిబెట్ దేశీయులు "తోమాలో" ఒక పెద్ద సమాధిని కట్టిరి. చైనీయుల దాడి ఫలితంగా టిబెట్‌లోని పురాతనమైన ఖ్యాతి చెందిన బౌద్ధ ఆరామములు, గోంపాలు నశించాయి. ప్రస్తుతము వాటి రాళ్ళు కుప్పలు కుప్పలుగా కన్పిస్తాయి. ఈ రాళ్ళపై అనేక మంత్రములు గలవు. "ఓం మణిపద్మే హుం" మంత్రము చెక్కిన రాళ్ళు ఎక్కువగా కన్పిస్తాయి. మనకు గాయాత్రి మంత్రము ఎంత గొప్పదో, వారికి ఈ మంత్రము అంత గొప్పది. "పద్మములో గల సృష్టికర్త" అని ఈ మంత్రార్థము. ఈ మంత్రమును టిబెట్ దేశములోని ఆడ, మగ మరియు పిల్లలు అందరూ ఎల్లవేళలా పఠించు చుందురు.

**గోంపా :** బౌద్ధులు ఈ గోంపాలోనే బుద్ధుడు ఇతర దేవతల విగ్రహములను ప్రతిష్ఠించి పూజించుచూ, మంత్రములను జపించుచుందురు. విద్యార్థులకు విద్యాభ్యాసము చేయుచుందురు. సకల శాస్త్రములను కూడా ఇచ్చట నేర్పుదురు. ఈ గోంపాలో పూజకు డ్రమ్ము, గంట, భేరి, పిల్లన గ్రోవి, మానవుని ఎముకతో తయారుచేసిన గొట్టమును ఉపయోగించెదరు. మాంసము, సత్తు, జిల్లి, వెన్న మున్నగు పదార్థములను నైవేద్యమునకు ఉపయోగించెదరు. టిబెట్‌లో ముఖ్యమైన గ్రంథములు రెండు. అవి. 1) కాంజూర్, 2) తాంజూర్

**కాంజూర్ :** బుద్ధుడు స్వయంగా చెప్పిన 108 సంపుటములు గల గ్రంథము. ఇది టిబెట్ భాషలో వున్నది.

**తాంజూర్ :** దీనిలో వ్యాకరణ, ఖగోళ, జ్యోతిష, తర్క మంత్ర తంత్ర శాస్త్రములు, దేవతా ఉపాసనా పద్ధతులకు సంబంధించిన అతి ముఖ్యమైన గ్రంథరాజము. ఈ గ్రంథము కూడా

టిబెట్ భాషలో వున్నది.

సంస్కృతమున టిబెట్‌నకు "కిన్నెర ఖండము", "కింపురష ఖండము", "స్వర్గ భూమి" అనెడి అర్ధములు గలవు. పూర్వము టిబెట్, బర్మా, సియాం, ఇండోచైనా, మలయా సుమిత్ర, జావా, బోర్నియా, ఆఫ్ఘనిస్థాన్, గాంధార మున్నగు ద్వీపములు కలసి భారతదేశముగా వుండెను. ఈ టిబెట్ భూభాగమంతయూ పర్వత పంక్తులతో, మంచు శిఖరములతో నిండి యుండెను. లోయలు, సరస్సులు, మైదానములు కూడా గలవు. కొన్నిచోట్ల ఉప్పు నీటి సరస్సులు గలవు. బ్రహ్మపుత్రా నది టిబెట్‌లో పుట్టి హిమాలయ పర్వ శ్రేణి గుండా భారతావనిలో ప్రవేశించెను. అస్సాం రాష్ట్రములో ప్రవహించు చుండెను.

<u>ప్రజా జీవనము :</u> చలిని భరించగల శరీర ధారుఢ్యము గలదు. కష్ట జీవులు. ఈ దేశములో కులములు లేవు. కుమ్మరి వారిని మాత్రం రెండవతరగతికి చెందిన పౌరులుగా జూచెదరు. వీరికి మాత్రము భోజనాది కార్యక్రమములలో సహపంక్తి లేదు. ఇచట ఆచార్యుని మొదలు, ఊడ్చు వారి వరకు ఒకే విధమైన ఆచారముండెను. ఇచట ఎక్కువ భాగము మట్టిగోడల యిండ్లు కన్పించును. కొన్ని మాత్రమే డాబా బిల్డింగులు కనిపించును. ఐదారు గృహములుండిన ఒక ఊరుగా పిలుచుకొందురు. పశువుల పెంపకము పైననే ఉన్ని పరిశ్రమలు వచ్చి ఆదాయము వలననే జీవనము సాగించు చుందురు. వ్యాపారమునకు అక్లాకోట్ ముఖ్యమైనది. ఇక్కడ భారత, నేపాల్ దేశస్థులు కూడా వ్యాపారము చేయుదురు. వీరికి ముఖ్యాహారము మాంసము, చేపలు, బార్లీ గింజలపొడి, పాలతో తయారుచేసిన పదార్థములు, గోధుమ రొట్టెలు ముఖ్యమైనవి. ప్రతిరోజు 40 నుండి 55 కప్పుల టీ సేవించుట ఈ టిబెటీయుల లక్షణము.

**వివాహములు :** వితంతు వివాహము సర్వసాధారణము. కుటుంబములో పెద్దవాడు పెళ్ళి చేసుకొనిన ఆస్త్రీయే అన్నదమ్ములందరికీ భార్య అగును. ఆడ లేక మగ వితంతువులు రాత్రిళ్ళు స్వేచ్ఛగా తిరుగవచ్చును. అలాంటి వారికి కలిగిన సంతానమునకు సంఘములో ఎలాంటి అమర్యాద ఉండదు. అన్ని హక్కులు కూడా వుండును. సంతానోత్పత్తికి భర్త వలన ఉపయోగములేని యెడల వేరెవరైనా పురుషునితో సంబంధము కలుపుకొని నలుగురు సంతానము వరకు పొందవచ్చును. ఆ తర్వాత కలిగిన సంతానమును అపవిత్రముగా భావించుదురు. ప్రస్తుతము టిబెట్‌లో ఈ ఆచారాలు కూడా కొంతవరకు సాగుచుండెను.

బౌద్ధమతము రాక మునుపు ఎన్నో దురాచారములు సాగినవి. అవి - చేతబడులు, పూనకాలు, భూతవైద్యం, దారి దోపిడీలు, నర బలులు, జంతు బలులు, విచ్చల విడిగా తిరుగుట మొదలగునవి. బౌద్ధమతము వ్యాప్తి అనంతరము ప్రజల జీవన శైలిలో మార్పు కలిగెను. ఆధ్యాత్మికచింతన, భగవత్ భక్తి అచంచలముగా అభివృద్ధి కలిగినది. నిరాడంబరత వైరాగ్య భావనలు



sanare

కలిగినవి. సన్యాసులు, పురోహితులు తలలను నున్నగా క్షౌరము చేయించుకొందరు. సన్యాసి మరణించిన దహనము చేయుట, మామూలు మనుష్యులు మరణించిన శరీరమును ముక్కలుగా కోసి పక్షులకు వేయుట చేయుదురు. చైనా వారి ఆధీనమున నుండుట వలన పైన చెప్పిన ఆచారవ్యవహారములు కుంటుబడుచున్నది.

సంస్కారవంతమైన జీవనధారయే వేదసారం. నేపాల్, టిబెట్ ప్రాంతములలో బౌద్ధమతం అనేక విధములుగా వ్యాపించి యున్నది.

కపిలవస్తు నగరం వదలిన మొదలు గౌతమునిగా మారుటలో ఎన్నో కథలు లేదా గాథలున్నాయి. గౌతముడు కపిలవస్తు నగరాన్ని వదలి ప్రథమంగా వైశాలీ నగరం చేరాడు. వైశాలీ నగరంలో కఠిన నియమాలతో శరీరాన్ని శుష్కింపచేసు కొనుట వలన ముక్తి లభించుననే పద్ధతిలో జ్ఞానులున్నారు. ప్రాయోపవేశం, ఘోరమైన తపస్సు, ఆత్మార్పణ ద్వారా ముక్తి లభించగలదని యుచటి వారి నమ్మకము. అచ్చట కొంత కాలము వారితో గడిపెను. తద్వారా శరీరం శుష్కించునేగాని మోక్షం లభించదని భావించెను. బ్రాహ్మణాచారముల వలన ఏమీ ముక్తిలభించదని భావించెను.

ఆతర్వాత మగధదేశపు రాజధాని 'రాజగృహ' అనే పట్టణము చేరెను. మగధరాజు బింబిసారుడును శిష్యునిగా స్వీకరించెను. పశుహింసలను దూరం చేసెను. ఆ తర్వాత గౌతమ బుద్ధునికి 'ఆలారకాలాముడు' అనుపేరుగల యోగితో పరిచయమేర్పడినది. ఆయన వద్ద యోగాభ్యాసం నేర్చుకొనెను. యోగం ద్వారా చిత్తవృత్తిని నిరోధించవచ్చని తలంచెను. ఉద్దాకరామ పుత్రుని ద్వారా తపస్సు చేయడం నేర్చుకొనెను. యోగం, తపస్సు - ఈ రెండూ బుద్ధునిలోకి చైతన్యాన్ని ప్రభావితం చేసింది. ఈ రెండే బౌద్ధమతంలో ధ్యానానికి నాంది అని చెప్పవచ్చు.

ఆ తర్వాత ఆరు సంవత్సరాలు ఉరువేల పర్వతప్రాంతాల్లో తపస్సు చేశాడు. దీని వలన శరీరం శుష్కించడమే జరుగుతుందని తలచెను. వాద ప్రతి వాదనల ద్వారా 'సత్యం' రాదని గ్రహించాడు నిరాహార దీక్షల వలన శరీరం పవిత్రంగాదని, ఆడంబరాలు, భోగాలు వదిలితే పవిత్రత కల్గుతుందని భావించాడు. వినయం, శీలం కరుణ, ప్రేమ, అనురాగం, సేవల వలన మనస్సు నిర్మలమవుతుందని గ్రహించాడు. అలాంటి నిర్మల మనస్సు సంపాదించుకొని, ఏకాంత నివాసం వల్ల హృదయం పరివర్తన చెందటం ప్రారంభమవుతున్నదనే సత్యాన్ని గ్రహించాడు.

గాఢ సమాధిలో 'సంబోధి'ని పొందటం వలన గౌతముడు బుద్ధుడయ్యెను. ఆ తదనంతరం బుద్ధ భగవానుదయ్యెను. ఈ సమాధిలో బుద్ధునికి 4 విషయములు గోచరించాయి. అవి 1) సర్వం దుఃఖం, 2) దుఃఖసముదాయం, 3) దుఃఖ నిరోధం, 4) దుఃఖ నిరోధమార్గం.

వీటిని సంపూర్తిగా ఐదుగురు శిష్యులకు వివరించాడు. వారు 1) సారిపుత్రుడు 2) మొగల్లానుడు 2) ఉపాలి, 4) కాశ్యపుడు, 5) ఆనందుడు. ఆనందుడు బుద్ధుని ప్రియాతి ప్రియ శిష్యుడు.

**మొదటి దశ :** రాగ ద్వేష మోహాదులున్నంతవరకు అనుకూల విషయాలను సాధించ ప్రయత్న జరుగుతుంది. నిరాశ, నిస్పృహలు కలిగేకొద్దీ పట్టుదల పెరుగుతుంది. దీని వలన ఆవేశ కలుగుతుంది. ఈ ఆవేశమే దుఃఖానికి దారితీస్తుంది.

**రెండవ దశ :** ఇక జీవితం సుఖమయంగా ఉన్నదను కొందాము. ఒక సుఖాన్ని అనుభవించాక దానిని మళ్ళీ మళ్ళీ కోరుకొనుట జరుగుతుంది. ఈ ప్రాపంచిక సుఖ వ్యామోహాలలో ప నిర్యాణ సుఖాన్ని మరచిపోవుట జరుగుతుంది.

**మూడవ దశ :** ప్రాపంచిక సుఖాలు నిజమైనవి కావనీ, అవి ఎప్పటికైనా క్షీణిస్తాయ తెలుసుకొని, పరమాత్మ సుఖమే శాశ్వతమని తలచుట జరుగును. దీనివల్ల ఆలోచనా పద్ధతిల మార్పు కలుగును. దుఃఖమంటే ఏమిటి? అశాంతి, వేదన, భయం, కలవరం, జిజ్ఞాస. వీటికి దూరంగా ఉండటమే నిర్వాణం. ఈ నిర్వాణమే శాశ్వతమైనదని బౌద్ధుల నమ్మకము.

బౌద్ధులు చెప్పిన సత్యాన్ని అందరూ గ్రహించారు. జీవితం అంతులేని దుఃఖముతో కూడుకొనియున్నది. దాన్నుంచి నివృత్తి మార్గమును బోధించారు. దానినే 'అష్టాంగమార్గం అంటారు.

sanare

## ఆర్య అష్టాంగమార్గములు :

1) మంచి దృష్టి 2) మంచిమాట 3) మంచి సంకల్పము 4) మంచిపని 5 మంచి ప్రయత్నము 6) మంచి జీవన విధానం 7) మంచి మనస్సు 8) మంచి నిష్ఠ

నీతి ధర్మాలను బౌద్ధమతం ఆదరించింది. ఏ పనినైనా మూడు దశలుగా గుర్తించారు అవి 1) సంకల్పం 2) క్రియ 3) క్రియ ద్వారా కలిగే ఫలితం. ఈ ఫలితం మూడ విధాలుగా ఉంటుంది 1) సుఖమునిచ్చేది 2) దుఃఖం కలిగించేది 3) మిశ్రమ ఫలితమ కలుగజేసేది. 'మధ్యమార్గం'గా జీవన విధానాన్ని గడుపమని బుద్ధుడు సూచించాడు. 'అ సర్వత్ర వర్జయేత్' అనే నానుడి బౌద్ధమతం ద్వారా వాడుకలోకి వచ్చింది. ఎలాంటి అ ధోరణులైనా, ప్రవర్తనైనా విసర్జించి, ప్రతి మానవుడు ప్రశాంత చిత్తంతో, మధ్యమంగ నడుచుకోవాలన్నది ఈ బౌద్ధ ధర్మంలో ప్రముఖంగా, నిర్దిష్టంగా చెప్పబడుచున్నది.

## ఆచార్య ఆర్యదేవుడు :

నాగార్జుని శిష్యులలో ముఖ్యుడు. ఒక రోజు ఆరామములో అశోకవృక్షం క్రింద

ర్జుని శిష్యులకు నాగార్జునుడు బోధనలను చేయుచున్నాడు. ఆసమయములో శిష్యార్థిగా వరో వచ్చారని చెప్పాడు ఒక శిష్యుడు. అప్పుడు నాగార్జునుడు ఒక గ్లాసునిండా నీరు నింపి చ్చిన అతనికి యివ్వమని పంపుతాడు. అప్పుడు ఆర్యదేవుడు చిన్న సూదిని నీళ్ళ గ్లాసులోకి శాడు. ఆ నీళ్ళ పాత్రని చూసి సంతోషించి ఆర్యదేవుని శిష్యునిగా స్వీకరించాడు. ఇందులోని ఆధ్యాత్మికమైన గూడార్థం ఏమనగా - నీళ్ళపాత్రను జ్ఞానంతో పోల్చగా, అజ్ఞానపు లోతులను చొచ్చుకొని పోగల మేధాశక్తి తనకున్నదని ఆర్యదేవుడు తెలుపుట జరిగినది.

నాగార్జునుడు వృద్ధాప్యంలో వున్నందున బౌద్ధ ధర్మాన్ని వ్యాప్తి చేయమని ఆర్యదేవునకు ఠమును ఇచ్చాడు. ఇతను **చతుశ్శకము** అనే గ్రంథాన్ని రచించాడు. హస్తతాక ప్రకరణం, ద్వాదశనికాయి శాస్త్రం అనే గ్రంథాలను కూడా వ్రాశాడు.

ఈ విధముగా బౌద్ధమతమును గూర్చి పరిశీలనతో చర్చించిన చాలా ఉద్గ్రంథమే అవుతుంది. ఏమతమైనా, ఏ ధర్మమైనా సామాజిక శ్రేయస్సుకొరకే కదా! ఉపనిషత్తులు భగవద్గీత, అద్వైత, ద్వైత, మాధ్వ, చార్వాక, జైన, బౌద్ధ, ఇస్లాం మొదలగునవి ఎన్ని మతముల గూర్చి ఆలోచించినా మానవ అభ్యుదయమునకే అన్న ఆలోచన ఉండాలి. ప్రతి ఒక్కరు భక్తి శ్రద్ధలతో దైవాన్ని పూజించాలి. ఈ దైవాన్ని పూజించేందుకు ఆరు పద్ధతులున్నాయి. అవి 1) మంత్రజపం, 2) మానసిక జపం, 3) సంకీర్తనా జపం, 4) గురుదేవుల పూజ, 5) భావ మందిరంలో ఏకాగ్రత, 6) ఏకభుక్తం

వీటిని పెంపొందించుతూ భక్తిమార్గాలను ఎన్నుకోవాలి. ఈ భక్తి మార్గలు 9 రకాలున్నాయి. అవి 1) శాంతభక్తి, 2) దాస్యభక్తి, 3) సఖ్యభక్తి, 4) వాత్సల్యభక్తి, 5) వందనభక్తి, 6) అర్చనాభక్తి, 7) సేవాభక్తి, 8) స్మరణ భక్తి, 9) ఏకాంతభక్తి

పైన సూచించిన నవవిధ భక్తుల నుండి భక్తి మార్గంలోకి ప్రవేశించాలి.

1) మార్జాల కిశోర న్యాయం, 2) మర్కట కిశోర న్యాయం, 3) కచ్ఛప కిశోర న్యాయం

ఈ భారతావనిలో గొప్ప భక్తులు అనేకులు గలరు. వ్యాస, శుక, నారద, తుంబుర, శాండిల్య, గర్గ, విష్ణువర్ధన, ప్రహ్లాద, భీష్మ, విదుర, సంజయ, కుచేల, బలిచక్రవర్తి, హనుమంత, విభీషణ, సుగ్రీవ పుణ్య పురుషులు కాగా శ్రీ కృష్ణ చైతన్యుడు, రవిదాసు, తుకారాం, పండరీబాయి, కబీరు, రామదాసు, తులసీదాసు, కనకదాసు, అందాళు, ఆళ్వార్‌లు గొప్ప భక్తి పరులు.

సరళమైన సాధుస్వభావం, సమభావంతో యుండుట, ఎవరినీ ద్వేషించకపోవుట, ఆశ్రిత రక్షణ, సత్యసంధత, వినయం, కరుణ, నమ్రత వంటి సద్గుణాలు ఎవరిలో ఉంటాయో వారే నిజమైన భక్తాగ్రేసరులు. కుల, మత సాంప్రదాయాలతో వీరికి సంబధంలేదు.

ఇప్పటికే మనము ఈ మతముల గూర్చి చర్చిస్తూ వాస్తవ ప్రయాణ మార్గమునకు



sanaye

దూరముగా వచ్చాము. ఇక యాత్రా విశేషాలతో మన మానససరోవర ప్రయాణాన్ని కొనసాగిద్దాము.

ఛిగు క్యాంపువైపు : ఈ రోజు తేది ఆగష్టు 19 ఉదయం 2 గం॥లకు లేచి కాలకృత్యముల పూర్తి చేసుకొని, టీ సేవించితిమి, యింతలో గుఱ్ఱములు వచ్చాయి. కొన్ని గుఱ్ఱాలపై సామానుల వేసిరి. ప్రతి ఒక్కరూ తప్పని సరి విధిగా గుఱ్ఱములు ఉపయోగించ వలసినదే. ఎందుకంటే మానససరోవరం చుట్టూ నదులుండుట వలన వాటిని దాటాలంటే నడుచుట చాలా కష్టమైన విషయము సుమారు 4 గం॥ల ప్రాంతములో ప్రయాణము ప్రారంభమైనది. చాలా బాగావున్నది అందరూ స్వెట్టర్లు, విండ్ ప్రూఫ్, జాకెట్లు, రెయిన్ కోటులు ధరించియున్నారు. టార్చ్‌లైట్ల సహాయముతో ప్రయాణము సాగుతున్నది. మేము నడుచు ప్రదేశమునకు మానస సరోవరం సుమారు 1/2 కి.మీ. దూరములో వున్నది. ఎటుచూసినా రాళ్ళ గుట్టలు, ఎత్తైన పర్వత పంక్తులు చిన్న చిన్న పిల్ల కాల్వలు మధ్య నడక సాగు చున్నది. 1 గంట ప్రయాణము చేసిన తర్వాత మానస సరోవర తీరానికి చేరాము. ఇంతలో గాలి తీవ్రమయింది. చలి కూడా చెలిరేగింది అందరమూ అట్లాగే నడక ప్రారంభించాము. మధ్యలో చిన్న కాలువలు వాటిపైన రెండు చెక్కలున్నాయి. ఆ చెక్కలపై చాలా జాగ్రత్తగా నడిచాము. ఈ విధంగా ప్రయాణము సాగుచున్నది దూరంగా సూర్య కిరణములు కన్పిస్తున్నాయి. మానస సరోవరములోని కొంత ప్రదేశము, సూర్య కిరణాలు ప్రసారమవుతున్నవి. సూర్యకాంతి ప్రతిఫలించి వింతవింత కాంతులతో, రంగుల మారుతూ కనులకు విందు చేస్తున్నవి.

sanare

ఇంతలో గోంపా కన్పించెను. అందరము ఆ గోంపాలోనికి వెళ్ళితిమి. అక్కడ స్వామిని దర్శించితిమి లోపల ఫోటోలు తీయరాదు.

అందరమూ అక్కడ టీ సేవించితిమి. వేడి వేడి నీళ్ళలో చేతులు ముఖము కడుక్కొంటిమి సుమారు 1 గంటసేపు విశ్రమించిన అనంతరము ప్రయాణము మరలా కొనసాగించితిమి.

గోంపాలు చాలా అద్భుతంగా యుండేవి. ఒకానొకప్పుడు ఈ మానస సరోవరం చుట్టూ అనేక గోంపాలుండేవి. గోంపాలనగా సత్రములని పేరు. ఈ గోంపాలోనే పవిత్ర దేవాలయము కూడా నిర్మితమై యుండును. చైనా వారి అధీనములోకి వచ్చిన తర్వాత ఈ గోంపాలను నేలమట్టము చేసిరి. నామమాత్రంగా 5 గోంపాలు మాత్రము గలవు. "ఓం మణిపద్మేహూం" అను మంత్రముతో గోంపాల శిధిలమైన రాళ్ళు కన్పిస్తున్నాయి.

సుమారు 2 గం॥లు నడక సాగించాము. చుట్టూ పొదరిండ్లూ ప్రక్కన సరోవరములతో ఎత్తైన విశాలమైన ప్రదేశముల మధ్య ప్రయాణము సాగు చున్నది. ఎండ తీవ్రత హెచ్చుగా వున్నది. సుమారు $45^0$ సి నుండి $50^0$ సి వరకు తీవ్రత యుండవచ్చును.

ఇంతలో రెండు నదులు దాటాము. ప్రవాహ వేగము ఎక్కువగాయున్నది. గుఱ్ఱములపైన కూర్చొని దాటాము. ఒక గుఱ్ఱము నదీ మధ్య భాగములో నిల్చొండిపోయేను. గుఱ్ఱముపైన వున్న ప్రయాణికుడు వణికిపోతూ "బచావో బచావో" అని నినాదము చేసెను. ఇంకో గుఱ్ఱముపై గుఱ్ఱమువాలా వెళ్ళి అదిలించి ఎట్లాగో ఒడ్డుకు తీసుకొని వచ్చెను.

## ఈ మానస సరోవరం పరిక్రమములో దాటవలసిన ముఖ్యమైన నదులు :

1. రిల్జింగ్ ఛూ (Relging Chu), 2. చర్‌చర్ గంగా (Chercher ganga), 3. డాగ్‌సోపో (Dagsopo), 4. నిమో పెండిచూ (Nimopendi Chu), 5. గమాఛూ (Gama Chu), 6. లాగొనర భూ (Longer Bhu), 7. చాందంగు భూ (Chandang Bhu), 8.పాలెన్ భూ (Palen Bhu), 9. కర్‌తార్‌భూ (Karthar Bhu).

మానస సరోవర తీరప్రాంతమున ప్రకృతి రమణీయకమును అందరమూ ఆశ్చర్యముతో, ఆనందముతో ప్రయాణము చేయు అనుభూతి నొందుచుంటిమి. ఎట్లయితేనేమి రాత్రి 7 గంటలకు చిగు (CHIGU) క్యాంప్‌కు చేరాము.



మానస సరోవరం, గుర్లా మాంధాత పర్వతము

ఇంకా సూర్యుడు పూర్తిగా అస్తమించలేదు. సూర్య కిరణముల కాంతి విచిత్రముగా వున్నది. ముందు మాంధాత పర్వతము, వెనుక మానస సరోవరము, నడుమ మా క్యాంప్ వున్నది. ఈ దృశ్యమును చూడవలసినదే ! దూరముగా చుట్టూ పచ్చిక బయళ్ళు, కొన్ని చోట్ల

{ఎ}రుపులవలె మెత్తగా వుండు చెట్ల సమూహములు గలవు.

ఈ క్యాంప్‌లో 4 గదులున్నవి. గదికి నలుగురు చొప్పున ఏర్పాటు చేసిరి. అందరమూ వేడినీళ్ళతో స్నానము చేసితిమి. మేగీ (Magi) ఉప్మాలు చేసిరి. నన్ను ఈ రోజు వంట చేయమనిరి. రాదని నిర్మొహమాటంగా చెప్పినందువలన అందరూ బాధపడిరి. అందరమూ నొప్పుల బాధకు మందులు తీసుకున్నాము. గైడ్‌లో పేర్కొన్న బడినట్లుగా ఉన్నదూరము 35 కి.మీ. కాని నదుల ప్రవాహము కొన్నిచోట్ల అధికముగా ఉండుటచేత ప్రయాణమంతయూ చుట్టూ తిరుగవలసి వచ్చినది. అందువలన 55 కి.మీ. నుండి 60 కి.మీ. ప్రయాణము చేయుట జరిగినది. అందరమూ అలసట తో వుండుట వలన ఆ పరమేశ్వరుని ధ్యానించి వెంటనే నిద్రకు ఉపక్రమించితిమి. ఈ రోజు రాత్రి మరపురానిది. మరవలేనిది. ఒక వింత అనుభూతి కలిగినది. ఇటువంటి విచిత్రమైన సంఘటనలు నా జీవితములో ఎన్నెన్నో జరిగినవి. ఈ సంఘటన ఎంతో ఉత్కృష్టమైనదని భావించవచ్చును.

ఆ రాత్రి ఒకానొక సమయములో మెలకువ కలిగినది. మూత్ర విసర్జన చేయవలసిన అవసరము కలిగినది. బయట చలి ఎక్కువగా ఉంటుంది. ఒక్కోసారి గాలి తీవ్రత ఎక్కువగా ఉంటుంది. అందువలన అన్ని రకములయిన దుస్తులు ధరించి బయటకు వెళ్ళాను. ఎక్కడా ఎలాంటి అలికిడిలేదు. చాలా నిశ్శబ్దముగా వున్నది. హిమాలయ ప్రాంతముల్లో ఇంత ప్రశాంతమైన వాతావరణముండుట కూడా ప్రమాదకరమే. ఎందుకంటే హఠాత్తుగా వచ్చే ఉపద్రవమునకు నాంది అని అంటారు. నేను మూత్ర విసర్జనగావించి వచ్చేటప్పుడు మానస సరోవరమువైపు చూశాను.

మానస సరోవరము మధ్య ప్రాంతము లో చిన్న కాంతి కన్పించెను. అది చాలా పెరిగి పెద్దదైనది. ఆ కాంతి మరలా సన్నటి వైరువలె సాగి ఆకాశములోనికి ప్రయాణించినది. అంతలో సరోవరపు మధ్య ప్రాంతములో వెన్నెలకాంతివలె తళుకు తళుకు మంటూ వింతగొల్పెను.

కొన్ని క్షణాలలోపుగానే విచిత్రమైన, భయంకరమైన అగ్నివలె మారెను. అంత కొంత సేపటికి గుండ్రముగా సుమారు 5 నుండి 6 అడుగుల ఎత్తులో వింత వింత రంగులతో కాంతులు కన్పించసాగెను. సరోవరములోని నీళ్ళు సముద్రములోని అలలవలె పెద్దవాయెను. ఆ దృశ్యము చూస్తున్నంతలోనే శరీరమంతయూ భయము, ఆశ్చర్యముతో ముచ్చెమటలు పోసెను. కలయా ! దైవ మాయయా !! అర్థముకాని స్థితిలో వున్నంతలోనే ఒక్క సారిగా భూమి, ఆకాశము ఏకమయినట్లుగా సుడిగాలి వీచినది. క్షణకాలములోనే నేను గాలిలోనికి లేవటము, దూరంగా విసరి వేయటము క్షణాల్లో జరిగినది.

సుమారు అర ఫర్లాంగు దూరంలోనున్న పూపొదల్లో పడుట జరిగింది. చిన్నగా పాకుతూ కూర్చొంటూ ఏదో విధంగా క్యాంప్‌లోకి చేరాను. ఫ్లాస్క్‌లోనున్న వేడినీళ్ళలో గ్లూకోజ్

sanare

కలుపుకుని త్రాగాను. గదిలోవున్న అద్దములో నుండి మానస సరోవరము కన్పిస్తున్నది. అందరూ గాఢ నిద్రలో వున్నారు. ఉడిపి నివాసి విజయేందర్‌కి మెలకువ వచ్చిలేచాడు. శాస్త్రీజీ! ఏమిటి కూర్చొని ఉన్నారు అని అడిగాడు. సరోవరం వైపు చూడమన్నాను. ఏముంటుంది అని అంటూనే తప్పనిసరై నా బెడ్ దగ్గరికి వచ్చి చూడసాగాడు. చిత్రంగా ఒక్కసారిగా ఆ దృశ్యము అదృశ్యమయినది. చివరలో కొంత మాత్రము చూడగలిగాడు.

ఈ దృశ్యమును గూర్చి మన బ్యాచ్‌లో ఎవరికీ చెప్పవద్దని చెప్పాడు. శివనామ స్మరణ చేసికొంటూ నిద్రకు ఉపక్రమించాము.

<u>జైదీ క్యాంపు వైపు :</u> ఈ రోజు తేది ఆగష్టు 20. ఉదయం 5 గంటలకు టీ సేవించి ప్రయాణమును ప్రారంభించాము. ఎడమవైపు మాంధాత పర్వతములు, కుడివైపు మానస సరోవరము దానిపైన కైలాస పర్వతము-క్షణక్షణమునకు మారు వాతావరణ పరిస్థితులు, ప్రయాణము చాలా ఆహ్లాదకరముగాను, చలిగానూ యున్నది. అరగంట సేపు ప్రయాణము చేసితిమి. ఒక చిన్న నది 'మానస'లో కలుస్తుంది. అందరం గుఱ్ఱములపై నదిని దాటి ప్రయాణమును కొనసాగించితిమి. చల్లటి వర్షపు చినుకులు, మంచు బిళ్ళలతో చల్లటిగాలి వీచుట వలన ప్రయాణము చేయుట బహు కష్టతరమని చెప్పవచ్చు.

ఎవరైనా ఆగుదామనుకుంటే ఎక్కడా ఆశ్రయము లేదాయె. అంతా నిర్మానుష్యమే కదా! ఒక గంటసేపు అట్లాగే ప్రయాణము చేసితిమి. వాన, గాలి తీవ్రత తగ్గినది. సూర్య కిరణముల ప్రభావము వలన వాతావరణము ఒక్కసారిగా మార్పు వచ్చినది. 20 నిముషములు ప్రయాణము చేసితిమి. విశాలమైన చదునైన ప్రదేశము ఉండుట వలన అందరూ కొంతసేపు విశ్రాంతి తిసుకొనుటకు నిశ్చయించికొంటిమి. అందరమూ అల్పాహారం (బిస్కెట్స్, స్వీట్స్, ఫ్రూట్స్) చేసి, మంచినీళ్ళు త్రాగితిమి. నేను మాత్రము టిబెటియన్స్ టీ సేవించితిని. నిన్న కొంత మంది ఈ టీని సేవించుట వలన కొంచెం నలతగునట్లు అనిపించుటవలన, ఎవ్వరూ త్రాగుటకు యిష్టపడలేదు. నాకు మాత్రము శరీరమునకు ఎంతో హాయిగా వుండుట వలన వాళ్ళు తయారుచేసిన 'టీ' ని సేవించితిని. అక్కడ వారు చెట్ల ఆకులతోనే టీ తయారు చేయుదురు.

గుఱ్ఱముల వారు వెంటనే ప్రయాణము చేయుటకు యిష్టపడనందున అందరమూ ప్రయాణమైతిమి. వడివేలు దంపతులు ఆనారోగ్య కారణముగానూ, గుఱ్ఱములపై ప్రయాణము చేయుటకు యిష్టపడుట వలన వారికి తోడుగా మరో యిద్దరు ముసలి వారిని ఒంటరిగా వదులుటకు యిష్టము లేక 'నన్ను' కూడా ఉండమని యెల్లో ఆఫీసర్ సెలవిచ్చెను. సుమారు 15 నిమిషములు వేచి చూశాము.

గుఱ్ఱముల వారు భార్యలతో సరససల్లాపములతోనూ, రొట్టెలు కొట్టుకొంటూ ఉన్నారేగాని ప్రయాణము చేసే ఉద్దేశ్యము కన్పించలేదు. గుఱ్ఱముల వారి తండా నాయకుడిని అడిగాను. మా గైడ్ (టెంపా) కూడా వారితోనే యున్నాడు. మమ్మల్ని వెళ్ళమని 15 నిముషాల్లో కలుసుకుంటామని సెలవెచ్చెను.

మేము నెమ్మదిగా కాలినడకన ప్రయాణము కొనసాగించితిమి. 1 గంట ప్రయాణానంతరము 15 ని॥లు విశ్రాంతి తిసుకొన్నాము. వెనుక గుఱ్ఱముల వారి జాడగాని, ముందువైపు మా బ్యాచ్ జాడగాని కన్పించ లేదు. దారి తప్పామా? అనే అనుమానము కలిగినది. యింకొక 15 ని॥లు ప్రయాణము చేసితిమి. 5 దార్లు కనిపించాయి. ఎటు వెళ్ళాలో అర్థముకాని స్థితి. నేను ఒక్కడినే అయితే ఏమయిపోయినా పరవాలేదుగాని ఈ నలుగురిని జాగ్రత్తగా చేర్చాలి కదా! ఈ ప్రాంతములలో దారి తప్పామా, యింతే సంగతులు అని ఆలోచించుకొని 10 ని॥లు విశ్రాంతి తీసుకొనుటకు నిశ్చయించుకొని వారికి విషయము వివరించితిమి. ఆ శివానుగ్రహముంటే బ్రతుకుదాము, నీకు ఏ దారివైపు ప్రయాణము చేయాలనుకుంటే అటువైపే వెళ్ళమని చెప్పారు వారు.

పదినిమిషములు విశ్రాంతి తీసుకొంటిమి. ఎటుచూసినా ఏముంది? నరసంచారమే లేదుగదా ! కొన్ని పక్షులు మాత్రమే కనిపిస్తున్నాయి. ఇంతలో ఆకాసములోని ప్రశాంతత కోల్పోయినది. దట్టమైన మేఘములతో, కారుచీకట్లు క్రమ్ముకొన్నవి. విపరీతమైన గాలి ఉండుటవలన నడుచుటకు కూడా కష్టముగా వున్నది. సన్నటి తుంపరలు ప్రారంభమయ్యాయి. నడక మాత్రము కొనసాగిస్తూనే యున్నాము. 10 ని॥లు ప్రయాణము అనంతరము చిన్న గుహ కన్పించినది. అందరము దానిలోనికి వెళ్ళి తలదాచుకొన్నాము. చిన్న తుంపరల తోపాటు వడగండ్లు కూడా తోడయ్యాయి. వాతావరణము చాలా భయానకంగా వున్నది. మేము అందరం చలికి తట్టుకొనే బట్టలు మరియు రెయిన్ కోటు ధరించడం వలన ఈ వాతావరణము తట్టుకున్నాము. సుమారు 40 ని॥ల అనంతరము వర్షము వెలసి ప్రశాంత వాతావరణముగా మారినది. సూర్యుడు చాలా తేజోమయంగా వుండెను. ఒక గంటలో యింత మార్పునకు శరీరతత్వము తట్టుకొనవలెను కదా ! వృద్ధులు అగుటవలన, కొంచెము నీరసంగా వుండుట వలన మెల్లమెల్లగా ప్రయాణము సాగిస్తున్నాము. అరగంట ప్రయాణానంతరము ఒక గోంపా వచ్చినది.

గోంపా అనగా సత్రము అని అర్థము. గోంపా అధికారికి సైగలతో అభ్యర్ధనచేసి అక్కడ కొంతసేపు విశ్రమించితిమి. ఆ ప్రదేశములో ఆహార పదార్థములు వండిన వాసన వచ్చుట వలన అందరికి ఆకలి గుర్తుకు వచ్చినది. తలా మూడు యాన్‌లు చెల్లించేవిధంగానూ, తలా ఒక చపాతీ టీ యిచ్చే విధంగానూ గోంపా అధికారి 'కబూ' తో మాట్లాడితిమి. ఒక గంటసేపు విశ్రాంతి తీసుకొని ప్రయాణము ప్రారంభించితిమి. 20 ని॥లు ప్రయాణము చేసిన

అనంతరము విశ్రాంతి తీసుకొనుచుంటిమి. యింతలో గుఱ్ఱముల వాళ్ళు వచ్చిరి. మా గైడు కూడా వాళ్ళతోనే వుండెను. అందర్నీ గుఱ్ఱములపై కూర్చోబెట్టిరి. నాకు నడుచుటే ఆనందముగా వుండుట వలన గుఱ్ఱము ఎక్కుటకు నిరాకరించితిని.

నా గుఱ్ఱము వాలా పేరు నిషా, అతని భార్య యిద్దరూ అమాంతము నన్ను ఎత్తుకొని గుఱ్ఱముపై వేసిరి. నేను పెట్టే కేకలను లెక్క చేయక నవ్వుచుండిరి. నాకు బాగుగా కోపము వచ్చినది. గుఱ్ఱమును దిగే ప్రయత్నములో యుండగా గుఱ్ఱమతిని భార్య 'రశి' నన్ను కదలనీయకుండా గట్టిగా పట్టుకొన్నది. నేను దిగను వదలివేయమని సైగలు చేసినా వదలలేదు సరికదా అందరూ పడిపడి నవ్వుచుండిరి. రశి కూడా గుఱ్ఱము ఎక్కి భర్తచేతిలో నున్న కళ్ళెమును తీసుకొన్నది. నా కాళ్ళు సరిగ్గా పొజిషన్‌లో ఉంచుకోమని కదలవద్దని సైగచేసినది. గుఱ్ఱమును అదిలించినది. అది దూకుడుగా పరుగెట్టుచున్నది. చాలా దూరము ఆ విధంగా ప్రయాణము చేసితిమి. వెనుక గుఱ్ఱముల వారు ఎవ్వరూ కనిపించలేదు. గుఱ్ఱమునూ అక్కడే వదలి సరోవరము లోనికి వెళ్ళి నీటిని త్రాగినది. లోపలికి వెళ్ళి వచ్చి కొన్ని విచిత్రమైన రాళ్ళను తీసుకొని నాకిచ్చినది. ఈ విధమైన రాళ్ళను యింతకు మునుపు నేనెప్పుడూ చూడలేదు.

ఇంతలో నిషా, అతని మొదటి భార్య ఒక గుఱ్ఱము పై వచ్చిరి. వారి వెనుకనే అందరూవచ్చి ఆగిరి. అందరూ ఇచట స్నానములు చేసిరి. అక్కడయున్న చెట్ల ఆకులతో టీ తయారు చేసిరి. నాకు అలవాటయినది కనుక నేను మాత్రమే ఆ టీని సేవించితిని.

20 నిమిషముల విశ్రాంతి అనంతరము మరలా ప్రయాణము ప్రారంభించాము ఎట్లయితేనేనమి సాయంత్రం 5-30 గంటలకు జైదీ క్యాంప్‌కు చేరాము. నేటితో మానస సరోవర పరిక్రమ పూర్తి అయినది. అందరం క్యాంప్‌లో టీ సేవించితిమి. 15 ని॥లు విశ్రాంతి తీసుకొంటిమి.

శరీరమునకు ఆవాల నూనె పట్టించితిమి. ఆవాల నూనె వలన చలి నెమ్ము శరీరములోనికి చేరదు. ఇచట నీరు చాలా చల్లగా యుండును. ఆ శంకరుని ధ్యానించుకొని స్నానము చేసితిమి. కొన్ని ఫోటోలే తీసుకొంటిమి.

అక్కడ మట్టితో శివలింగమునుచేసి, అభిషేకాది కార్యక్రమములు జరిపితిమి. మరలా మానస సరోవరములోనికి స్నానము చేయుటకు వెళ్ళితిమి. తమ అభిమానులు, బంధువులు, శ్రేయోభిలాషులు, పెద్దల పేర్లను చీటీలలో వ్రాసి సరోవరములో జారవిడువవలయును. అందరము అదేవిధంగా చేసితిమి. అందరినీ ఆ పరమశివుడు చల్లగా చూడాలని ధ్యానించి, నమస్కారములతో వెనుదిరిగి క్యాంపునకు చేరితిమి. ఈ జైదీ క్యాంప్ మానస సరోవరం ఒడ్డునే యుండి, సరోవర అందాలను చూచుటకు ఎంతో అనువుగా వున్నదనుటలో సందేహము లేదు గదా !

అందరమూ అల్పాహారము తీసుకొని, బోర్నవీటా త్రాగితిమి. సుమారు 8-0 గంటలకు (రాత్రి) ఎవరి గదుల్లో వారు విశ్రమించితిమి.

కాని గతరాత్రి జరిగిన సంఘటన మాత్రము మరువలేదు. ఉడిపి నివా విజయేందర్‌తో ఆ విషయమే అన్నాను. తాను చూసిన చిన్న దృశ్యమున అచ్చెరువొందియున్నాడు. నన్ను మెచ్చుకొనుచూ తన ఉద్దేశ్యమును వెల్లడించాడు.

ఈ రోజు రాత్రి 12 గంటల ప్రాంతములలో సరోవరం వద్దకు వెళదామన్నాడు నేను అంగీకరించాను అందరూ గాఢ నిద్రలో వున్నారు. రేపు ఉదయం కైలాసగిరికి ప్రయాణము అందువలన అందరూ చాలా త్వరగా విశ్రమించుటకు కూడా కారణము.

ఈ రోజు రాత్రి 12 గంటల ప్రాంతంలో సరోవరం వద్దకు వెళ్ళాము. గతరాత్రి కన్పించిన దృశ్యము ఈ రోజు మచ్చుకైనా ఒకటి కూడా కన్పించలేదు. నిరాశతో తిరిగి వెళ్ళి విశ్రమించాము.

ఈ రోజు ఆగష్టు 21వ తేది. శ్రావణ ఏకాదశి, సోమవారము కలసి రావటం ఈ రోజు ప్రత్యేకత. ఉదయం 4 గంటలకే లేచి కాలకృత్యములు తీర్చుకొని, స్నానము కొరకు ఆగవలసి వచ్చినది. ఈ రోజు వాతావరణము చాలా చలిగా వున్నది. సూర్యుని దర్శ భాగ్యము 8 గంటల వరకు లభ్యము కాలేదు. 9 గంటలకు స్నాన పూజాది కార్యక్రమముల మొదలు పెట్టితిమి. ఈ రోజు జైదీలో విశ్రాంతి దినము. ఈ రోజు ముఖ్య విధులు.

1) జపపూజాలు చేసుకొనుట

2) సరోవరములో రాళ్ళు సేకరించుట

3) ప్లాస్టిక్ బ్యాగులో సరోవరం నీళ్ళు సేకరించుట, వాటికి సీళ్ళు వేయుట, వాటిపై పేర్లు నెంబర్లు వ్రాయుట.

## మానస సరోవర విశేషములు

కైలాసగిరికి దక్షిణ దిశలో రెండు సరోవరములున్నవి. తూర్పుగా వున్నది 'బ్రహ్మ మానస సరోవరము'. పడమరగా వున్నది 'రాక్షసతాళ్'. ఈ బ్రహ్మమానస సరోవర చుట్టు కొలత 105 కి.మీ. దీని లోతు 315 అడుగులు, వైశాల్యం 150 చదరపు కి.మీ. సుమారు 17,000 అడుగుల నుండి 18,000 అడుగుల ఎత్తులో వున్నది. ప్రపంచంలో ఎత్తైన సువిశాలమైన సరస్సుగా ప్రఖ్యాతి గాంచిన వింతల్లో ఒకటిగా గుర్తించబడినది. ఈ మానస సరోవరములో తూర్పు తీరం 16 మైళ్ళు, దక్షిణ తీరం 10 మైళ్ళు. పశ్చిమ తీరం 30 మైళ్ళు ఉత్తర తీరం 15 మైళ్ళు పొడవు వుంటాయి. ప్రస్తుతము ఈ సరోవరము చుట్టూ ఐద

ోంపాలున్నాయి. ఆలయం, మఠం, ధర్మశాల కలిసి ఉన్న దానిని 'గోంపా' అని అంటారు. ఈ
ునస సరోవరము నుండి ప్రపంచంలోని నాలుగు ముఖ్య నదులు ఇక్కడ నుండే పుట్టుట గొప్ప
ిశేషము. 1. ఉత్తర దిశకు ప్రవహించే 'కుంగ్ లుంగ్' నదే సింధూ నదికి పుట్టిల్లు. 2.
గంగాఛూ' పశ్చిమ దిశగా 'సట్లెజ్' నది. 3. దక్షిణ దిశకు ప్రవహించే 'కర్నెలీ' నది గంగానదికి
ుట్టిల్లు. 4. తూర్పున ప్రవహించే 'త్సాత్సాంగ్‌పో' నది బ్రహ్మపుత్రా నదికి పుట్టిల్లు.

ురాణ గాథ : బ్రహ్మ మానస పుత్రులైన 12 మంది పరమశివుని అనుగ్రహం కోసం 12 ంవత్సరములు ఘోరమైన తపస్సుచేశారు. వారి తపస్సు అగ్నికి చుట్టు ప్రకలనున్న నీరంతయూ ిండిపోయినది. అప్పుడు వారి తపస్సుకు మెచ్చి పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమైరి. వారిని ూజించదానికి ఎక్కడా నీరు దొరకనందున బ్రహ్మను ధ్యానించిరి. బ్రహ్మ తన మనః సంకల్పముచేత రోవరం సృష్టించి తానే హంస రూపం దాల్చి సరోవరము లోనికి ప్రవేశించెనని, బ్రహ్మ పుత్రిక ానస హంస రూపం దాల్చి సరోవరం లోనికి ప్రవేశించెనని రెండు కథనములు కలవు. అప్పుడు రోవరం మధ్యలో ఒక పెద్ద బంగారు శివలింగం గొప్ప తేజస్సుతో ఉద్భవించినదని, ముక్కోటి ేవతలు, ఋషులందరూ ఆ శివలింగాన్ని అర్చించారని చెపుతారు. సంవత్సరములో ఏదైనా ఒక ాత్రిన ఆ శివలింగం సరోవరములో నుండి కాంతి పుంజములతో కనిపిస్తుందని ఒక సాధువు ్వారా నేను వినుట జరిగినది. బహుశా చిగు(Chigu) క్యాంపులో ఆ రాత్రి నాకు కనిపించినది ఆ శివలింగమేనా?!(2000 సంవత్సరములో ఒక సాధువుద్వారా నాకు కలిగిన అనుభూతికి మాధానము లభించెను). పూర్వకాలములో సరోవరము మధ్యలో నాగరాజు ఒక భవనమును


మానస సరోవరము

ఏర్పరచుకొని దానిలో నివాసముంటూ పరమేశ్వరుని గూర్చి తపమాచరించనని, ఆ సమయంలో సరోవరం మధ్యలో కల్ప వృక్షము ఉద్భవించినదని, ఆ వృక్షమునకు గల పండ్లను నాగరాజు మరియు పరివారము తినుచూ జీవనము గడిపిరని చెప్పుదురు. అంతేగాక ఆ వృక్షము నుండి రాలిన పండ్లు సరోవరంలో పడి 'జం జం జం' అనే శబ్ధము వచ్చెడిది. అందు వలనే జంబూ ద్వీపమని పేరు వచ్చినదని పురాణములు చెప్పుచున్నవి.

మానస సరోవరము ప్రాంతములో 'చిగు గోంపా' పురాణ ప్రసిద్ధమైనది. ఈ చిగు గోంపాకు దక్షిణముగా త్రవ్వకాలు జరుపగా బంగారం బయట పడినది. త్రవ్వేవారి అందరికి మశూచి, కుష్ఠు, క్షయ మొదలగు భయంకరమైన వ్యాధులు వచ్చినందున త్రవ్వకాలు నిలిపివేసిరి. ఈ సరోవరపు వద్దునగల ఒక పర్వతముపై 'మాంధాత మహారాజు' తపస్సు చేసి శివ దర్శనము పొందినందు వలన ఈ పర్వతమునకు 'మాంధాత పర్వతము'గా పిలువబడుచున్నది. సతి యొక్క కుడిపాదం ఈ సరోవరంలో పడినందువలన ఈ మనస సరోవరము శక్తి పీఠమని చెప్పుచుందురు. ఈ శక్తి పీఠము పేరు 'మానస'. శక్తిపేరు 'దాక్షాయణి'. భైరవునిపేరు 'హరుడు'.

బ్రహ్మ తన మానసము నుండి సృష్టించిన అతి పెద్ద సరోవరమనియూ; ఈ సరోవరములో దేవతలు స్నానమాచరించుదురనియూ, రాజ హంసలు దీని మధ్యగల వృక్ష ఫలములను ఆరగించుచూ పాడుచూ, ముత్యములను ఆరగించేవని పురాణములలో వర్ణించారు. కాని ప్రస్తుతము అలాంటివి ఏమీ దర్శనం కాలేదు.

టిబెట్టు దేశీయులు ముఖ్యముగా శీతాకాలము ప్రథమార్థములోగాని, వసంత ఋతువులోగాని ఈ యాత్ర చేయుదురు. వేసవి కాలములో మంచు కరిగి నదులు పొంగుట వలన, వర్షాకాలములో అధిక వర్షముల వలన ఈ యాత్రను చేయజాలరు. ఈ సరోవరములో ఉన్న చేపలకు 'ఔషధ' గుణములున్నాయి. ఇచ్చట చేపలవేట నిషిద్ధము. ఉధృతముగా వచ్చే అటి కెరటాలకు ఒక్కోసారి కొన్ని చేపలు చచ్చిపోతాయి. వాటిని శుభ్రపరచి ఎండబెడతారు. అనేక రోగాలకు వీటిని వాడుతారు. ముఖ్యంగా గర్భిణులకు కాన్పు రాక బాధ పడుచున్న యెడల ఈ చేపలతో పులుసు చేసి ఇచ్చిన గంటలోపే నొప్పులు వచ్చి సుఖ ప్రసవం అవును. అంతే గాక ఈ సరోవరము చుట్టూ ఉన్న ఇసుకలో, రాళ్ళలో కూడా ఓషధి మొక్కలు విరివిగా ఉంటాయని, 'ఓం' మొదలగు మంత్రాక్షరములు చెక్కినట్లుగా ఉండే చిన్న చిన్న మహిమగల రాళ్ళు ఈ సరోవరంలోను, తీరం వెంట లభ్యమవుతాయి. యాత్రానంతరం ఈ రాళ్ళను బంధు మిత్రులకు బహుమతిగా ఇచ్చెదరు. వీటిని సాక్షాత్ ఈశ్వరునిగా భావించి పూజించవచ్చును. మానస సరోవర జలమును సేవించినయడల నూరు సంవత్సరముల పాపములన్నియు తొలగిపోవును. దర్శించి స్నానమాచరించిన యడల జన్మరాహిత్యము కలుగుట నిస్సంశయము.

<u>మణి పద్మేహుం :</u> అన్నిచోట్ల ఈ మంత్రాన్ని చెక్కటం టిబెట్లకు అలవాటు. ఈ మంత్రాన్ని చిన్న చిన్న కాగితాలమీద వ్రాసి వాటిని ఒక స్థూపాకారపు చక్రంలో వేస్తారు. వెండితోగాని, రాగితోగాని, ఇత్తడితోగాని రూపొందించే స్థూపాకారపు చక్రాన్ని పట్టుకోవడానికి ఒక పిడికూడా ఉంటుంది. ఈ ప్రార్థనా చక్రాన్ని సవ్య దిశలో త్రిప్పుతారు. ఒక్కసారి తిప్పితే కాగితాల్లో ఎన్నిసార్లు ఈ మంత్రం వ్రాసివుంటే అన్ని సార్లు జపం చేసిన ఫలం లభిస్తుందని ఇచ్చట భక్తుల విశ్వాసము.

టిబెట్టు భాషలో ఈ మానస సరోవరమును సోమవంగ్ (Soma Vang) అందురు ఈ మానస ప్రాంతములోనే 'ఏసుక్రీస్తు'కు జ్ఞానోదయము కలిగినట్లు గైడు టెంపా (Tempa) చెప్పాడు.

పలువురు బౌద్ధ లామాలు, టిబెట్టు దేశస్థులు ఈ సరోవరమున మరణించుట వలన మోక్షము లభించునని విశ్వసింతురు. కొందరు టిబెట్టు దేశస్థులు సాష్టాంగ ప్రణామములు చేయుచూ 28 రోజులలో ఒక పరిక్రమను పూర్తి చేస్తారు.

## (Tarchen) టార్చెన్‌కి ప్రయాణం

ఈ రోజు తేది ఆగష్టు 22 : సుమారు 4 గంటలకు ట్రక్ వచ్చినది. మాసామానంతా ట్రక్‌లోకి చేర్చబడినది. మేమంతా ట్రక్ ఎక్కాము. 6 గంటలకు ట్రక్ బయలు దేరి 8-30 గంటలకు టార్చెన్ చేరినది.

మా బ్యాచ్‌లోని 'ఏ' గ్రూప్‌లోని 14 మంది మా కొరకై నిరీక్షిస్తున్నారు 3 రోజుల తర్వాత కలుసుకోవడం చాలా సంతోషమును కలిగించినది. కాని, మంచు బాగా ఎక్కువగా ఉండుటవలన 'ఏ' గ్రూపులోని వారు కైలాస్ పరిక్రమ చేయలేకపోవుట బాధాకరమైనది.

ఈ ప్రాంతములో ఒక్కోరోజు చాలా ప్రశాంతముగా, ఒక్కోరోజు చాలా భయానకంగా, నడువ వీలులేనట్లుగా వుండును.

మా గ్రూప్ (బి-గ్రూప్) కు 'బెస్టాఫ్ లక్' చెప్పి ఆ ట్రక్‌లోనే మానస సరోవరమునకు 'ఏ' గ్రూప్ వారు వెళ్ళారు.

మేము వంట పూర్తి చేసుకొని భోజనము పూర్తిచేశాము. అందరూ రాత్రి విశ్రాంతి తీసుకొనుచున్నారు. నేను మాత్రము అక్కడ దగ్గరలోవున్న గుహలలోనికి వెళ్ళి వచ్చాను. ఇద్దరు సాధువులతో పరిచయాలు ఏర్పడ్డాయి. వారి ద్వారా కొన్ని విషయములు తెలుసుకొన్నాను. డబ్బు ఇవ్వజూపాను. తీసుకోలేదు. వారి నుండి ఆశీర్వచనములు తీసుకొని సాయంత్రమునకు క్యాంప్‌కి చేరాను. నా గురించి అలవాటయినందున ఈ సారి ఎవరూ కంగారు పడలేదు. రాత్రి 8 1/2 గంటలకు భోజనాది కార్యక్రమములు ముగించుకొని నిద్రకుపక్రమించితిమి.

ఈ టార్చెన్ గ్రామములో 160 నుండి 200 మంది ఉంటారు. ఈ గ్రామ వాసులు చలికాములో క్రింది ప్రాంతాలకు వెళ్ళి నివసిస్తారు.

చైనా వారి సత్రములో సుమారు 25 గదులున్నాయి. 6 గదులు సత్రము వారి అధీనములో ఉన్నాయి. మిగిలిన 19 గదులు అద్దెకు ఇచ్చెదరు. 3 గదులు మరియు ఒక వంటగదిని భారతదేశ యాత్రీకులకు కేటాయించారు.

అచ్చటికి దగ్గరలో గుహలోవున్న సన్యాసిద్వారా కొన్ని విషయములు తెలుసుకున్నాను. వాటిలో శ్రీ విద్య గూర్చి, స్త్రీ పురుషుల స్పర్శ ద్వారా రోగములు తగ్గించే విధానములు. తారాదేవి, వజ్రవారాహి ఉపాసనా పద్ధతులు గూర్చి వివరంగా వారు వివరించారు. వాటి గూర్చి సంస్కృతములో ఏ పుస్తకములో వివరించారో ఆ పుస్తకముల ప్రచురణకర్తల చిరునామా ఇచ్చారు.

వజ్ర తంత్రశక్తి చాలా గొప్పది. దీని ద్వారా ఇతరులకు జ్వరములు తెప్పించుట, గొంతుపోవుట, ప్రయోగ బాధలు పోగొట్టుట, వర్షమును రప్పించుట, కురిసే వర్షమును ఆపుట, వడగండ్లను రప్పించుట మొదలగునవి చేయవచ్చును.

కాల, తారా, సాంగ్‌కుమ్, కుసరిగ్, చామ్ దేవతల అనుగ్రహమువలన తాంత్రిక శక్తులను సాధించుట ఈ టిబెటియన్‌ల ముఖ్య ఉద్దేశ్యము. డెంభాగ్ దేవత ద్వారా ఆధ్యాత్మిక శక్తి ప్రసారమవును. డెంభాగ్ దేవత 'కాల'మనే పురుషుని ఆక్రమించిన పిశాచ శక్తిని అణచివేయు శక్తి

యుండును. ఈ విధంగా దేవతల యొక్క రూపము, వాహనముల భేదా వలన ఒక్కోరకమైన శక్తి కలుగును. స్త్రీని గౌరవించడం ఈ ఉపాసకుల లక్షణం. స్త్రీని అగౌరవించరాదు. తద్వలన ఏదైనా స్త్రీకి అగౌరవం జరుగుచున్న యెడల ప్రాణత్యాగమునకు కూడా వెనుకాడని స్థితి యుండును. బుద్ధ జయంతి రోజున లేదా కార్తీక పౌర్ణమి మొదలగు దినములలో 'జ్వాల' శక్తిని మేల్కొల్పిన అనేక శక్తులు కలుగును. ఈ 'జ్వాల' శక్తి స్త్రీ పురుష సమ్మేళనం వలన కలుగును.

ఈ జ్వాలా దేవత ద్వారా మృత్యు దోషములు పోగొట్టుట, పిశాచ బాధలు, ఉన్మాద దోషములు తొలగుట, నిధి నిక్షేపములు కన్పించుట మొదలగు శక్తులు కలుగును. ప్రతి సంవత్సరం బుద్ధ జయంతి రోజున ఉత్సవము జరుగును. ఈ ఉత్సవమునకు టిబెట్ భాషలో మేళా అని పిలుస్తారు.

## దిర్భపైపు ప్రయాణములు

ఈ రోజు ఆగష్టు 23 ఉదయం 4 గంటలకు మేల్కొని, స్నానాది కార్యక్రమములు ముగించుకొంటిమి. 5 గంటలకు మా ప్రయాణము ప్రారంభమైనది. యాకు(జడల బర్రె)లు తెచ్చిరి. 'యాక్' అనే మృగము ఈ కొండలపై ప్రయాణమునకు అనుకూలము.

టార్చెన్ నుండి దిర్భుకి 20 కి.మీ. ప్రయాణం. సుమారు 2 కి.మీ. ప్రయాణము చేసితిమి. ఇంతలో వడగండ్ల వాన ప్రారంభమయినది. అందువలన అందరం రెయిన్‌కోట్ ధరించి ప్రయాణము సాగించుచుంటిమి. ఒక గంట సేపు ప్రయాణము సాగించిన తర్వాత వర్షము తగ్గినది. 10 నిమిషాల్లోనే ఎండతీవ్రత ఎక్కువయ్యెను.

ఒక గంట ప్రయాణము చేసిన అనంతరము మైదానంలాంటి ప్రదేశము వచ్చినది. చుట్టూ ఆకాశముతో పోటీపడే పర్వత పంక్తుల మధ్య ప్రయాణము ప్రారంభమైనది. 8 కి.మీ.ల దూరము ప్రయాణము చేసిన అనంతరం 'తార్చోచె' ను దర్శించితిమి. తర్చోచె అనగా 'మహా ధ్వజమని' అర్థము. ఇచటనే ప్రతి బుద్ధ జయంతి రోజున 'కుంభమేళా' జరుగును. ఇచట దాదాపు 500 మంది నుండి 2000 మంది వరకు టిబెటిన్ లామాలు పాత ధ్వజ స్తంభమును తీసి, క్రొత్త స్తంభమునుంచెదరు. ఇచటి నుండి చూసిన కైలాస పర్వతము దర్శనమగుట విశేషము.

2 కిలోమీటర్ల ప్రయాణము అనంతరం 'లాఛూ' అనే నదియూ, దాని ప్రక్కన కొన్ని గుహలున్నాయి. ఇంకొంచం దూరము పోగా శిథిలమయిన గొంపాలు కన్పించాయి. ఇక్కడికి దగ్గరలోనే 'మిలారెపే అవధూత స్థూపము' యున్నది. ఇంకొక అర కిలోమీటరు ప్రయాణము చేసితిమి. ఇచ్చట చదునైన ప్రదేశమున్నది. అందరమూ కాసేపు విశ్రమించదలచితిమి. లంచ్

ఏర్పాటు చేసుకున్నాము. అటుకులు, పంచదార, బిస్కట్లతో లంచ్ పూర్తి అయినది.

అరగంటసేపు విశ్రాంతి అనంతరము మరలా ప్రయాణము సాగించితిమి. ఇచటి నుండి కైలాస పర్వతము అతి మనోహరముగా కన్పించుచున్నది. రెండు కళ్ళు జటా జూటము, నోరు ముక్కు చాలా ప్రస్ఫుటముగా కన్పించినవి. ఇట్టి దృశ్యమును చూడవలసినదేగాని వర్ణించుట ఎవరి తరమగును?

అందరమూ శివ భగవానునకు జేజేలు పలికి ప్రయాణము సాగించుచుంటిమి. ఎత్తైన పర్వత పంక్తుల మధ్య మా ప్రయాణము సాగుచున్నది. విదేశీ జంట మా ముందు ప్రయాణము చేయుచున్నది. అబ్బాయి దేశం అమెరికా, అమ్మాయి దేశం పాకిస్తాన్. ఈ అమ్మాయిని ప్రేమించుట జరిగినది. కాని అమ్మాయి షరతు ఒకటి పెట్టినది. అదేమిటంటే మానస సరోవరం, కైలాసగిరి చూపిస్తేనే వివాహమునకు అంగీకరిస్తానన్నది. అందువలన ఈ జంట ఈ యాత్ర చేయుట ప్రాముఖ్య కలిగినది. కొంత దూరము నడిచి వెళ్ళగా రెండు నదుల సంగమమునకు చేరితిమి. ఈ నదీ సంగమ ప్రాంతమును దాటవలసినదే నదీ ప్రవాహము చాలా తీవ్రముగా వున్నది. లోతు తక్కువ యున్నది. 3 నుండి 4 అడుగుల లోతు మాత్రమే యుండును. ఎండ తీవ్రత ఎక్కువగా ఉన్నది అందు వలన అందరము బాగా అలసి పోతిమి. 'యాక్'లు (ఎద్దులాంటి జంతువు) ఎక్కితిమి. రెండు కాళ్ళు, చేతులను కట్టి వేసితిరి. మా పరిస్థితి ఎలా ఉన్నదంటే చిన్న పార్సిలును మూటకట్టినట్లుగా వున్నది. ఇచటి వాతావరణ పరిస్థితులకు అనుగుణంగా ప్రయాణము చేయుటకు ఈ యాక్‌లు మాత్రమే అనుకూలము.



కైలాసగిరి పర్వతము ఉత్తర దిశలో వున్న ముఖము

ఈ 'యాక్' ల వలన ఒకొక్కరికి ఒకొక్క అనుభవం కలిగినది. ఒక 'యాక్' నది మధ్యలో ఆగి అలానే 15 నిమిషాలు నిలబడినది. ఇంకొకటి నదికి ఎదురు నడుస్తున్నది. మరొకటి విపరీతమైన వేగముతో కొండలపైకి పరుగెత్తుచున్నది. ఇంకొకటి నదిమధ్యలో కూర్చొన్నది. ఈ విధముగా వాటి వాటి అభిరుచులకు తగ్గట్లుగా ప్రవర్తిస్తున్నాయి. వాటిపైన కూర్చొనియున్న యాత్రికుల కష్టాలు చాలా బాధాకరముగా యున్నవి.

ఈ 'యాక్'లను తోలేవాళ్ళు ఎట్లాగో కష్టపడి నదిని దాటేటట్లు చేశారు. బ్రతుకు జీవుడా అనుకొని అందరమూ వాటిపై నుండి దిగి మరలా ప్రయాణము సాగించితిమి యింకోగంట ప్రయాణము అనంతరము 'దిర్పి' క్యాంప్ చేరితిమి. దీనిపేరే 'దీరాపుక్ గోంపా' అని అంటారు.

ఈ క్యాంప్ ఖచ్చితంగా కైలాసగిరి పర్వతమునకు దగ్గరలో వున్నది. అంటే ఈ కైలాసగిరి పర్వతము ఉత్తర దిశలో వున్న ముఖము. క్యాంప్‌కు చేరగానే వేడి నీళ్ళతో స్నానము చేసితిమి. శంకరుని ధ్యానము, భజనలు చేసితిమి. ఉప్మా తిని బోర్న్‌వీటా త్రాగితిమి.

ఇంతలో హఠాత్తుగా నా ఆరోగ్య పరిస్థితి మారిపోయినది. సుమారు 20 సార్లు విరోచనాలు కలిగాయి. ఏ మందులు వేసినా తగ్గలేదు. బాగా నీరసముగా వున్నది. అందరూ చాలా బాధపడుతున్నారు. అడుగుతీసి అడుగు వేయటము కూడా కష్టముగా నున్నది. విరోచనములు మాత్రము తగ్గలేదు. యాక్ వాలా నా పరిస్థితి తెలుసుకొని ఏదో మూలికలతో కలిసిన పొడిని యిచ్చి మ్రింగమన్నాడు. 15 నిమిషాలలో విరోచనాలు తగ్గాయి. మందులు చేయలేని పని, ఒక్క మూలికలతో ప్రభావము కన్పించిది. గోరు వెచ్చటి నీటిని వాటర్ బాటిల్‌లో పోసి, ఇంకేదో మూలికలను కలిపి ఇచ్చాడు. ప్రతి 15 నిమిషాలకు కొంచెం కొంచెం త్రాగమన్నాడు. ఆ విధముగా 2 బాటిల్స్ నీళ్ళను త్రాగితిని. ప్రశాంతముగా నిద్రకుపక్రమించితిమి.

<u>డోల్మా లా వైపు :</u> ఉదయం 2-30 గంటలకు నిద్ర లేచితిమి. ముఖ ప్రక్షాళన చేసి, బోర్న్‌వీటా త్రాగితిమి. 'యాక్‌వాలా'కి కృతజ్ఞతలు చెప్పితిని. 10 యాన్ రూపాయలను చేతిలో పెట్టితిని.

సుమారు 3-15 గంటలకు ప్రయాణము ప్రారంభమయినది. ఒక ఫర్లాంగ్ నడిచాము చలితీవ్రత చాలా హెచ్చుగా వున్నది. మంచు పూలుగా పడుతోంది చలిగాలి కూడా వున్నది. 5 ని॥లు కంటే ఎక్కువ సేపు నిలబడిన ఫ్రీజ్ (గడ్డకట్టుట) అవుతారని అందువలన ఎలాంటి పరిస్థితిలోనూ ఎక్కడా ఎక్కువసేపు నిలబడవద్దని హెచ్చరిక చేశాడు. యథాప్రకారము నలుగురు ముసలి వాళ్ళను తోడుగా నన్ను ఉంచారు. ప్రతి యాత్రికునకు మరొక సేవకుడిని తప్పనిసరిగా ఉంచారు.

డోల్మాపాస్ దాటి జంగ్‌జెర్బూ చేరవలయును. గాలి తీవ్రత చాలా ఎక్కువగావున్నది.

రెండు అడుగుల నుండి 5 అడుగుల వరకు మంచు పేరుకొని యున్నందున, అందరూ జారిపడి, లేచి మరలా ప్రయాణము సాగించుట జరుగుచున్నది. నేను ఎక్కడా జారిపడకుండా చాలా జాగ్రత్తగా నడుస్తున్నాను. కాని, ఒకసారి మాత్రం కాలుజారి ప్రక్కన ఉన్న లోయలోకి వెళ్ళాను. కఱ్ఱసాయముతో ఏదో విధంగా ఆగి నిలబడ్డాను. యాక్‌వాలా చేయిపట్టుకొని పైకి తీసుకొని వచ్చాడు.

నేను, నలుగురు ముసలివారు చాలా వెనుకగా ప్రయాణము సాగించుచున్నాము. అందరమూ ఆ మంచు తీవ్రతకి వణికిపోతున్నాము. ఇంతలో ఒక్కసారిగా గాలి తీవ్రత పెరిగెను. అందువలన ఆక్సిజన్ లోపము ఎక్కువైనది. అందరమూ ప్రాణములు అరచేతిలో పెట్టుకొని ప్రయాణము సాగించుచున్నాము. అర కిలోమీటరు దూరము నడిచిన తర్వాత నది వచ్చెను. నదిపై ప్రయాణము చేయవలయును. నదిపై మంచుపొర యున్నది. అది ఏమాత్రము తొలగినా నదిలో పడవలసినదే. అంతచలిలోనూ అందరికీ ముచ్చెమటలు పోసినవి. ఎట్టైతేనేమి అతి కష్టం మీద ఆ నదిని దాటితిమి. నదిని దాటిన తర్వాత మరలా పర్వతాలు వచ్చాయి. చాలా ఎత్తుగా వున్నవి. చాలా జాగ్రత్తగా నడుస్తున్నాము - మా ఆఫీసర్ పర్వత పంక్తులపై మూడుసార్లు జారిపడ్డాడు. అతను అహంకారి. పర్వత పంక్తులపై ప్రయాణము అతనికి అలవాటు. మూడుసార్లు పడటము వలన అతనికి నడుమునొప్పి వచ్చినది. యాక్‌పై ఎక్కించి, కట్టివేసి ప్రయాణము సాగించితిమి.



డోల్మా లా

ఇంతలో ఒక్కసారిగా చాలా తీవ్ర స్థాయిలో గాలి ఎక్కువయ్యెను. ఆ తీవ్రతకు నా రెయిన్ ఫ్యాంట్ ముక్కలయ్యింది. మంచు తీవ్రత ఎక్కువగా ఉండుట వలన చాలా తొందరగా నడక సాగించితిని. ఎట్లయితేనేమి రెండుగంటల ప్రయాణము అనంతరం డోల్మాఫాస్ చేరితిమి.

డోల్మాఫాస్‌లో అమ్మవారి పాదము యున్నది. అక్కడ పూజాది కార్యక్రమములు పూర్తి చేసుకొంటిమి. డోల్మాఫాస్ దిగువన అమ్మవారి యొక్క తీర్థమున్నది. రెండు కిలోమీటర్ల దూరము దిగువన యున్నందున ప్రతి సీసాకి 10 యాన్‌లు చొప్పున వసూలు చేశారు. 1 యాన్ 5 రూపాయలకు సమానము. ఒక్కరికి గొడుగున్నందున, నా అవస్థ చూసి యిచ్చారు. తెల్లవారు జామున 5-30 గం॥లు అయినది మంచు పడటము ఆగినది. సూర్యుని కిరణములు కన్పించుచున్నవి. డోల్మాఫాస్ నుండి


డోల్మాఫాస్ క్రింద విశ్రాంతి

క్రిందకు దిగుచుంటిమి. ఎట్లయితేనేమి 8-30 గంటలకు కొండ దిగితిమి. ఎండ తీవ్రత హెచ్చుగా వున్నది. అందరమూ బండరాళ్ళపైనే విశ్రమించితిమి. 1 గంట సేపు విశ్రాంతి అనంతరము ప్రయాణము కొనసాగించితిమి. ఇక్కడి నుండి దారి అంతా బండరాళ్ళతో నిండి యున్నది. అందువలన అందరూ యాక్‌ను ఆశ్రయించితిమి. నేను మాత్రము నడకతోనే ప్రయాణము సాగించితిని. 'సాబూ' యాత్రికురాలిని యాక్ విదిలించి క్రింద పడవైచెను. అదృష్టము వలన పొదలలో పడటము వలన పెద్దగా దెబ్బలు తగలలేదు. రెండు కిలోమీటర్ల ప్రయాణము అనంతరము దారి చాలా బాగుంది. కాని, చుట్టూ భయంకరమైన కొండలున్నవి. ప్రక్కనే నది ప్రవహించుచున్నది. అందరమూ అక్కడ భోజనము చేసితిమి. అటుకులు, బిస్కట్లు, డ్రైఫ్రూట్స్, కూల్‌డ్రింక్స్ యిది ఆరోజు భోజనము. అరగంట విశ్రాంతి అనంతరము ప్రయాణము సాగించితిమి. కోమిలాథాపే, అఖిలా దేవీలు భక్తిపాటలు పాడుచూ ప్రయాణము సాగిస్తున్నారు. అందరమూ సంతోషముతో భజనలు చేసుకొంటూ ప్రయాణము సాగించితిమి. సాయంత్రము 6 గంటలకు 'జంగ్‌బెర్బూ' కు చేరితిమి. మరుసటి రోజు ఉదయం(తెల్లవారు ఝామున) రెండున్నర గంటలకు తార్చెన్ వైపుకు ప్రయాణమైతిమి. దారియంతా చాలా సులభతరంగా వున్నది. దారి అంతా ఏటవాలుగా వున్నది. ఎటు చూసిన కొండలు, లోయలు, గొప్ప ఓషది

పదార్థములను రుచి చూపించారు. వాటిని అన్నింటిని మరలా మిగిలిన ప్రసాదమును భుజించి, కూల్‌డ్రింక్ త్రాగి వీళ్ళకు కృతజ్ఞతలు చెప్పి నా మంచముపై విశ్రమించాను.

రాత్రి 6-7 గంటల ప్రాంతంలో ముగ్గురు ఆడవాళ్ళు వచ్చిలేపారు. నన్ను పరిహసించారు. ఖాళీ కడుపుతో ఉన్నావుకదూ ! మీ అమ్మవారు అన్నం పెట్టిందా? ప్రతిదానికి అమ్మదయ అంటావు అని ఇష్టమైన రీతిలో మాట్లాడసాగారు. ఏ ఒక్కరు కూడా వారిని వారించలేదు. ఆ ముగ్గురిలో ఇద్దరు ఆడవాళ్ళు కోటీశ్వరుల భార్యలు కావడము విశేషము.

ఎద్దేవా చేశారు. 'అవును' అని మూర్ఖంగానే సమాధానమిచ్చాను. అలాఅయితే అమ్మవారికి చెప్పు అలా చేయటం మంచిపని గాదని అనగా; అట్లే అని, మరలా - అమ్మవారికి మీ మాటలు చెప్పిన తర్వాత జరిగే వాటికి నేను బాధ్యుడను కాదు అన్నాను. అమ్మవారు ఏమీ లేదు ఆ మాటలు చెప్పి మమ్మల్ని మభ్యపెడ్తున్నావు. చెప్పుకో ! నీ అంతు చూస్తామని కోపంతో ఆ ముగ్గురు పొగరుబోతు స్త్రీలు వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళిపోయాక తోటి యాత్రీకలు సర్ది చెప్పారు బాదపడవద్దని. నాకు కొంచెం బాధ, కోపము రెండూ కలిగాయి. ఆ రాత్రి నిద్రపట్టలేదు. పడుకొనే అమ్మవారిని పరిపూర్ణంగా ధ్యానించాను. అట్లే నిద్రపోయాను. ఈ మంత్రమును ఇచటి మహనీయుడు ఉపదేశము గావించెను కదా !

ఆ ముగ్గురికి రాత్రి 1-2 గంటల ప్రాంతంలో విపరీతమైన జ్వరము వచ్చినది. ఉదయం 6 గంటల ప్రాంతములో నిద్రలేచి కాలకృత్యములు తీర్చుకొని పూజాది కార్యక్రమములు పూర్తి చేసుకొంటిని. 8 గంటలకు నా కార్యక్రమము పూర్తి అయినది. అంతలో అందరూ ఉమ్మడిగా నా దగ్గరికి వచ్చారు.

కుట్టి, వడివేలు దంపతులు నా దగ్గరికి వచ్చి విషయము వివరించి చెప్పారు. నేను ప్రశాంతముగా వున్నాను. ఆ ముగ్గురితో పాటు అందరూ నా దగ్గరికి వచ్చారు. ఆ ముగ్గురు ఆడవాళ్ళు జ్వరముతో బాధపడ్తున్నారు. పాపం వాళ్ళమీద కోపం దేనికి అని యాత్రికులు అందరూ చెప్పారు. ఆ ముగ్గురు స్త్రీలకు నా చేత కుంకుమ పెట్టించారు. వాళ్ళలో ఒకరు మాత్రం ఎదురు ప్రశ్న వేశారు. మాకు జ్వరం తగ్గటానికా లేక ఎక్కువ కావటానికా? అని, మీ మనోభావము ఎల ఉందో అలాగేనని సమాధానమిచ్చి పంపాను. అందరము పదిన్నర గంటల ప్రాంతములో సామాను సర్దుకొని బస్సు ఎక్కాము. రాత్రి 8 గంటలకు తక్లాకోట్‌లో వున్న గెస్ట్ హౌస్‌కు చేరాము. ప్రయాణములో అందరమూ అలసి పోయాము. వంటవాళ్ళని బ్రతిమాలి 10 మంది మాత్రము వేడినీళ్ళ స్నానము చేశాము. ఆ తర్వాత టిఫిన్ కార్యక్రమములు పూర్తి చేసుకొని, విశ్రమించితిమి.

మా గదిలో శివుని పటము, మానస కైలాసగిరి చిత్రములున్నవి. శివుడు

క్షమాలాధారుడై యుండెను. రుద్రాక్షలు 14 రకములుగా గలవు.

కముఖి : ఇది శివ అంశతో వుండుట వలన బ్రహ్మహత్యా దోషములు పోగొట్టుటయే గాక గౌరవము లేదా పదవీ లాభము కలుగజేయును. 2. ద్వీముఖి : అర్ధనారీశ్వరము. దీనివలన పాపములు తొలగును. దీనిని ధరించుట వలన జలుబు, దగ్గు, మానసిక వ్యాధులు, హ దోషములు తొలగును. 3. త్రిముఖి : స్త్రీ హత్యా, శిశుహత్యా పాపములను పోగొట్టును. ని ధరించుటవలన రోడ్డు ప్రమాదములు తొలగుట, విద్యాభివృద్ధి కలుగును. 4. చతుర్ముఖి హ్మాంశ, హత్యాపాపహరము, భూసంబంధిత తగాదాలు తొలగుట, రోడ్డు ప్రమాదములు గుట, సర్పభయము తొలగుట, దైవభక్తి పెరుగుట, జ్యోతిష శాస్త్రముల జ్ఞానము కలుగును.

పంచముఖి : కాలాగ్ని రుద్రాంశ, మానసిక ప్రశాంతత, ధనలాభము, ఉద్యోగ లాభము గును. 6. షణ్ముఖి :కార్తికేయాంశ బ్రహ్మహత్యా దోషమును పోగొట్టును. ప్రేమ వైఫల్యములు, స్య అవయవ దోషములు, వీర్యనష్టములు తొలగించును. 7. సప్తముఖి : కనంగము. స్త్రీ కరణ, శత్రునాశనం, ఆకస్మిక ధనలాభము కలుగును. 8. అష్టముఖి :వినాయకము. గండములు లగును. విద్యాభివృద్ధి కలుగును. పేరు ప్రఖ్యాతులు కలుగును. 9. నవముఖి :భైరవము. ధ్యాత్మిక జ్ఞానాభివృద్ధి, శ్రీ విద్యోపాసనాభివృద్ధి కలుగుట, స్త్రీలకు అబార్షన్ బాధలు తొలగును. 0. దశముఖి : జనార్దనము. సర్పదోషము, జైలు శిక్షలు తొలగుట, సంతాన లాభము కలుగును. 1. ఏకాదశముఖి : ఏకాదశ రుద్రాంశ మానసిక ప్రశాంతత కలుగును. హిస్టీరియా వంటి యాధులు తొలగును. పేరు ప్రఖ్యాతులు కలుగుట, సన్యాసిగా మారుటకు అనుకూలించును. 2. ద్వాదశముఖి : ఆదిపత్యము. రాజగౌరవము లేదా గవర్నమెంటు ఉద్యోగ లాభము కలుగ వకాశములు, నిర్భయము కలుగుట, రోడ్డు ప్రమాదముల నుండి బయటపడుట జరుగును. 3. త్రయోదశముఖి : సాక్షాత్‌శివ స్వరూపము. దీనిని ధరించుటవలన అన్ని రకములయి ష్ట నష్టములు తొలగును. అన్ని ప్రయోగ బాధల నుండి రక్షించును. రక్తపోటు, పిచ్చితనము హస్య అయవముల బాధలు, మానసిక బాధలు తొలగును.

అందరమూ శివనామస్మరణము చేసు కొనుచూ నిద్రకుపక్రమించితిమి. రేపు ఉదయ ఖచోర్‌నాథ్ దేవాలయమునకు వెళ్ళ వలయును. తక్లాకోట్ నుండి సుమారు 80 కి.మీ. దూరము వున్నది. ఈ దేవాలయము టిబెట్‌లకు ఎంతో విశేషమయినది.

ప్రాతః కాలమునే లేచి కాలకృత్యములు తీర్చుకొంటిమి. స్నానాది కార్యక్రమము పూర్తి చేసుకొంటిమి. ఎక్కువ మంది బట్టలను ఉతికి ఆరబెట్టు కార్యక్రమాలలోనే యుండి గెస్టహౌస్ ప్రాంగణము అంతా కోలాహలముగా వున్నది. పూజాది కార్యక్రమములు పూ చేసుకొంటిమి. యింతలో అల్పాహారమునకు పిలుపు వచ్చినది.

వర్ణముగా, అవలోకితేశ్వరుని ముఖము తెలుపు వర్ణముగా, వజ్రపాణి ముఖము నీల వర్ణముగా వున్నది. ఈ దేవాలయమునందు మైత్రేయమూర్తి, బుద్ధుని సప్తావతారము, ర లక్ష్మణ సీతామూర్తులు కూడా వుండిరి. తారాదేవి యొక్క 22 అవతారములు ఇచ్చ పూజింపబడుట విశేషము. టిబెటన్లకు పవిత్ర గ్రంథములయిన తంజూర్, కంజూర్ ఇ భద్రపరచిరి.

అందరమూ దర్శించుకొని, కొన్ని ఫోటోలను తీసుకొంటిమి. దేవాలయపు లో మాత్రము ఫోటో తీయుట నిషిద్ధము. ఒక గంటసేపు తర్వాత మరలా ప్రయాణము సాగి 3-30 గంటలకి గెస్టహౌస్‌కి చేరితిమి. వెంటనే డైనింగ్ రూము నుండి పిలుపు వచ్చిన చపాతీలు, ఆలుగడ్డ కూర, సుప్, కాఫీ, టీలతో మధ్యాహ్నం భోజన కార్యక్రమం పూర్తి అయిన

<u>తక్లాకోట్ గెస్టహౌస్‌లో :</u> అందరూ ఎంతోసంతోషముగా వున్నారు కాని ఒక స్త్రీ మాత్ర ఇంకా జ్వరముతో బాధపడుచున్నది. ఎన్నిరకములయిన మందులు వేసిన తగ్గటము లేదు. చాలా బాధపడ్డాను. ఇంతలో జ్వరము తగ్గిన యిద్దరు స్త్రీలు నా దగ్గరకు వచ్చారు. నీకు టిబె వారి నుండి సర్టిఫికేట్ రాదు. మాతో పెట్టు కోకు. మేము ధనవంతులం జాగ్రత్త అని బెదిరించా వారి మాటలు విని నేను నవ్వుకొన్నాను. ఈశ్వరుని అనుగ్రహంతో మానస సరోవరము, కైలాస దర్శనము, పరిక్రమణ జరిగాయి. ఈ సర్టిఫికేటు నాకెందుకు అన్నాను. ఏదో విధంగా న బాధపెట్టాలని, బాధపడ్తే చూడాలని ఉద్దేశ్యంతో ఎన్నో రకములుగా మాట్లాడారు. మీరు విధంగా నన్ను విసిగింటారంటే మరలా మీకు జ్వరములు వస్తాయి జాగ్రత్త అన్నాను. కోపము వెళ్ళారు. వెళ్ళిన అరగంటలోనే వాళ్ళకి జ్వరాలు వచ్చాయి.

7 గంటల ప్రాంతములో 'యెల్లో ఆఫీసర్' నాదగ్గరకు వచ్చాడు. నీవు అందరి కో-ఆపరేటివ్‌గా లేనందున నీకు టిబెట్ గవర్నమెంట్ నుండి సర్టిఫికేట్లు రావని చెప్పాడు. నీ తప్ప అందరికి సర్టిఫికేట్లు ఇస్తున్నాము అని చెప్పాడు. మానస సరోవరం, కైలాసగిరి పరిక్రమణ చేసిన వారికి మాత్రమే ఈ సర్టిఫికేట్లు ఇవ్వబడతాయి. ఇంకో గ్రూపులోని వారు కైలాసగి ప్రదక్షణము చేయలేదు కదా! వారికి ఎందుకు ఇస్తున్నట్లు? అని అడిగాను. నా యిష్టం నీవెవరి అడగటానికి జాగ్రత్త అని హిందీలో రకరకాలుగా మాట్లాడాడు. అంత స్పీడుగా మాట్లాడటవ వలన నాకు బాగా అర్థము కాలేదు. సారాంశం ఏమిటంటే ఆ ఆడవాళ్ళు చెప్పారట అందువల సర్టిఫికేట్లు ఇవ్వడం లేదు. న్యూ ఢిల్లీకి వెళ్ళిన తర్వాత నా సంగతి తేలుస్తానన్నాడు.

అప్పటి వరకు లేని కోపము ఒక్కసారిగా వచ్చినది. నాకు సర్టిఫికేటు యివ్వకుంద నీవు ఎట్లా ఇండియా చేరతావో చూస్తాను. యిస్తే, అందరికీ ఇవ్వు, లేదా రూల్ ప్రకారం ఇవ్వ ఈ విషయం తేలందే ఆహారము, నిద్ర వదిలేస్తున్నాను అన్నాను. గమ్మత్తుగా నవ్వుతూ బయటక వెళ్లాడు. అందరూ సరదాగా నవ్వుకున్నారు. వృద్ధులు మాత్రము నన్ను మందలించారు. వాళ్ళక

బుద్ధిలేదు మరి నీ సంగతేమిటని. ఎన్ని విధములుగా చెప్పినా నా మాట మాత్రము మారలేదు. రాత్రి భోజనమునకు రమ్మని కబురు చేశారు. భోజనమునకు వెళ్ళలేదు. ఒక బాటిల్‌లో గ్లూకోస్ కలుపుకున్నాను. కిస్‌మిస్‌లు, బాదంపప్పు మాత్రము కొంచెం తిని, గ్లూకోస్ నీళ్ళు త్రాగాను. ఆ పరమేశ్వరుని ధ్యానిస్తూ, 'అఘోర' మంత్రమును పంచాక్షరీ మంత్రమును సంపుటిగా జపము చేస్తున్నాను.

మా గదిలో ఐదుగురు మాత్రమున్నారు. వారు, 1. నేను, 2. కుట్టి, 3. యెల్లో ఆఫీసర్, 4,5. వడ్డివేలు దంపతులు. నేను మంచముపై అట్లాగే కూర్చొని ధ్యానములో ఉండుట చూసి యెల్లో ఆఫీసర్ భయపడ్డాడు. ఆంజనేయస్వామి స్తోత్రము పారాయణ చేయుచూ నిద్రపోయాడు.

ప్రాతః కాలములో అందరూ నిద్రలేచారు. యెల్లో ఆఫీసర్ మాత్రము లేవలేకపోయాడు. ఏదో దోమ కుట్టిందో, ఏమి జరిగిందోగాని ఒక చెయ్యిమాత్రము గుమ్మడికాయ అంత లావుగా వాచియున్నది. జ్వరంతో బాధ పడుచున్నాడు. అందరూ స్నానాదులు పూర్తిచేసుకొని డైనింగ్ రూమ్‌కి వెళ్ళారు టిఫిన్ చేద్దామని. నేను తప్ప అందరూ హాలులో ఉన్నారు. నలుగురు పెద్దమనుషులకు మాత్రము పూర్తి వివరములు తెలియవు. వాళ్ళకు పరిస్థితి తెలిసింది. 25 మంది నా దగ్గరికి వచ్చి క్షమాపణ చెప్పారు. 'నీ దీక్ష విరమించి, స్నానం చేసి అందరితోఆటు టిఫిన్ చేయవలసినది. నీవు కోరిన రీతిగా అందరికీ సర్టిఫికేట్లు వస్తాయి' అని సర్దిచెప్పారు. అంతలో మా గైడు టెంపా వచ్చి 'భగవంతుని కృపా, అమ్మవారి దయ నీపైన యున్నది. బాధపడవద్దు. వాళ్ళు అన్న మాటలకు వాళ్ళు బాధపడ్తున్నారు. నీవు బాధను వదిలేయి. వాళ్ళు రోగ విముక్తులు అవుతారు' అని నచ్చ చెప్పాడు.

మా గైడు పేరు టెంపా. నేపాల్ దేశము జన్మస్థలము. ప్రస్తుతము టిబెట్‌లో నివసించుట జరుగుచున్నది. మతవిశ్వాసముల మీద ఎంతో అపారమైన నమ్మకమున్నవాడు. నన్ను, యెల్లోఆఫీసర్, కుట్టి, వడివేలు దంపతులను ఇంటికి ఆహ్వానించాడు. పూజాది కార్యక్రమాలు పూర్తిచేసి ప్రసాదమును ఇచ్చాడు. అందరికీ వనమూలికలతో చేసిన కషాయము, ప్రత్యేకమైన టీ ఇచ్చాడు. మానస సరోవర ప్రాంతములలో అనేక గొప్ప మూలికలున్నాయి. బయటి వారికి ఈ విషయము తెలియనివ్వరు. ఈ కషాయము సేవించుట వలన శారీర ఆరోగ్యం పెరుగుట, దైవభక్తి పెరుగుట, మోకాళ్ళ నొప్పుల బాధలు తొలగుట జరుగును. ఇంతటి గొప్ప కషాయము ప్రపంచములో ఎక్కడా దొరకదు. నేను మాత్రము కొంచెం పొడిని యివ్వమని అడిగాను. టెంపా అంగీకరించలేదు. ఎవరికీ కూడా ఫార్ములగానీ, పొడుముగానీ యివ్వరాదని గురుదేవుల ఆజ్ఞట.

సాయంత్రము అందర్నీ గెస్ట్‌హౌస్‌లోని కాన్ఫరెన్స్ హాల్‌కి రమ్మని కబురు చేశారు. చైనీస్ అధికారులు, టిబెట్‌గైడు టెంపా ఆధ్వర్యంలో అందరికీ తేనీటి విందు ఏర్పాటు చేసి సర్టిఫికేట్ యిచ్చారు. మొట్టమొదట నన్ను పిలిచారు. అందరమూ చైనా, టిబెట్ ఆఫీసర్లకి ధన్యవాదములు

తెలిపాము. మరుసటిరోజే తిరుగు ప్రయాణము.

లిపులేక్ పాస్‌కి : ఈ రోజు ఆగష్టు 29వ తేది. ఉదయం 2 గంటలకే లేచి కాలకృత్యముల పూర్తిచేసుకొని పూజాది కార్యక్రమాలు పూర్తి చేసుకొంటిమి బ్రేక్ ఫాస్ట్ చేసితిమి. శంకరుని నినాదములు చేసితిమి. లగేజిని బస్సులో యుంచితిమి. 4 గంటలకు బస్సు బయలుదేరినది తక్లాకోట్‌లో ఉన్న గెస్ట్‌హౌస్ సిబ్బంగి అందరూ ఘనంగా వీడ్కోలు చెప్పారు. ఈ రోజు వాతావరణము చాలా చలిగావున్నది. ఎట్లయితేనేమి కైలాసగిరి, మానస సరోవరయాత్ర పూర్తి అయిన సంతోషముతో ఆనందముతో తిరుగు ప్రయాణమగుచుంటిమి. రెండున్నర గంటల బస్సు ప్రయాణము ముగిసినది

వాతావరణమంతయూ మారి యున్నది. ఎక్కడ చూసినా మంచు. కొండలన్నియు మంచుతో నిండియున్నవి. మరలా అందరమూ యథావిధిగా డ్రస్‌లన్నింటిని ధరించితిమి గుఱ్ఱములపై ఒక గంట ప్రయాణము చేసితిమి. గుఱ్ఱములపై ప్రయాణము క్షేమము కాదని మమ్మల్నిదించి, నడువమనిరి. 8–30 గం॥లకు లిపులేక్ పాస్‌కి చేరితిమి. దారిఅంతా మంచుతో నిండియుండుట వలన చాలా జాగ్రత్తగా నడువవలసినదిగా హెచ్చరించారు. ఇక్కడి నుండి భారత భూప్రదేశము కావున భారత మిలటరీ దళముల మధ్య నడచుచూ 11 గంటలకు నవీదాంగ్ చేరితిమి. అందరమూ అరగంట సేపు విశ్రాంతి తీసుకొంటిమి. మంచు కప్పివేయడం వలన ఓం (OM) పర్వతము కన్పించలేదు. ఈ మంచుకి కొండ కన్పించలేదు. ఈ మంచుకి కొండ కన్పించనందున ఒక హెలికాప్టరు ముక్కలయిందని శకలాలను చూపించారు. అందరి మనస్సుల్లో ఆందోళన కలిగింది. హిమాలయ శ్రేణులలో వాతావరణం మారిన యెడల ప్రకృతి భీభత్సమును చూడ వలసినదే. చైనావారు కట్టి ఇచ్చిన శనగలను ఆరగించితిమి. మిలటరీ సోదరులు 'తేనీటిని' యిచ్చిరి.

యిక్కడి నుండి కాలాపానీ మార్గము దిగువగా వుండును. అందువలన అందరమూ చాలా త్వరత్వరగా నడచుచూ మధ్యాహ్నం ఒంటిగంటకు చేరితిమి.

నేను మాత్రము వేడినీటితో స్నానము చేసితిని. మిలటరీ డాక్టరు నన్ను పరిశీలించి జాగ్రత్త. ఒంటిమీద తేమ లేకుండా తుడుచుకోమని సలహాయిచ్చాడు. అందరికీ భోజనాది కార్యక్రమాలు పూర్తి అయ్యాయి. డాక్టరుగారు వచ్చి అందరి ఆరోగ్యమును విచారించి, మందు బిళ్ళలనిచ్చారు. ఇచటనే ఇమ్మిగ్రేషన్ చెక్ జరుగుతుంది.

అందరూ తక్లాకోట్‌లో చైనీస్ వస్తువులను కొంటారు. చిన్న చిన్న వస్తువులను, బట్టలను పట్టించుకోరు. విలువైన వస్తువులు తెస్తే కస్టమ్స్ డ్యూటీ వేస్తారు. ఈ కొండలపైన తెలివైన వాళ్ళెవ్వరూ విలువైన వస్తువులను తీసుకొనిరారు. వాటిని తీసుకొని రావటానికి పోర్టరు కావాలి. అతను పొరపాటున జారవిడిచిన వస్తువు ఆనవాలు కూడా కన్పించదు కదా! యెల్లో ఆఫీసర్ మా అందరి పాస్‌పోర్ట్స్‌ని ఇచ్చాడు. మిలటరీ ఆఫీసర్స్ మమ్మల్ని, మాలగేజిని చెక్ చేశారు. సాయంత్రం

6 గంటల ప్రాంతములో మరలా లగేజీని ప్యాక్ చేసితిమి. కాలాపానీ క్యాంప్‌లో ఉన్న కాళీమాతను సందర్శించితిమి. అమ్మవారికి పూజాది కార్యక్రమములు పూర్తిగావించితిమి. 7-30 గంటలకు భోజనాది కార్యక్రమాలు చేసితిమి. ఇంతలో మెరుపులు, ఉరుములతో పెద్ద ఎత్తున వర్షము ప్రారంభమైనది. మేమందరమూ క్యాంప్‌లోకి వెళ్ళి రగ్గులను బిగించితిమి.

గాలి తీవ్రత ఎక్కువగా వున్నది. ఆ గాలి యొక్క తీవ్రత సుమారు 80 నుండి 100 కి.మీ. వుండునని మిలటరీ వాళ్లు చెప్పారు. స్లీపింగ్ బ్యాగ్, రగ్గులు కప్పుకున్నా చలిగా యున్నది. అలాంటి పరిస్థితులలో ఎప్పుడు నిద్ర పట్టిందో తెలియదు.

<u>గుంజి వైపు :</u> ఈ రోజు ఆగష్టు 30వ తేది. ఉదయమునే 6 గంటలకు బెడ్ టీ ఇచ్చారు. కొందరు దంతధావనము తర్వాత టీ త్రాగారు. విపరీతమైన చలిగావున్నందున ఎవ్వరమూ స్నానము చేయలేకపోయితిమి. అందరమూ విభూథి ధరించి శివధ్యానము చేసుకొని, లగేజీని గుఱ్ఱమునకు అప్పగించితిమి. ఉదయం 8 గంటలకు ప్రయాణమైతిమి. కాలాపాని నుండి గుంజి వరకు దూరము 10 కి.మీ. వుండును. మార్గమధ్యంలో ప్రకృతి చాలా ఆహ్లాదకరముగా వుండును. ఈ రోజు ఎవ్వరూ పరిశీలిస్తూ ఆనందిస్తూ ప్రయాణము చేయడము లేదు. ఎప్పుడెప్పుడు క్యాంప్‌కు చేరుదామా అనే తొందరలో వున్నారు. ఆకాశమంతా మేఘావృతమైయున్నది. చల్లటి గాలులు వీస్తున్నాయి. ఎట్లయితేనేమి 11-30 గంటలకు గుంజికి చేరితిమి.

అందరికీ రస్నా యిచ్చారు. అందరమూ ఆరగంట సేపు విశ్రాంతి తీసుకొంటిమి. ఆ తర్వాత టమోటా సూప్ ఇచ్చారు.

ఆకాశమంతా ప్రశాంతంగా వున్నది. సూర్య భగవానుని దర్శన భాగ్యము కలిగినది. గుంజి క్యాంప్‌లో యున్న గుడారములు, గదులు అన్ని నిండివుండుట అందరికీ విచిత్రముగా యున్నది. అందరినీ సమావేశ పరచి మిలటరీ వాళ్ళు అసలైన విషయమును చెప్పారు.

వాతావరణము పూర్తిగా చెడిపోయినది మార్గ మధ్యంలో బ్రిడ్జీలు ముక్కలయ్యాయి. కొండ చరియులు విరిగి పడుట వలన మార్గములు మూతపడ్డాయి. అందువలన అందరూ మనోధైర్యముతో ఉండండి భయపడవలదు. వాతావరణము ప్రశాంత స్థితిలోవున్నపుడే మీ ప్రయాణము జరుగును అప్పటి వరకు ఈ క్యాంప్‌లోనే యుడవలయును అని గట్టిగా చెప్పారు.

అందరమూ భయపడ్డాము. ఎందుకంటే వాతావరణము ఈ విధంగా మారిన యెడల సుమారు 10 రోజుల వరకు మార్పురాదు సరికదా! ఈ వాతావరణము పడని యెడల న్యుమోనియా, టైఫాయిడ్ జ్వరములు వచ్చు అవకాశములున్నవి.

సాయంత్రము 5-30 గం॥ల వరకు వాతావరణము చాలా ప్రశాంతముగా వున్నది. ఇంతలో ఒక్కసారిగా ఆకాశములో పరిస్థితి మారిపోయినది. మబ్బులతో నిండిపోయినది. ఒక్కసారి చేతికి కూడా అందే దూరములో సాగిపోతున్నాయి. అందరమూ క్యాంప్‌లో తలదాచుకున్నాయు.

బయట ఉరుములు మెరుపులతో వర్ష తీవ్రత భయంకరముగా మారినది. అందరము
వణికిపోవుచూ శివుని ధ్యానిస్తూ నిద్రించితిమి. ఉదయం 4 గంటలకు మిలటరీ ఆఫీసర్
మమ్మల్ని లేపాడు. వాతావరణము చాలా ప్రశాంతముగా వున్నది. కాలకృత్యములు
పూర్తిచేసుకొని, టిఫిన్ కాఫీలను సేవించితిమి.

మమ్మల్నందర్నీ మిలటరీ అధికారి సమావేశపరిచెను. అందర్నీ డాక్టరుగారు చెకప్
చేశారు. కొంతమందికి బి.పి. స్వల్పంగా తేడాయున్నదని, భయపడవలదని ధైర్యము చెప్పారు.

ప్రస్తుతము వాతావరణము ప్రశాంతంగా వున్నది. రాత్రికి వాతావరణ పరిస్థితిలో
మార్పు వచ్చే అవకాశమున్నదని, అందు వలన సాధ్యమైనంతవరకు దిగువకు వెళ్ళుట మంచిదని
సలహాయిచ్చిరి. ప్రయాణం చేయుట లేదా మానుకొనుట మీ యిష్టమని చెప్పారు. ఏం
చేయాలా అన ఆలోచనలో ఉన్నాను. ఇంతలో మిలటరీ వాళ్ళు 'మానస సరోవరము నీళ్ళు
కైలాసగిరి రాళ్ళు కావాలని అడిగారు. మిలటరీ వారు ఇలా అడుగుతారని ముందుగానే
తెలియుట వలన వాళ్ళ కోసమని ప్రత్యేకముగా తెచ్చినది యిచ్చాము. భరత దేశములో
మేము తీసిన ఫోటో రీళ్ళను టిబెట్‌కు వెళ్ళేటప్పుడు దేశ భద్రతరీత్యా తీసుకున్నారు. వాటిని
భద్రము చేసి ఎవరి రీళ్ళను వారికి యిచ్చారు.

ఇంతలో రెండు హెలీకాప్టర్లు వచ్చాయి. 3 రోజుల క్రితం కొండరాళ్ళు విరిగి పడి
చనిపోయిన డాక్టరు, గైడుల శవాలను మంచులో భద్రపరచి యున్నవి. వాటిని హెలీకాప్టరులోనికి
చేర్చారు. బేస్ క్యాంపులో ఆ శవాలను చేరుస్తారని మిలటరీ ఆఫీసరు చెప్పారు.

ఆ పరిస్థితిని చూసి అందరమూ భయపడ్డాము. వాతావరణము పూర్తిగా చెడిపోయిన
ప్రయాణించుట దుర్లభమని భావించి, కష్టమైనా ప్రయాణించుటకు సిద్ధపడితిమి. చలిగాలి
తీవ్రత హెచ్చుగా వున్నది. నడుచుటకు చాలా కష్టముగా వున్నది. ఆ శివుని ధ్యానిస్తూ అట్లానే
నడుచుచుంటిమి. 10 కి.మీ. ప్రయాణము అనంతరము నడుచుట చాలా కష్టముగా వున్నది.
బురద కొండలపై నడక సాగటము లేదు. కొండపైన గడ్డి యుండటము వలన, ప్రక్కదారి ద్వారా
ప్రయాణము చేసి సాయంత్రము 4 గంటలకు బుద్ధికి చేరితిమి. ఇచట నుండి మాల్పాగాలాకు
వెళ్ళేదారి అంతా పాడైపోయినదని, రేపటికి కొంతవరకు బాగు చేయిస్తారని చెప్పారు. అందరికి
ఒళ్ళు నొప్పులు, జ్వర భయముగా వున్నందున డాక్టరు టాబ్లెట్లు యిచ్చారు. ఈ రోజు రాత్రి
బ్రెడ్, బోర్నవిటాతోనే డిన్నర్ పూర్తిచేశాము.

అందరము శివకీర్తనలు చేసి, విశ్రమించితిమి. రేపటికి వాతావరణము ప్రశాంతముగా
వున్నచో ప్రయాణము సాగును. లేనిచో ఏమిటి అనేది ప్రశ్నార్థకమే! ఎందుకంటే క్యాంప్‌లో
అహారపదార్థముల కొరత యున్నది.

<u>మాల్ఫావెప్పు :</u> ఉదయము 4 గంటలకే లేచితిమి. కాలకృత్యములు తీర్చుకొంటిమి. వాతావరణము



ప్రశాంతముగా వున్నది. రాత్రి విపరీతమైన గాలి, వర్షములతో అందరము విశ్రాంతి చెందియుంటిమి. ఇప్పటి ప్రశాంత వాతావరణమునకు సంతోషపడ్డ 5.30 గంటలకు ప్రయాణమైతిమి. కొండ చరియలు విరిగిపడుట వలన మాల్పా వెళ్ళే దారి మూసుకొనిపోయినది. అందువలన కొండ పైభాగమున ప్రయాణమునకు మార్గము ఏర్పరిచిరి. 1990 సంవత్సరము వరకు ఈ మార్గము ద్వారానే ప్రయాణించిరి. 1994 సంవత్సరము నుండి కొండ క్రింద తొలిచి మార్గము ఏర్పాటు చేసిరి. ఈ తుఫాను తాకిడికి మార్గము మూసుకొని పోవుట వలన పాత మార్గము గుండా ప్రయాణించుచుంటిమి. ఈ మార్గములో అడ్డుగా వున్న చెట్లను నరికి వేసిరి. మార్గములో కొన్ని చోట్ల బురదగా వున్నది. ఏ మాత్రము జారినా కొండ అంచుకు పోవలసినదే. దాని క్రింద యున్న కాళి గంగానదిలోనికి కలసిపోవలసిన పరిస్థితి కలుగును. అందువలన చాలా జాగ్రత్తగా నడుచుచుంటిమి. మధ్యలో, జలపాతముల పైనుండి నడుచుట చాలా చిత్రముగా, వింతగా, భయానకముగా యున్నది.

బుద్ధి నుండి మాల్పా దూరము 10 కి.మీ. కాగా, ఈ పాత దారి ద్వారా 15 కి.మీ. యుండెను. అనగా 5 కి.మీ.లు ఎక్కువగా యున్నది. అందరము చాలా జాగ్రత్తగా నడిచి మధ్యాన్నం 1.30 గంటలకి మాల్పా చేరితిమి.

అరగంటసేపు విశ్రమించి, టిఫిన్, కాఫీలను సేవించితిమి. మాల్పా క్యాంప్‌లోని కొన్ని టెంట్లు పడిపోయి ఉన్నవి. క్యాంప్ పరిస్థితి అనుకూలముగా లేదు. వాతావరణము పరిస్థితి రాత్రికి పూర్తిగా మారిపోతుందని, ఈ రోజే గాలా క్యాంప్‌కు చేరటము మంచిదని చెప్పారు. అందరము మరలా ప్రయాణమైతిమి. మార్గ మధ్యలో వున్న బ్రిడ్జీలు నేలమట్టమయ్యాయి. వాటి స్థానములో కొయ్యదుంగలు ఉంచితిరి. వాటిమీద ప్రయాణం చాలా కష్టతరమే. ఏదో విధంగా ప్రయాణముచేసి రాత్రి 9 గంటలకు గాలా చేరితిమి. చీకట్లో ప్రయాణము చేయుట టాలా కష్టమే. కాని, సమయోచితముగా నడువ వలసినదే

గదా! అందరికీ రస్నా యిచ్చారు. వేడి నీళ్ళతో స్నానము చేసితిమి. దుస్తులు మార్చుకొని భగవన్నామ సంకీర్తన చేయుచూ పూజాది కార్యక్రమములు పూర్తి చేసుకొంటిమి. వృద్ధులు మాత్రము శారీరకముగా ఎంతో బాధను అనుభవించిరి. పర్సనల్ పోర్టర్ల చేత మసాజ్ చేయించుకొన్నారు. రాత్రి 10.30 గంటలకు డిన్నర్ చేసితిమి. 11 గంటలకు విశ్రమించితిమి. అలిసిపోయి ఉండటము వలన గాఢ నిద్ర పోతిమి. 8050 అడుగుల ఎత్తులో ఈ క్యాంప్ వున్నది. అందువలన వాతావరణ ప్రభావము గురించి అంతగా భయపడనవసరం లేదు. రాత్రి భారీగా వర్షము ప్రారంభమైనది. కాని, యిచట గాలి తీవ్రత హెచ్చుగా లేదు. సిరఖా వైపు : ఉదయము 6 గంటలకు నిద్ర లేచితిమి. కాల కృత్యము, స్నానము పూర్తిచేసుకొంటిమి. పూజాది కార్యక్రమములు చేసితిమి. ఫలహారములు చేసి ఉదయము 9.30 గంటలకు సిరఖా వైపు ప్రయాణమైతిమి. ఈ వర్షము ప్రభావము వలన దారి అంతా గందరగోళ పరిస్థితి ఏర్పడినది. బ్రిడ్జీలు పడిపోయినవి. నదుల దారి కూడా మారియున్నది. కొన్నిచోట్ల త్రాళ్ళను కట్టిఉంచారు. వాటిని పట్టుకొని అతి కష్టము మీద నదులను దాటవలసి వచ్చినది. రాత్రి 7.30 గంటలకు సిరఖా క్యాంప్‌కు చేరితిమి. మా లగేజీ రావటము ఆలస్యమవుతుందని ముందుగానే హెచ్చరించటము వలన ఒక జతబట్టలు మాత్రము చేతి బ్యాగ్‌లో వుంచుకొంటిమి. యధా ప్రకారము కార్యక్రమములన్నింటినీ పూర్తి చేసుకొంటిమి. బుద్ధి, గుంజి క్యాంప్‌లో యున్న మిగతా బ్యాచ్ వాళ్ళనందర్నీ అచటనే నిలిపివేశారని వారి పరిస్థితి అగమ్యగోచరంగా వుందనీ వాతావరణ పరిస్థితి 10 రోజుల వరకు ఇదేవిధంగా ఉంటుందని క్యాంప్ ఆఫీసర్ చెప్పాడు. ఇలాంటి విపత్కర పరిస్థితులలో ఎక్కడా చిక్కుకొనక అందరమూ ప్రశాంతముగా తిరుగుముఖము పట్టినందులకు సంతోషించితిమి.

13-14 బ్యాచ్‌లను మానస సరోవర ప్రయాణమునకు నిలిపివేసిరి.

ఆరోజు రాత్రి విపరీతమైన గాలులతో వర్షము భీకరముగా పడుచుండెను. ఆ గాలుల తీవ్రతకు మా టెంట్ ఎక్కడ లేచి పోవులో ఏమో అని అందరం భయపడితిమి. ఆ పరమేశ్వరుని ధ్యానిస్తూ నిద్రపోయితిమి. ఉదయము 6 గంటలకు నిద్రలేచితిమి. కాల కృత్యములు పూర్తిచేసుకొని పూజాది కార్య క్రమములు పూర్తి చేసుకుంటిమి. 8 గంటలకు టిఫినమ చేసితిమి. బోర్నవిటా త్రాగితిమి. కైలాసపతి శివునకు జయజయములు పలుకి, ప్రయాణమును ప్రారంభించితిమి. ధార్చులా వైపు : నారాయణాశ్రమము మీదుగా గాక ప్రక్క దారి ద్వారా ప్రయాణము చేయుచుంటిమి. 'పంగు' కి వెళ్ళుటకు ఇదే దగ్గరి దారి. మధ్యాహ్నం 1 గంటకు 'పంగు' చేరితిమి. అచట భోజనాది కార్యక్రమములు పూర్తి చేసుకొని కొంతసేపు విశ్రమించితిమి.

సుమారు 2-30 గంటల ప్రాంతములో ప్రయాణమును మరలా ప్రారంభించితిమి. సాయంత్రం 6 గంటలకు 'తవ్వాఘాట్' చేరితిమి. అచట ఉండవలసిన చెక్కవంతెనలు

ముక్కలయిపోయినవి. కాళీగాంగా, ధౌళీగంగా నదుల సంగమ ప్రారంభములో ఈ వంతెనని ఏర్పాటు చేసియుండిరి. కాని, ఈ ప్రకృతి వైపరీత్యము వలన ఈ వంతెన ముక్కలయినవి. రెండు కొండల మధ్య 'రోప్' వేసిరి. వాటిని పట్టుకొని ప్రాణాలు అరచేతిలో పుంచుకొని ఈ నదీ సంగమమును దాటితిమి. 'తవ్వాఘాట్' నుండి ఒక కి.మీ. వరకు రోడ్డుమీద కొండ చరియలు విరిగిపడినవి. 15 ని॥లు అందరమూ విశ్రాంతి తీసుకొని, మరలా ప్రయాణమును కొనసాగించితిమి. ఎట్లయితేనేమి సాయంత్రము 7 గంటలకు బస్సు ఎక్కితిమి. రాత్రి 8-30 గంటలకు 'ధార్చులా' చేరితిమి. ఈ మానస సరోవర యాత్రకు యిదే బేస్ క్యాంప్. ఈ క్యాంప్ కాళీగంగా నది ప్రక్కనే యున్నది. ఈ నది చాలా చిత్రముగా ఉత్తేజముగా ప్రవహించుచున్నది. గంటకు 150 కి.మీ. స్పీడుతో ప్రవహించునట్లుగా మిలటరీ వాళ్ళు చెప్పారు. మా లగేజీ అంతా చేరటానికి ఆలస్యము అవుతుందని ముందుగా చెప్పడము వలన, ఒక జత బట్టలు, మానస సరోవర నీళ్ళ బాటిల్స్, రాళ్ళు నా చేతి బ్యాగ్‌లో మోసుకొని వచ్చితిని.

కొందరు ఆ విధంగా తీసుకొని రాలేదు. లగేజీ బ్యాగ్స్‌లోనే యుంచిరి. 'నీళ్ళబాటిల్స్'ను మోసుకొని ప్రయాణము చేయుట చాలా కష్టమే.

రేపు యిచ్చట విశ్రాంతి దినము. సెప్టెంబరు 7 వ తేదీన ప్రయాణమగును. సెప్టెంబరు 9 వ ఢిల్లీ చేరుతాము. 10వ తేదీన తిరుగు ప్రయాణము. అదీ కార్యక్రమము. ముందు బ్యాచ్ ప్రయాణము చేయుచున్న బస్సును కస్టమ్స్ అధికారులు ఆపివేసిరి. స్మగుల్డ్ వస్తువులకు డ్యూటీ వేశారు. కట్టినవాళ్ళు సరే, డబ్బు చెల్లించని వారు వస్తువులను అలాగే వదలివేశారు. మా బ్యాచ్‌కి మాత్రము అలాంటి భయము లేదు కాని వస్తువులు, బ్యాగ్‌లు సురక్షితంగా చేరుతాయో లేదో ఆ దేవునికే తెలియాలి.

ఈ యాత్ర కష్టసాధ్యమైనది. అటువంటి ఈ యాత్రను పూర్తిచేసి వచ్చుట పూర్వజన్మ సుకృతము. నేను నమ్మిన ఆ దేవి లలితా కామేశ్వరీ కామేశ్వరులు, బాసర సరస్వతీ అమ్మవారల అనుగ్రహముగా చెప్పవచ్చు.

శ్లో॥ అరుణాం కరుణా తరంగితాక్షీం
ధృత పాశాంకుశ పుష్పబాణ చాపామ్
అణిమాది భిరావృతాం మయూఖైః
అహమిత్యేవ విభావయే భవానీమ్॥

శ్లో॥ కాశ్మీర కుంకుమ విలేపన గౌరవర్ణాం
కాదంబినీ కుసుమ భూషిత నీలవేణీం
కోదండకార్ముక ధరాంకుచ భారనమ్రాం
వందే సమస్త సురసేవిత పాదపద్మాం॥

శ్లో॥ శరదిందు సమాకారే పరబ్రహ్మస్వరూపిణీ
వాసరాపీఠనిలయే సరస్వతీ నమోస్తుతే ॥

# కైలాస పర్వతము - విశిష్టత

ఈ కైలాస పర్వతము షుమారు 22,000 అడుగుల ఎత్తునుండి 25,000 అడుగుల ఎత్తున ఉన్నది. అర్థ చంద్రాకారములో ఈ శిఖరముండును. ఈ శిఖరము మంచుతో వుండును. ఈ కైలాసగిరికి పశ్చిమాన నల్లగా వుండే పర్వతము గలదు. దీని శిఖరము పడగవలె వుండును. ఈ పర్వతాన్ని 'రావణపర్వతం' అని అంటారు. అన్ని క్షేత్రముల కంటే ఉత్తమమయినది ఈ కైలాస పర్వతము. అందు ఆది దంపతులు నివాసస్థానముగా వుందురని మన పురాణముల చెప్పుచున్నవి.

టిబెట్ దేశీయులు కైలాస పరిక్రమను 'కోరా' విధానములో చేస్తారు. కోరా ప్రదక్షిణ విధానం అంటే 'సాష్టాంగ దండ ప్రదక్షిణము' అని అనవచ్చును. ఈ సాష్టాంగ దండప్రదక్షిణ చాలా కష్టమైనదని మామూలుగా ప్రదక్షిణ సవ్యదిశలో అంటే ఎడమ వైపు నుండి కుడివైపునకు చేస్తాంగదా! అదే కోరా పద్ధతిలో అయితే అపసవ్యదిశలో చేస్తారు. కుడి వైపు నుండి ఎడమ వైపు చేస్తారు. మధ్యలో రాళ్ళు, రప్పలు, మంచు దిబ్బలు, నీళ్ళు మొదలుగునవి ఏవి ఎదురైనా ఈ సాష్టాంగ ప్రణామముతో పరిక్రమను పూర్తి చేస్తారు. మామూలు ప్రదక్షిణ 3 రోజులు పడితే, 'కోరా' ప్రదక్షిణ 13 నుండి 15 రోజులు పడుతుంది. ఈ మార్గములో 3 గోంపాలున్నవి. తార్బొచే దగ్గరలో 'లామాలోయ గోంపా'. కైలాస ముఖద్వారానికి దగ్గరలో 'చొర్టెన్ కాంగ్ని గోంపా', 'చుకూ గోంపా'. ఆ తరువాత 'దిరాఫుక్ గోంపా' మొదటి రోజు రాత్రి మజిలీకి ఈ గోంపాలోనే. ఇచటనే టిబ్బూ శిఖరం కన్పిస్తుంది. టిబెట గ్రంధములైన "కాంగ్రి కర్చక్", "సొర్టెన్" మొదలగు పురాణములలో కైలాసగిరి విశిష్టత గలదు. దీనిలో కైలాస పర్వతము విశ్వము యొక్క మధ్య భాగమని వున్నది. ఈ పర్వతము నాల్గువైపుల నాలుగు రకములైన రంగులతో విరాజిల్లుతుంది. తూర్పున స్ఫటికమువలె, దక్షిణమున నీలమువలె, పడమర ఎరుపు వర్ణముగాను, ఉత్తరమున బంగారము వర్ణముగా కన్పించుట ఆశ్చర్యము.

ఈ పర్వతశిఖరం సుగంధ పుష్పాలతోనూ, అనేక మహిమాన్వితమైన ఓషధులతోనూ నిండి యున్నది. ఈ పర్వత చుట్టు ప్రక్కల ఎందరో దేవుళ్ళు, ప్రమధ గణాధిపతులకు నివాస స్థలములని. కొంతమంది యోగులకు మాత్రమే వీరి దర్శనము లభ్యమగునని చెప్పుచుందురు. మృదంగ, ఢమరుక, శంఖం, గంట లాంటి వాద్యాల శబ్దాలు వినిపిస్తాయని, చాలా మందికి అనుభవం గలుగటం విశేషము. పులి చర్మం ధరించి మెడలో పుర్రెల మాలతో, చేతిలో త్రిశూలం, ఢమరుకాలతో ప్రమధగణాలు కైలాసగిరి చుట్టూ వరుసకి 560 చొప్పున 990 వరుసల్లో అనేక శివశక్తులుంటాయని ప్రతీతి. ఈ కైలాసగిరికి క్షేత్ర పాలకుని పేరు "డెమ్ ఛోక్". క్షేత్రపాలిక పేరు "దోర్జె ఫాంగ్మో" ఈమెకే మన తంత్ర శాస్త్రరీత్యా "వజ్ర వారాహి" అని పేరు. ఈ కైలాసగిరి పశ్చిమాన ఈమె నివాస స్థలం. ఈ శిఖరం

పేరు "తీజుంగ్".

దీరాపుక్ గోంపా : పూర్వము దేవతలు మాత్రమే ఈ కైలాసగిరి పరిక్రమ చేసిడివారట. కొన్ని సంవత్సరముల క్రితము "గోత్ ఛంగ్పా" అనే పేరుగల 'లామా' కైలాసగిరి ప్రదక్షిణ చేయనిశ్చయించుకొని, పరమేశ్వరుని ప్రార్థంచి పరిక్రమను ప్రారంభించెనట ఒకానొకచోట 3 మార్గములు కనిపించగా ఎటువైపు వెళ్ళాలో అర్థంకాలేదు. ఇంతలో ఒక జడల బఱ్ఱె(యాక్) కుడివైపు లోయగుండా వెళ్ళడం చూచి తానుకూడా ఆ మార్గమున అనుసరించెనట. విచిత్రముగా ఆ జడల బఱ్ఱె ముఖము సింహము ముఖముగా మారెనట. దీరాపుక్ దగ్గర వున్న గుహలో ఆ యాక్ మాయమైనదని. అందువలన ఆ గుహకు "దీరాపుక్" గా నామకరణము చేసెనని చరిత్ర చెబుతున్నది. టిబెట్ భాషలో దీ = జడల బఱ్ఱె, రా = కొమ్ములు, పుక్ = గుహ అని అర్థం. ఈ లామా కొన్ని సంవత్సరములు ఇచ్చట తపస్సు చేసెను. ఇచట కైలాసగిరి పర్వతము లింగాకారము వలె బోర్లించిన వెండి పాత్రవలె కన్పించును. దానిపై పద్మముల మాలవలె చిత్రముగా కన్పించుట ఆశ్చర్యము కల్గించును.

కైలాస పర్వతమునకు లోపల ఒక పెద్ద గుహ గలదని, పర్వతమునకు నాలుగు వైపులా నాలుగు ద్వారములున్నవని ఈ "దీరాపుక్ గోంపా" క్యాంప్‌నకు దగ్గరలో ఆ ద్వారము కలదని అచటికి పోవుట అసాధ్యమని ఇచటవారి విశ్వాసము.

డోల్మా పాస్ వైపు : కొన్ని సంవత్సరములు తపస్సు చేసిన తదుపరి తన ప్రయాణమును మొదలు పెట్టెను. కొంత దూరము నడిచిన తదుపరి ఎటువైపు వెళ్ళాలో అర్థంకాలేదు. శివుని ప్రార్థించెను. ఎదురుగా ఒక 'నక్క' కన్పించినది. నక్క నడుస్తున్న వైపునకు ప్రయాణము సాగించుచుండెను. దారిలో నక్కల సంఖ్య పెరుగుతూ చివర 21 నక్కలు ఈ లామాకు దారి చూపుచున్నవి. 'డోల్మా' దగ్గరికి వచ్చేసరికి నక్కలన్నీ అదృశ్యమైనవి. 'డోల్మా' అనగా 'తారాదేవి' అని 'లా' అనగా కనుము అని అర్థం. ఇచట పెద్ద శిల గలదు. ఆ శిలనే 'తారాదేవి' అమ్మవారిగా భావించి, పూజ చేయుదురు. అక్కడ 'జందా'లు కట్టెదరు. 'తారాదేవి' అనుగ్రహము వలన గండాలు తొలగి ఆరోగ్యము కల్గును. ఈ డోల్మాపాస్ సముద్రపు మట్టానికి షుమారు 20,500 అడుగుల ఎత్తున గలదు. ఈ 'డోల్మాగిరి' క్రిందుగా 'గౌరి



మణిపద్మేహుం జప చక్రములు

కుండ్' వున్నది. ఈ సరస్సు అండాకారములో గలదు. షుమారు ముప్పావు మైలు పొడవు, అరమైలు వెడల్పు వుండును. ఎల్లప్పుడు ఈ సరస్సులోని నీరు మంచుతో మిశ్రమై వుండును. స్వామి ప్రణవానంద ఈ గౌరీ కుండ్‌లో పడవ మీద ప్రయాణించి 84 అడుగుల లోతు వున్నదని ప్రపంచమునకు తెలిపెను.

ఈ గౌరికుండ్‌కి టిబెట్ భాషలో "థుకే చెన్పోట్సో" అని పిలుస్తారు. "మహత్తరమైన సరస్సు" అని దీని అర్థము. ఈ సరస్సు ఆకు పచ్చ రంగుల్లో వుండును.

ఈశ్వరుని గురించి పార్వతీ దేవి ఇచటనే తపమాడినదని, ఈ సరస్సులోనే స్నానము చేసినదని పురాణ, ఇతిహాసములలో వర్ణించబడినది. ఇచట నుండి "జింగ్ జర్బ్" 10 కి.మీ. దూరముండును. దీని పూర్వనామము "జుతుల్ పుక్ గోంపా". ఇచటనే మిలారేపా కొంత కాలం గడిపెను. ఇచట మిలారేపా ఆలయం, రెండు పెద్ద ఏనుగు దంతములు కన్పిస్తాయి. ఇచట నుండి (Tarchen) కైలాసగిరి బేస్ క్యాంప్ షుమారు 15 కి.మీ. దారి అంతయూ విశాలముగానూ, నడకకు చాల సులభతరముగానూ ఉండును. షుమారు రెండున్నర గంటలు నడచిన Tarchen చేరవచ్చును. అంత సులువుగా దారి వుండును.

## కైలాసగిరి పరిక్రమ విధానము

ఈ పరిక్రమలో మూడు చోట్ల బుద్ధ భగవానుడి పాదముద్రల శిలలు కన్పిస్తాయి. వాటిని 'షాప్జే' అంటారు.

ఈ గిరి ప్రదక్షిణను 1, 3, 13 సార్లు చేస్తారు.

ఒకసారి ప్రదక్షిణ చేస్తే సర్వ పాపాలు పోతాయి. మూడు సార్లు ప్రదక్షిణ చేస్తే ఏడు జన్మల పాపాలు పోతాయి. పదమూడు సార్లు ప్రదక్షిణములు చేసిన జన్మరాహిత్యము కలుగుతుందని టిబెటన్ల విశ్వాసము.

## "ఇన్నర్ కోరా" పరిక్రమణ విశేషము

ఈ కైలాసగిరి పరిక్రమలు రెండు విధానముల గలవు. 1. ఇన్నర్ కోరా 2. అవుటర్ కోరా. టిబెట్ భాషలో కోరా అనగా 'ప్రదక్షిణ' అని అర్థము. అవుటర్ కోరా అనగా కైలాస పర్వతము చుట్టూ ప్రదక్షిణ చేయటం. ఇన్నర్ కోరా అనగా కైలాసగిరికి ఋజుమార్గములో గుండా ప్రయాణించి, కైలాస పర్వతమునకు చెందిన 'నంది కొండ'ను చుట్టి ప్రదక్షిణ చేసి కైలాస పర్వత గర్భాలయమును దర్శించుట. 13 సార్లు అవుటర్ కోరా(అంతర పరిక్రమ) చేసిన వారికి మాత్రమే ఈ ఇన్నర్ కోరా(అంతరంగిక ప్రదక్షిణ) చేయడాన్కి అర్హులు. తార్చెన్ నుండి ఉత్తర దిక్కుగా ప్రయాణించవలయును. 13సార్లు ప్రదక్షిణము చేయకుండా అంతరంగిక ప్రదక్షిణ చేయుట ప్రయత్నించిన మరణము తథ్యమని ప్రచారము గలదు. ఈ అంతరంగిక ప్రయాణము షుమారు 30 కి.మీ.. తార్చన్ నుండి 12 కి.మీ. దూరములో వున్న "సెర్లుంగ్ గోంపా" మీదుగా నంది కొండను చుట్టి కైలాసగిరి దక్షిణ ముఖమును దర్శించుకొని ఆరోజే రాత్రిలోగా 'తార్చెన్'గాని లేదా 'సెర్లుంగ్ గోంపా'కి గాని చేరుకోవలయును. దారిలో రుక్త, దుర్ఫీ అనే చిన్న సరస్సులున్నాయి. ఒక సరస్సులో నీరు నల్లగానూ, రెండో సరస్సులో నీరు తెల్లగానూ వుండును. మంచు తుఫాన్లు వస్తుంటాయి. మంచు రాళ్ళు దొర్లుతుంటాయి. ప్రయాణపుదారి మాత్రము సులభతరమే. ఈ ప్రదక్షిణ చేయవలెనన్న ఆక్సిజన్ సిలెండర్లు, స్లీపింగ్ బ్యాగ్‌లు, గుడారం బ్యాగ్‌లు తప్పనిసరి. నీటిని మోయటానికి టిబెట్లో కూలీలు దొరుకుతారు.

కైలాస పర్వతమునకు దక్షిణముఖమున ఎడమవైపు మహాకాల పర్వతము, కుడివైపు నంది పర్వతము గలవు. దక్షిణముఖమునకు పెద్దచార జటా జూటమువలె కన్పించును. దానిక్రింద గణపతి కొండ గలదు.

ఈ ఇన్నర్ కోరాలో పదమూడు స్తూపాలుండే "సెర్డుంగ్ ఛుక్సుమ్" ప్రాంతము గొప్ప విశేషమైనది.

ఈ కైలాసగిరి ప్రదక్షిణలో మనకు కన్పించే పవిత్ర స్థలముల వివరములు:

అవుటర్ కోరా

1. తార్చో చే : ప్రతి సంవత్సరం ఇచట బుద్ధుని జన్మదినమున ఒక ధ్వజమును నిలుపుదురు. ఇచట హోమం కూడా చేస్తారు.

2. చోర్టెన్ గాంగ్నీ : ఇది తోరణంలాంటి కట్టడం. దీని గుండా నడిచి పరిక్రమను ప్రారంభిస్తారు. దీని ద్వారా నడిస్తేనే యాత్ర నిరాటంగా సాగుతుంది. ఇచట నుండి కైలాస పర్వతమును చూసిన దక్షిణముఖము కన్పించును.

3. దీరాపూక్ గోంపా : కైలాసగిరి మొదట రోజు క్యాంప్ ఇచటనే. కైలాసగిరి ఉత్తర ముఖం చాలా స్పష్టంగా, చాలా దగ్గరగా, అత్యంత అద్భుతంగా కన్పించును. ఇచటి నుండి "డోల్మా పాస్" ప్రయాణం అత్యంత కష్టతరము.

4. శివస్థల్ : ఏదైనా వస్తువును వదిలి వేస్తారు. కొలత మంది ఇచట కావాలని చనిపోవుట కూడా జరుగును.

5. డోల్మా లా : ఇచట పెద్ద బండరాయి గలదు. ఈ బండకు పూజచేసి నెయ్యిని నివేదన చేస్తారు. యాత్రికులందరూ తమ జుట్టులోని కొన్ని వెంట్రుకలు, శరీరములోని రక్తపు బిందువులు, చేతి గోళ్ళని ఇచట వేస్తారు.

6. గౌరికుండ్ : పార్వతీదేవి స్నానమాచరించిన సరోవరము.

7. జుతుల్ పుక్ గోంపా : మిలారేపా నివసించిన ప్రదేశమిదియే.

ఇన్నర్ కోరా :

1. సెర్దుంగ్ ఛుక్సుమ్ : టిబెట్‌కు చెందిన ప్రసిద్ధ గురువుల అవశేషాలను 13 స్థూపాలలో భద్రపరచబడినవి. ఇచట మంచు తుఫానులు విరివిగా వచ్చును. మంచు రాళ్ళుకూడా దొర్లి పడుతూ ఉంటాయి.

2. త్సో కపాలా : ఇక్కడ నీటిని, మట్టిని ప్రసాదంగా స్వీకరిస్తారు.



కైలాస మానస సరోవర యాత్రను ముగించుకొని సెప్టెంబర్ 09, 1995 తేదిన విజయవాడకు చేరితిని. మిత్రులందరు, శ్రేయోభిలాషులందరు, మాతృమూర్తితో సహా అందరూ విజయవాడ రైల్వేస్టేషన్‌కు వచ్చి అభినందనలు తెలిపి, స్వగ్రామమైన నరసరావుపేటకు తోడ్కొని వచ్చిరి.

ఈ పుస్తకము చదివి ప్రతి ఒక్కరు ఆ పరమేశ్వరుని అనుగ్రహమువలన ఈ యాత్రను చేయగలరని మరియు ఈ పుస్తకము చదివిన వారందరికి ఆ పరమేశ్వరుని అనుగ్రహమునకు పాత్రులగుదురుగాక.

ఓం నమః శివాయ ఓం నమః శివాయ ఓం నమః శివాయ



# లఘు శివపూజా విధానం

ఆచమ్య -

సంకల్పం -

కలశపూజ -

## గణపతి ప్రార్థన :

వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ
నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా - ॥

అని గణపతికి నమస్కరించవలయును.

## శివావాహన :

కర్పూర గౌరం కరుణావతారం
సంసారసారం భుజగేంద్రహారం
సదారమంతం హృదయార విందే
భవం భవానీ సహితం నమామి - ॥

అసునీతే పునరస్మాసు చక్షుః పునఃప్రాణమిహినో ధేహిభోగం
జ్యోక్పశ్యేమసూర్య ముచ్చరంత మనుమతే మృదయాన స్వస్తి - ॥
స్వామిన్ సర్వజగన్నాథ యావత్పూజావసానకం
తావత్వం ప్రీతిభావేన లింగేస్మిన్ సన్నిధిం కురు - ॥

ఆరాధితో మనుష్యైః త్వం శుద్ధైఃదేవాసురాదిభిః
ఆరాధయామి భక్త్యాత్వాం మాం గృహాణ మహేశ్వర ॥

- ఈశాన మావాహయామ

దేహా దేవాలయః ప్రోక్తః జీవో దేవః సనాతనః
త్యజేత్ అజ్ఞాన నిర్మాల్యం సోహంభావేన పూజయేత్ ॥

- ఓం సద్యోజాతం ప్రపద్యామి ఆవాహనం.

## ఆసనం :

త్ర్యంబకం యజామహే సగంధిం పుష్టి వర్ధనం
ఉర్వారుకమివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్ - ॥

- రత్నసింహాసనం సమర్పయామి

## పాద్యం :

ఓం సద్యో జాతాయై నమోనమః

- పాద్యం సమర్పయామ.

__అర్ఘ్యం :__

ఓం భవేభవేనాతి భవే భవస్వమాం

- అర్ఘ్యం సమర్పయామి.

__ఆచమనీయం :__

ఓం భవోద్భవాయనమః

- ఆచమనీయం సమర్పయామి.

__స్నానం :__

ఓం వామ దేవాయనమః

- స్నానం సమర్పయామి

ఓం నమశ్శంభవేచ మయోభవేచ నమశ్శంకరాయ చ మయస్కరాయచ

నమశ్శివాయచ శివతరాయచ – ॥

మూడుసార్లు(3) లేదా ఇరవై ఎనిమిదిసార్లు(28) పై మంత్రమును చెప్పి అభిషేకము చేయవలయును. పాలు, పెరుగు, నెయ్యి, తేనె, శర్కర, ఫలోదకం, శుద్ధోదకముతో అభిషేకము చేయవచ్చును.

__వస్త్రం :__

ఓం జ్యేష్ఠాయనమః

- వస్త్రం సమర్పయామి

__ఉపవీతం :__

ఓం శ్రేష్ఠాయనమః

- ఉపవీతం సమర్పయామి

__గంధం :__

ఓం కాలాయనమః

- గంధం ధారయామి

__అక్షతలు :__

ఓం కలవికరణాయనమః

- ధవళాక్షతాన్ సమర్పయామి

__ఆభరణం :__

ఓం రుద్రాయ నమః

- ఆభరణాని సమర్పయామి.

__పుష్పాలు, పత్రాలు, బిల్వాలు :__

ఓం బలవికరణాయనమః

- పుష్పై పూజయామి

ఓం నిధన పతయే నమః
ఓం నిధన పతాంతికాయనమః
ఓం ఊర్ధ్వాయ నమః
ఓం ఊర్ధ్వలింగాయ నమః
ఓం హిరణ్యాయ నమః
ఓం హిరణ్యలింగాయ నమః
ఓం సువర్ణాయ నమః
ఓం సువర్ణలింగాయ నమః
ఓం దివ్యాయ నమః
ఓం దివ్యలింగాయ నమః
ఓం భవాయనమః
ఓం భవలింగాయ నమః
ఓం శర్వాయనమః
ఓం శర్వలింగాయ నమః
ఓం శివాయనమః
ఓం శివలింగాయ నమః
ఓం జ్వాలాయనమః
ఓం జ్వాలలింగాయ నమః
ఓం ఆత్మాయ నమః
ఓం ఆత్మలింగాయ నమః
ఓం పరమాయనమః
ఓం పరమలింగాయ నమః

(అవకాశమున్నచో సహస్రనామము/అష్టోత్తరములు చెప్పవచ్చును.)

ఓం త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రంచ త్రయాయుధమ్
త్రి జన్మ పాప సంహారం ఏకబిల్వం శివార్పణమ్ – ॥

– బిల్వపత్రం సమర్పయామి.

ధూపం :

ఓం బలాయనమః

– ధూప మాఘ్రాపయామి

దీపం :

ఓం బలప్రమథనాయనమః

– దీపం దర్శయామి

నైవేద్యం :

ఓం సర్వభూత దమనాయ నమః

– అమృత నైవేద్యం సమర్పయామి.

తాంబూలం :

ఓం మనోన్మనాయ నమః

– తాంబూలం సమర్పయామి

నీరాజనం :

ఓం అఘోరేభ్యో థ ఘోరేభ్యో ఘోరఘోర తరేభ్యః
సర్వేభ్యః సర్వశర్వే భ్యో నమస్తే అస్తు రుద్రరూపేభ్యః – ॥

– కర్పూరనీరాజనం దర్శయామి

## మంత్ర పుష్పం :

ఓం తత్పురుషాయ విద్మహే మహాదేవాయ ధీమహి
తన్నోరుద్రః ప్రచోదయాత్
- సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి

## ఆత్మప్రదక్షిణ :

ఓం ఈశాన సర్వవిద్యానాం ఈశ్వర సర్వభూతానాం
బ్రహ్మాధిపతిః బ్రహ్మణోధిపతిః బ్రహ్మాశివోమే అస్తు సదాశివోమ్ ॥
- ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి

## ధ్యానం :

ఆత్మాత్వం, గిరిజామతిః సహచరాం ప్రాణాః శరీరం గృహమ్
పూజాతే విషయోప భోగరచనా నిద్రా సమాధిస్థితిః
సంచారాః పదయోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వాగిరః
యద్యత్ కర్మకరోమి తత్తదఖిలం శంభో తవ ఆరాధనమ్ - ॥
- బిల్వాక్షతాన్ సమర్పయామి

## తర్పణం :

భవం దేవం తర్పయామి
శర్వం దేవం తర్పయామి
ఈశానం దేవం తర్పయామి
పశుపతిం దేవం తర్పయామి
రుద్రం దేవం తర్పయామి
ఉగ్రం దేవం తర్పయామి
భీమం దేవం తర్పయామి
మహాంతం దేవం తర్పయామి

## పునః పూజాంచ కరిష్యే :

ఛత్ర మాచ్ఛాదయామి - చామరం వీజయామి - నృత్యం దర్శయామి - గీతం శ్రావయామి. ఆందోళికా నారోహయామి - అశ్వానారోహయామి, గజానారోహయామి - సమస్త రాజోపచార దేవోపచార, శక్త్యోపచార భక్త్యోపచార పూజా సమర్పయామి.

నమో హిరణ్యబాహవే హిరణ్యవర్ణాయ హిరణ్యరూపాయ హిరణ్య పతయే అంబికా పతయే ఉమాపతయే పశుపతయే నమో నమః ఓం నమస్తే అస్తు భగవన్ విశ్వేశ్వరాయ మహాదేవాయ త్ర్యంబకాయ త్రిపురాంతకాయ త్రికాగ్నికాలాయ కాలాగ్ని రుద్రాయ నీలకంఠాయ మృత్యుంజయాయ సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీ మన్మహాదేవాయనమః
- అనేన పూజానేన భగవాన్ సర్వాత్మకః ప్రీయతాం

తీర్థం

అకాలమృత్యుహరణం, సర్వవ్యాధి నివారణం సమస్త పాపక్షయకరం శ్రీ భవాని శంకరస్వామి పాదోదకం
పావనం శుభమ్ - ॥ (అని తీర్థం పుచ్చుకొనవలెను.

# Day-wise schedule to the Yatra
## (India Side)

The Kailash Mansarovar Yatra takes normally **28 days**. Of these 28 days, 11 days yatra is in Chinese side and rest days of the yatra is in Indian side. The trekking starts on 4th day on the Indian side. The Kumaon Mandal Vikas Nigam Limited makes arrangements to provide accomodation, transportation and food on the Indian side of the Yatra. Where as Chinese authorities makes arrangemet for accomodation, logistics and other arrangements on the Chinese side.

The daywise schedule of yatra is given below.

***First Day*** :The pilgrims cover 320 Km from Delhi to Kathgodam via Moradabad, Rampur, Haldwani. They cross the rivers Yamuna, Ganga and Ramganga W. rivers on the way. Before starting the journey, pilgrims are briefed by the Under Secretary, Ministery of External Affairs, about the Yatra and their medical check-up is done at Indo-Tibetian Border Police Centre.

***Second Day :*** After having Breakfast at Kathgodam, the journey to Bageshwar starts. At lunch, bus reaches to Almora and lunch is served in the KMVN (Kumaon Mandal Vikas Nigam) guest house. Then there is drive uphill to Bageshwar which lies on the confluence of Gomti and Saryu.

***Third Day :*** Before breakfast at Bageshwar, the Baijnath temple may be visited. From here the pilgrim reach Chaukori via Kanda - Vijaypur - Kotmunya. Everyone will be pleased by the impressive view of the mighty Himalaya form the tea estate of Chaukori. Then there is a drive downhill to Thal, uphill to Didihat where lunch is served, then downhill again to Ogla - Jauljibi and finally along the Gori river till they reach Dharchula, crossing the Gomti, Saryu, Ramganga E. and Gori on the way. One can now see the mountains of Nepal. The distance covered is 160 Km.

***Fourth Day*** : 19 Km from Dharchula the Dhauli E. meets the Kali at Tawaghat. One can plan to reach out and touch the Chhiplakot peaks, lakes and glaciers via village Khela in a future trip. The pilgrims cross the bridge over the roaring Dhauli and see the confluence of the Kali and Dhauli, and then drive on to Mangti. If one is lucky one might find oneself in this region during the Kandali festival which is held once in twelve years. Travel along the Kali river through dense forest to climb up to the village of Gala (2440m). Here are KMVN's cottages. There is a PWD dak bungalow at Jipti (2378m) 2 Km further.

***Fifth Day*** : Although Gala to Buddhi (2740 m) via Malpa (2018m) is 20

Km. To reach Malpa one has to climb down 4444 steps to reach the river Kali. This place is Lakhanpur. To the right of the Kali is the Chhata fall. On the left is also a fall in Nepal. Next is the beautiful Najang fall. The Kali seems almost like a violent storm in this region. Budi (2740m) is at a distance of 9 Km from Malpa and the group rests at Lamre before reaching Budi. There are numerous springs and waterfalls on either side of the river; also can seen the Api - Nampa range of Nepal.

***Sixth Day :*** Gunji (3500m) is 17 Km from Budi. On reaching Chhialekh the group enters the region of Byans. The pasture of Chhialekh is strewn with grasses and flowers. Then comes Garbhiang village (3225m), deserted because of geopolitical and geological reasons. Here the Kali meets the Tinkar coming from Nepal. The Kali is no longer intimidating and becomes almost silent by the time Gunji (3500m) comes. The trek from Budhi to Gunji via Chhialekh and Garbhiang is 20-22 km long and most tiring of all. Buddhi to Chhialekh is a steep climb. On the way Api mountain range on the Nepal side is seen.

***Seventh Day :*** One moves along the relatively quieter Kali to walk 10 Km to reach Kalapani (3600m). There are pine, bhojpatra and juniper forests in this region. Although the river has been coming all the way from Lipulekh pass, the small pool formed under a huge rock is considered to be the source of the Kali. There are snow - clad mountains all around and Vyas's cave is to be found on the mountain in front of Kalapani. It was because of the visit of Rishi Vyas that the region is known as Byans. There is also a hot water spring at Kalapani.

***Eight Day :*** The group covers the 9 Km from Kalapani to Navidhang (3987m) surrounded by innumerable wild flowers. This is the region of Musk deer and Monal and the highest stage of Himalayan wilderness. The 'Om Parvat' smiles in front of the pilgrim.

***Ninth Day :*** After walking 8 Km from Navidhang to the Lipulekh pass (5334m), the pilgrims enter Tibet, where the Tibetan/Chinese autorities welcome them. They walk down to Chang Lobochahela and from here by truck and bus they reach the old trading town of Taklakot (Purang), which is situated on the banks of the Karnali river.

***Tenth and Eleventh Day*** : The pilgrims staying at Purang Guest House (4267m) can walk to town, Shimling monastery, Nepali market and Karnali river. 3-4 Km away is the damaged memorial of the Dogra General Jorawar Singh. The formalities of emigration and payment to the Chinese authorities are completed here. Yaks for the Kailash Parikarama and ponies for thr Manas Parkaramas are to be requisitioned here only.

***Twelfth Day*** : The pilgrim group is divide into two subgroups, one for Kailas and another for Manas parikrama. The bus starts from Purang around midninght. Before sunrise the bus crosses the Gurla Pass (4910m). Then comes Rakastal (Long Tso, 4515m) on the left western slopes of Gurla Mountain (Memo Nani, 7683m) on the right and Mt. Kailas (Kang Rinpoche, 6675m) in front. Next is the first glimpse of Mansarovar (Tso Mapam, 4530m) at Zaidi. After crossing Parkha plains the bus reaches Tarchen, the base camp fro Kailas parikrama. Group 'A' stays at Tarchen and 'B' is taken to Hore by Bus.

***Thirteenth Day :*** Group 'A' walks 20 Km along the Lha Chhu, constantly looking at Mt. Kailas and its changing faces. Before sunset one should reach Dirapuk Gompa (4909m) and enjoy the northern face of Kailas at sunset. Group 'B' walks along the southeastern shore of Manas. After crossing Samo and Tag rivers and visiting Seralung and Yerngo Gompa for night stay after walking or riding for 30 Km. Here in front of the pilgrim is the Manas and elevated Kailas and behind are the grand peaks of Gurla Mandhata.

***Fourteenth Day:*** This is a slightly difficult day for group 'A'. Along Dolma La chhu the group reaches the Dolma pass (5636m), where the huge stone memorial of goddess Dolma (Tara Devi) is located. After resting and praying pilgrims walk down to Gaurikund (Tukji Chenpo Tso) and reach Zutulpuk Gompa along Lham Chu. Group 'B' walks for 40 Km along the south - western shore of Manas - the region is full of birds and flowers. Before the completion of parikrama of Manas at Zaidi, one can also visit Gossul Gompa.

***Fifteenth Day :*** Group 'A' completes Kailas parikrama on this day by noon. Rest of the day can be used for visiting Gyengtak Gompa and Astpad, the southern face of Kailas from the ridge (6675m) above Gyengtak Gompa. This is the rest day for group 'B' but Chiu Gompa and Ganga Chhu, the natural channel which connects Manas with Rakastal, may be visited by walking 8*2 = 16 Km. From this point, grand view of Manas, Rakas, Kailas and Gurla can be seen.

***Sixteenth to Twentieth Day :*** Group 'B' comes to Tarchen for Kailas Parikrama and group 'A' to hore for Manas parikrama. Form the 18th to the 20th days, both groups completes their respective parikramas. Form the 21st day, 'B' group comes to a waiting 'A' group of Zaidi. After prayers, bath and yajnya the pilgrims comes back to Purang enjoying the grand views of Kailas and Rakastal on the way.

***Twenty first Day*** : Before lunch the pilgrim visit the Khojarnath Gompa, 25 Km away from Purang and situated at the bank of Karnali. In the evening,

Purang market may be visited. It is now time for purchasing things from the market and government departmental stores. The pilgrims can visit Taklasar or Simling Gompa also.

***Twenty Second to Twenty Eight :*** Day Back to Lipulekh (5122m) and finally down to Kalapani on 22nd day. 23rd Gunji, 24th Budi, 25th Gala, 26th Dharchula, 27th Bageshwar by bus. On the Twenty eight day the group reaches to N.Delhi.

# VARIOUS MT. KAILASH TOURS

## (Nepal Side)

BEST SEASON: MAY - SEPTEMBER

MT. KAILASH PILGRIMAGE TOUR — 14 DAYS
MT. KAILASH - ALI - LHASA TOUR — 21 DAYS
SIMIKOT - PURANG - MT. KAILASH - GUGE KINGDOM — 22 DAYS
TSEDANG - LHASA - GUGE KINGDOM - LHASA — 23 DAYS
SIMIKOT - TAKLAKOT - MT. KAILASH - LHASA — 23 DAYS
MANASAROVAR - TSAPARANG - SHIQUANHE - LHASA — 25 DAYS
SIMIKOT - MANASAROVAR - MT. KAILASH — 28 DAYS
LHASA - MT. KAILASH - EVEREST BC — 28 DAYS
SIMIKOT - PURANG - MANASAROVAR - LHASA — 29 DAYS

### MT. KAILASH PILGRIMAGE TOUR — 14 DAYS

**DAY 01 KATHMANDU - NYLAM.** (3800m) - 165 kms. 8hrs. Drive to Nylam. Overnight in guest house.
**DAY 02 NYLAM - YAK KHARKA.** (4850m) - 221 kms, 7 - 8 hrs. Drive to Yak Kharka. Overnight in tented camp.
**DAY 03 YAK KHARKA - NEW DHONGPA.** (4640m) - 115kms, 6 -7 hrs. Drive to New Dhongpa. Overnight in tented camp.
**DAY 04 SNEW DHONGPA - MAYUMLA PHEDI.** (4540m) - 185 kms - 7-8 hrs. Drive to Mayumla Phedi. Overnight in tented camp.
**DAY 05 MAYUMLA PHEDI - MANASAROVAR.** (4560m) -290kms, 7-8 hrs. Drive to Manasarovar. Overnight in tented camp.
**DAY 06 MANASAROVAR - DARCHEN.** Full day excursion around Lake Manasarovar and drive to Darchen. Overnight in tented camp.
**DAY 07 DARCHEN -DIRAPUK.** (4909m) - 18kms , 6 hrs. Drive up to Darchen the Parikarma Starting Point. From here we start the Kailash Parikarma up to Dirapuk, 7hrs walk approx. Overnight in tented camp.

**DAY 08 CONTINUE PARIKARMA** crossing Domala Pass (5650m) up to Zutulpuk 7-8 hrs walk. Overnight in tented camp.
**DAY 09 END PARIKARMA at HORCHU.** (4700m) - 14kms 3-4 hrs walk. Overnight in guest house.
**DAY 10 HORCHU - MAYUMLA PHEDI.** (4540m) - 277kms. Drive to Mayumla Phedi approx. 7 - 8 hrs. Overnight in tented camp.
**DAY 11 MAYUMLA PHEDI - NEW DHONGPA.**( 4840m) - 185 kms. Drive to New Dhongpa approx. 8 hrs. Overnight in tented camp.
**DAY 12 NEW DHONGPA - YAK KHARKA.** (4850m) - 115kms. Drive to Yak Kharka approx. 8 hrs. Overnight in tented camp.
**DAY 13 YAK KHARKA - NYLAM.** (3220m) - 221kms. Drive to Nylam approx. 7 - 8 hrs. Overnight in guest house.
**DAY 14 NYLAM - KATHMANDU.** (165 kms )Drive to Kathmandu approx 8 hrs.

## MT. KAILASH - ALI - LHASA TOUR — 21 DAYS

**DAY 01 KATHMANDU - ZHANGMU.** Drive to Zhangmu. Overnight in Hotel.
**DAY 02 ZHANGMU - PAIKOTSO LAKE.** Drive to Paikotso Lake. Overnight in tented camp.
**DAY 03 PAIKOTSO - ZHONGBA.** Drive to Zhongba. Overnight in tented camp.
**DAY 04 ZHONGBA - MAYUMLA.** Drive to Mayumla. Overnight in tented camp.
**DAY 05 MAYUMLA - DARCHEN.** Drive to Darchen. Overnight in lodge.
**DAY 06 KORA.** Overnight in tented camp.
**DAY 07 KORA.** Overnight in tented camp.
**DAY 08 MT. KAILASH - MANASAROVER.** Drive to Mansarover. Overnight in tented camp.
**DAY 09 MANASAROVAR - ALI.** Drive to Ali. Overnight in tented camp.
**DAY 10 ALI - GERJI.** Drive to Gerji. Overnight in tented camp.
**DAY 11 GERJI - GERTSE.** Drive to Gertse. Overnight in tented camp.
**DAY 12 GERTSE - TSOCHIN.** Drive to Tsochin. Overnight in tented camp.
**DAY 13 TSOCHIN - SAGA.** Drive to Saga. Overnight in tented camp.
**DAY 14 SAGA - LHATZE.** Drive to Lhatze. Overnight in tented camp.
**DAY 15 LHATZE - XIGATSE.** Drive to Xigatse via Sakya Monastery.Overnight in Hotel.
**DAY 16 XIGATSE - GYANTSE.** Drive to Gyantse. Overnight in Hotel.
**DAY 17 GYANTSE - LHASA.** Drive to Lhasa via Yamdrok Tso. Overnight in Hotel.

DAY 18 LHASA. Sightseeing in Lhasa. Overnight in Hotel.
DAY 19 LHASA. Sightseeing in Lhasa. Overnight in Hotel.
DAY 20 LHASA. Sightseeing in Lhasa. Overnight in Hotel.
DAY 21 LHASA - KATHMANDU. Fly back to Kathmandu.

## SIMIKOT - PURANG - MT. KAILASH GUGE KINGDOM — 22 DAYS

**DAY 01 KATHMANDU - NEPALGUNJ.** Fly to Nepalgunj. Overnight in Hotel.

**DAY 02 NEPALGUNJ - SIMIKOT - MAJGAON.** Fly to Simikot and start trek to Majgaon.Overnight in tented camp.

**DAY 03 SIMIKOT - DHARAPHERI.** Trek to Dharapheri. Overnight in tented camp.

**DAY 04 DHARAPHERI - SALIKHOLA.** Trek to Salikhola. Overnight in tented camp.

**DAY 05 SALIKHOLA - MUCHU.** Trek to Muchu. Overnight in tented camp.

**DAY 06 MUCHU - YARI.** Trek to Yari. Overnight in tented camp.

**DAY 07 YARI - HILSA.** Trek to Hilsa. Overnight in tented camp.

**DAY 08 HILSA - SHER - PURANG.** Trek to Sher, drive to Purang. O/ night in tented camp.

**DAY 09 PURANG - MANASAROVAR.** Drive to Mansarover. Overnight in tented camp.

**DAY 10 IN MANASAROVAR.** Excursion around Manasarovar. Overnight in tented camp.

**DAY 11 MANASAROVAR - DARCHEN - KAILASH KORA START.** Drive to Darchen and start trek around Mt Kailash. Overnight in tented camp.

**DAY 12 CONTINUE MT. KAILASH KORA.** Overnight in tented camp.

**DAY 13 MT. KAILASH END AT DARCHEN.** Overnight in lodge/ tented camp.

**DAY 14 DARCHEN - TIRTHAPURI.** Drive to Tirthapuri. Overnight in tented camp.

**DAY 15 TIRTHAPURI - GUGE KINGDOM.** Drive to Guge Kingdom ( Toling and Tsaprang). Overnight in tented camp.

**DAY 16 IN GUGE KINGDOM.** Visit Toling Monastery, Tsaprang and Dungkar Caves.Overnight at Zanda in tented camp.

**DAY 17 ZANDA - DARCHEN.** Drive to Darchen. Overnight in tented camp.

**DAY 18 DARCHEN - PARYANG.** Drive to Paryang. Overnight in tented camp.

**DAY 19 PARYANG - SAGA.** Drive to Saga. Overnight in tented camp.

**DAY 20 SAGA - PAIGUTSO LAKE.** Drive to Paigutso Lake. Overnight in tented camp.
**DAY 21 PAIGUTSO LAKE - NYLAM.** Drive to Nylam. Overnight in tented camp.
**DAY 22 NYLAM - KATHMANDU.** Drive to Kathmandu. night in tented camp

## LHASA - MT KAILASH & EVEREST BC— 28 DAYS

**DAY 01 Arrive KATHMANDU** (1370m), transfer to Hotel - Overnight in hotel.
**DAY 02 KATHMANDU - LHASA** (3490m). Fly Kathmandu / Lhasa - transfer to hotel- Overnight in hotel.
**DAY 03 LHASA.** Overnight in hotel.
**DAY 04 LHASA.** Overnight in hotel.
**DAY 05 LHASA.** Overnight in hotel.
**DAY 06 LHASA.** Overnight in hotel.
**DAY 07 LHASA - GYANTSE.** Drive to Gyantse- Overnight in Gyantse hotel.
**DAY 08 GYANTSE - XIGATSE.** Drive to Xigatse- Overnight in Xigatse hotel.
**DAY 09 XIGATSE - LHATZE.** Drive to Lhatze 157 km - Overnight in tented camp.
**DAY 10 LHATZE - SAGA.** Drive to Saga 58 km - Overnight in tented camp.
**DAY 11 SAGA - PARYANG.** Drive to Paryang 121 km by the Saga La (4725m) - Overnight in tented camp.
**DAY 12 PARYANG - DARCHEN.** Drive to Darchen 250 km by the Mayum La - Overnight in tented camp.
**DAY 13 START KORA** of Mt. Kailash. Overnight in tented camp.
**DAY 14 CONTINUE KORA** of Mt. Kailash. Overnight in tented camp.
**DAY 15 CONTINUE KORA** of Mt. Kailash. Overnight in tented camp.
**DAY 16 CONTINUE KORA** of Mt. Kailash. Overnight in tented camp.
**DAY 17 END KORA** and & drive to Manasarovar- Overnight in tented Camp.
**DAY 18 MANASAROVAR - PARYANG.** Drive to Paryang - Overnight in tented camp.
**DAY 19 PARYANG - SAGA.** Drive to Saga. Overnight in tented camp.
**DAY 20 SAGA - ZURTSO.** Drive to Zurtso. Overnight in tented camp.
**DAY 21 ZURTSO - TINGRI.** Drive to Old Tingri - Overnight in tented camp.
**DAY 22 TINGRI - DZARONGPU MONASTERY.** Drive to Dzarongpu

మ్యాక్ - గణపతి యమ్.



# హెయిర్ కేర్

శ్రీ వేంకటేశ్వర జెంట్స్ బ్యూటీ పార్లర్

వాసు కాంప్లెక్స్, అరండల్‌పేట, నరసరావుపేట

© 222172

# శ్రీ కుసుమ హరనాథ జనరల్ స్టోర్స్

ప్రొ॥ రెడ్డి నరసింహారావు

గాంధీచౌక్, నరసరావుపేట - 522 601

Ph. 226144(O) 226155(R)

# నాగార్జున డయాగ్నస్టిక్ సెంటర్

(కంప్యూటరైజ్డ్ ల్యాబ్)

నాగసరపు రామారావు కాంప్లెక్స్, పల్నాడురోడ్, నరసరావుపేట

స్విస్ మ్యాక్స్ జపాన్ వారి అత్యాధునిక -21 హెమటాలజి ఎనలైజర్ మరియు ఎర్బా బయోకెమిస్ట్రీ ఎనలైజర్‌లతో పరీక్షలు చేయబడును.

ప్రొ॥ కలామ్ అన్సారి © 222561

# KJ కలామ్ జ్యూయలర్స్

అరండల్‌పేట, నరసరావుపేట - 522 601

వెండి, బంగారు నగలు ఆర్డర్లపై తయారుచేయబడును.




తిరుమల

పాలు

చిక్కనైనవి... చక్కనైనవి



నాణ్యమైన పాల సరఫరాతో వినియోగదారుల
మన్ననలు పొందిన తిరుమల ఇప్పుడు అందిస్తోంది
తెలుగునాట......... నారీజన నీరాజనాలందుకొన్న

# తిరుమల నెయ్యి!




అదే స్వచ్ఛత! అదే నాణ్యత!
అగ్‌మార్క్ ప్రమాణాలతో!
రుచి, శుచి, సువాసనల మేళవింపు!!

అన్ని సైజుల
ప్యాకింగ్‌లలో
లభ్యం!



ISO 9001:2000

## తిరుమల మిల్క్ ప్రోడక్ట్స్ ప్రై. లిమిటెడ్

ఫ్యాక్టరీ : కడివేడు-గూడూరు, నెల్లూరు జిల్లా. ఫోన్: 08624-202502
రిజిష్టర్డ్ ఆఫీస్: నరసరావుపేట, గుంటూరు జిల్లా. ఫోన్: 08647-232677

ఏ.పి. లో డిస్ట్రిబ్యూషన్ కొరకు (ఖాళీ ఉన్న ప్రాంతాలకు మాత్రం) సంప్రదించండి 98484 57199